# జయవిజయుల విజయ వైభవం

వచన కృతి

రచన :

**గణపతి శంకరరావు** బి.యస్.సి.ఎ.జి.

శ్రీమతి ప్రతిభ - శ్రీ గణపతి శంకరరావు గార్ల

## వివాహ స్వర్ణోత్సవ కానుక



ఓం భూర్భువః స్వః తత్సర్వితుర్వరేణ్యం
భర్గోదేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్



ఫ్లాట్ నెం. 8, శ్రీరామ్ అపార్ట్‌మెంట్,
చారువాక చౌక్, మహారుద్రకాలనీ,
ఇందిరానగర్, నాసిక్,
మహారాష్ట్ర - 422 009
సెల్ : 9440913777

**ముద్రణ :** మే - 2018
**ప్రతులు :** 1000
**మూల్యము :** 100/- రూపాయలు

**ప్రతులకు :**
రచయిత నివాసము

గ్రాఫిక్స్ :
**ప్రసాద్ గ్రాఫిక్స్**
సెల్ : 98481 40843

ముద్రణ :
**మౌనిక గ్రాఫిక్స్**
హైదరాబాద్.

కవర్ డిజైనర్ :
**నితిన్ డిజిటల్,**
నిజామాబాద్.
సెల్ : 77948 90009

**ఇందులో...**



సర్వేజనాః సుఖినోభవంతు

# అంకితం



నాకు తోడు నీడగా నిలిచిన

నా శ్రీమతి ప్రతిభకు సహృదయముతో అంకితము



# సమర్పణ



ప్రేరణనిచ్చిన వాసరమ్మకు



జన్మనిచ్చిన అమ్మానాన్నలకు

# తొలి గెలుపు

**– కవిభారతి మేడిచర్ల ప్రభాకరరావు**

శ్రీ జి.యస్. రావు (గణపతి శంకరరావు) గారితో నాకు ఆత్మీయ బంధుత్వమున్న మిత్రత్వభావమే అధికముగా చోటు చేసుకొన్నది. అందుకే ఆయన మానసిక తత్త్వాన్ని పూర్తిగా అవగాహన చేసుకోగలిగినాను. జి.యస్.రావు గారి చిన్న తనము నుండి తానేదో సాధించి లోకానికందించాలని తపన గలిగినవాడు. కనుకనే ఆయనలో అన్వేషణ భావము అధికంగా చోటు చేసుకొన్నది. సాధించాలన్న తపన గలిగిన వారికి కోపము కూడ సహజముగా తోడుకాగలదు.

నిజానికి రావు గారు సాధుస్వభావి. పరోపకారముచేయాలనే పరమహితాభిలాషి. అతనిలో అంకురించిన ప్రతి ఆలోచనను అంతు చూడాలనే జిజ్ఞాస గలిగినవాడు. ఈలాంటి గుణవ్యక్తులు చేస్తున్న వృత్తిలో ఎక్కువ కాలము నిలువలేక నిరంతరము వృత్తిని, స్థానాలను మార్చుకొంటూ పోతారు. చంచల జీవితాన్ని అనుభవిస్తు కష్టనష్టాలను అనుభవిస్తు కూడ అనుభవజ్ఞానాన్ని ఎంతో సంపాదించుకొన్నామని ఆనందపడిపోతారు. ఈలాంటి ఆత్మాభిమానులు ఎప్పుడో ఒకప్పుడు అద్భుథాలను సృష్టించి చిరస్మరణీయులగుతారు.

రావు గారి జీవితములో కూడ అదే జరిగింది. ఎన్నో దేశాలను తిరిగి, ఎన్నో ఉద్యోగములను చేసి చివరకు నాసిక్‌లో స్థిరపడి అనుభవపరిణామ క్రమములో వచ్చిన జ్ఞాన సాధనతో పరపక్వమొందిన జీవిత ఫలాని అనుభవిస్తు తత్త్వజ్ఞాన సాగరములో పూర్తిగా మునిగి పోయినాడు. పఠన జ్ఞానము కంటే అనుభవజ్ఞానమే గొప్పదని ఋజువు చేసినాడు. (అదే కర్మ యోగము) సాధనలో సంభవించిన సమస్యలను సమాధి చేస్తూ సంసారములోనే స్వర్గము చూసిన ఘన సాధకుడు జి.యస్.రావు గారు.



ఇక గ్రంథ ప్రస్థావనకు వస్తే తాను పాఠకులకు అందించాలనుకొన్న భక్తి తత్త్వాన్ని విషయాలను సవిస్తారముగా, విసుగు రానీయకుండ జాగ్రత్త పడుతు విశేషమైన పరిపూర్ణ జ్ఞానమును వినోదింపచేసే విధానములో విన్నవించే ప్రయత్నము చేసినాడు. రచనా అనుభవము లేకున్న విషయాలను స్పష్టీకరించే ప్రయత్నము చేసి జయవిజయుల విజయ వైభవము వ్రాసి తాను కూడ తొలిగెలుపు పొందినాడు రావు గారు.

కథా విషయానికి వస్తే వ్యాసమహర్షి వ్రాసిన భాగవత కథలోని సనక సంధాధుల కథను తీసుకొని వారి వైరి భక్తిని కాదని సహజ సత్య భక్తి మార్గములో కథను నడిపించాలన్న సహసము చేసినాడు రావు గారు. సత్యన్వేషకుల స్వభావమదియే కదా! సనాతన కథను తీసుకొని దానికి సాన బెట్టి వినూత్న స్వరూప సౌందర్యము కలిగించిన వారిని జాతిరత్న మంటారు. రావు గారు మిగతా ఆరు కథలను వ్రాసి జాతి రత్న రచయిత కాగలడని ఆశిద్దాము.

భక్తి మార్గములో ప్రయాణించే ప్రాథమిక సాధకులు ఈ గ్రంథమును పఠించిన ఎంతో ప్రయోజనము పొందగలరు. అనుభవజ్ఞులైన సాధకులు కూడా మరొక్కసారి ఈ గ్రంథము చదివితే తాము విస్మరించిన జ్ఞానాన్ని స్మరించుకొన్నట్టు అగును. కావున ప్రతి పాఠకులు ఈ గ్రంథమును పఠించే ప్రయత్నము చేయలరని ఆశిస్తూ.

జి.యస్.రావు గారి ప్రయత్నానికి భగవంతుడు సర్వవిధాల సకల సౌకర్యాలను సమకూర్చుతారని ప్రార్థిస్తూ...

– మేడిచర్ల

Cell: 96759 45650
99510 24208

# మనసులోని మాట

శ్లోకము : వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాసరూపాయ విష్ణవే
నమోవైబ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమోనమః

వేద వ్యాసుల అసలు పేరు కృష్ణ ద్వైపాయనుడు. ఒక్కటిగా నున్న వేద శ్లోకాలను వాటి విధి విధానాల ద్వారా వాటిలో చెప్పబడిన విషయము ఆధారముగా సంయుక్తము ఉన్న వేద శ్లోకాలను నాల్గు భాగాలుగా విభజన చేసినాడు. అవి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణ వేదము అను నలుగు వేదములుగా విభజించినాడు. ఒక్కటిగా ఉన్న వేదాల శ్లోకాలను నాలుగు భాగాలుగా చేసి కూర్చినాడు. కనుకనే వేద వ్యాసుడు అనే బిరుదుము సంపాదించుకున్నాడు. హిందూ సాంప్రదాయ ప్రకారము, ఏడుగురు చిరంజీవులు ఉన్నారు. అశ్వత్థామ, బలి, వ్యాసుడు, హనుమంతుడు, విభీషణుడు, కృపాచార్యుడు మరియు పరశురాముడు. పురాణ కథనము ప్రకారము పురాణాలు ఉపపురాణాలు, ఉపనిషత్తులు, వ్రాసినను వ్యాసుల వారు కొంత అనిర్వచనీయమైన అసంతృప్తితో బాధ పడసాగినారు. అప్పుడు దేవర్షి నారదులవారు శ్రీమద్ భాగవతమును వ్రాయమని, వ్రాసిన తరువాత ఆయన అసంతృప్తి తొలగిపోతుందని చెప్పగా వ్యాసుల వారు అన్ని క్రోడీకరించి భాగవతమును వ్రాసినారు. భాగవత ప్రారంభములో వైకుంతమునకు ద్వార పాలకులను జయ విజయులు సనక సదానందులు ఇచ్చిన శాపము పొంది విష్ణువు ఇచ్చిన రెండు మార్గాలలో మొదటి మార్గము ఎంచుకొని మూడు జన్మల తరువాత వైకుంతానికి చేరుతామని నిర్ణయించుకొని, తమ నిర్ణయాన్ని తెలిపినారు. వ్యాసుల వారు శ్రీ మహావిష్ణువు ఇచ్చిన ప్రత్యమ్నాయ రెండవ మార్గమును ఎంచి ఆ కథలను కూడ వ్రాయగలిగేవారు పురాణాలు ఉప పురాణాలు ఉపనిషత్తులు, భాగవతమును వ్రాసిన వేదవ్యాసుల వారికి రెండవ



ప్రత్యమ్నాయ మార్గమైన జయ విజయులు ఏడు జన్మలు ఎత్తి విష్ణు భక్తులుగా జన్మించి ఏడవ జన్మ తరువాత వైకుతానికి చేరగలరని వారి ఏడు జన్మల గూర్చి వ్రాయడము వ్యాసుల వారికి సాధ్యము కానిపని కాదు. అయినను ఆ ఏడు జన్మ గూర్చి వ్రాయలేదు. తరువాతి తరాలలో ఎవరన్న వ్రాయకపోతారా అనే ఒక అవకాశము వదలి వేసినారు అని నేను భావిస్తాను. ఈ ఆలోచన నాకు రావడము వ్యాసులవారు కల్గించిన కృపగా నేను భావిస్తున్నాను. మరియు శ్రీ మహావిష్ణువు శ్రీ వేంకటేశ్వర స్వామి కృపగా కూడ నేను భావిస్తున్నాను.

"జయ విజయుల విజయవైభవము" అని నేను వ్రాసిన పుస్తకమును వ్రాయుటకు ప్రేరణ స్ఫూర్తి ప్రోత్సాహము, ఉత్సాహము ఇచ్చినది నా భార్య శ్రీమతి ప్రతిభ ఆమెతో నేను గడిపిన 50 సంవత్సరాలు నా జీవితము అమోఘము, చాలా చిన్న వయస్సులో ఆమె 16వ సంవత్సములు ఉండగా మా వివాహము జరిగినది. చదువుపై ఆమెకు గల శ్రద్ధ అనిర్వచనీయము. నాకు కోపము ఎక్కువ మా బంధువులలో ఒకరిద్దరు నాకు కోపమెక్కువని అని అన్నారు కూడ. నేను మొత్తము 13 ఉద్యోగాలు చేసినాను. ఎక్కడ ఇమడలేక. నా కోపాన్ని విరమించుకోలేక పరిస్థితులకు సర్దుకోలేక ఉద్యోగాలు మారుతూ వచ్చినాను. ఒకసారి నేను హైదరాబాదులో ఉద్యోగ నిమిత్తము ఉన్నప్పుడు ఆమె ఉపాధ్యాయ వృత్తిని చేస్తు తన చిరకాల వాంఛ చదువును కొనసాగించినది. ముందు బి.ఎ. తరువాత ఎం.ఎ. పరీక్షలు వ్రాసి మంచి మార్కులతో ఉత్తీర్ణత పొందినది. మా పెండ్లి అయిన క్రొత్తలో హైదరాబాద్ హింది ప్రచార్ సభ వారు నిర్వహించిన 'భూషణ్' పరీక్షలో బంగారు పథకము సంపాదించి, అప్పటి ఆంధ్రప్రదేశ్ గవర్నరు ఖండుబాయి దేశాయి చేతుల మీదుగా బంగారు పథకము పొందినది. తను 22 సంవత్సరాలుగా హిందీ బోధిస్తు వచ్చింది. "శివాజి విద్యాపీఠ్" అను ఒక ప్రైవేటు విద్యాలయములో పనిచేసేది. అది. సి.బి.ఎస్.సి. సిలబస్ ను పాటించేది. వరుసగా 3 సంత్సరములు 10వ తరగతి

హిందీలోనే విద్యార్థులు అన్ని విషయములకన్న అధిక మార్కులు పొందినారు. (ఫస్ట్ క్లాస్ మార్కులు పొందినారు). ఆమె ఉపాధ్యాయ వృత్తిని కాలక్రమేణ ఆరోగ్య రీత్యా వదిలి వేయవలసి వచ్చినది. అయినను గీతా ప్రచార్ గోరఖ్‌పూర్ వారు ప్రచురించిన 16 పురాణాలను హిందీలో చదివినది ఒక పురాణము పుస్తకము కొంటే రోజుకు 60, 70 పేజీలు చదివి వారం 10 రోజులలోపే పూర్తి చసేది. ఆ పురాణము చదివేది అంత ఆత్రతము ఎందుకని పుస్తకము తనదేనని పరీక్షకు చదివే విధముగా ఎందుకని నేను అన్నారు. సావకాశముగా చదువవచ్చును కదా! అని అన్నాను. వినేది కాదు. పుస్తకము పూర్తి అయ్యేవరకు నిద్రా ఆహారలవైపు కూడ శ్రద్ధ చూపేది కాదు. పురాణములో ఉన్న విషయాలను గూర్చి అప్పుడప్పుడు నాకు చెప్పేది.

నేను చిన్నప్పటి నుడి విపరీత భావాలు ఉన్న వ్యక్తిని. నేను నాలుగవ తరుగతి చదువుతున్నప్పుడు బుద్ధపూర్ణిమ రోజున బుద్దుని గూర్చి ఉపన్యాసము ఇచ్చినాను. ఒకసారి మా తరగతిలో డాక్టరు గొప్పనా? వకీలు గొప్పనా! అనే విషయముపై ఉపన్యాసము ఇవ్వవలసి వచ్చినది ప్రతి ఒక్కరు డాక్టరు గొప్ప అనే విషయముపైననే ఉపన్యసించినారు. నేనొక్కడినే వకీలు గొప్ప అని ఉపన్యాసము ఇచ్చినాను. ఆరోగ్యము మనిషి ప్రాథమిక అవసరాలలో ఒకటి కాని సాంఘీక అవసరాలను మన సంస్కార అవసరాలను తీర్చేవాడు లాయరు ఒక్కడే. ఇలా నేను వాదించినాను. చివర ఓటింగ్‌లో నాకు ఒక్క ఓటు కూడ పడలేదు. అయినను నేను బాదపడలేదు. ఇలా ప్రతి విషయములో రెండవ వైపుగా ఆలోచించేవాడిని. నేను కాలేజిలో ఉన్నరోజులలో మామూలుగా పుస్తకములో గీతలపైన వ్రాయకుండ అయిమూలగా వ్రాసేవాడిని. ఒకరోజు ఒక లెక్చరరు అది చూచి నీవు ఇలా ఎందుకు వ్రాస్తావని అడుగగా అప్పుడు నేను ఇలా వ్రాస్తే మీకు ఏమన్న సమస్య ఉందా! అన్నాను. పరీక్ష పత్రాలలోమాత్రము



గీతలపైననే వ్రాసేవాడిని. ప్రతి విషయములో ఇలా కాకుండా ఏదైన వేరే మార్గము ఉన్నదా అని ఆలోచించే వాడిని. ఒక రోజు నా భార్య భాగవతమును గూర్చి చెప్తూ సనక సదానందులు జయ విజయుల విషయము చెప్పినది. తెలిసిన విషయమే అయినను ఆమె చెప్పినది శ్రద్ధగా విన్నాను. అప్పుడు శ్రీ మహావిష్ణువు ఇచ్చిన రెండవ ప్రత్యమ్నాయ మార్గముగా ఏడు జన్మలు భక్తులుగా జన్మించి తరువాత వైకుంఠము చేరగలరని పుస్తకము వ్రాయాలన్న సంకల్పించుకున్నాను. దాదాపు 3 నెలలు మొదటి జన్మ గూరి వ్రాసినాను. నేను నా భార్యకు విషయము చెప్పి పుస్తకము శుభ్రముగా వ్రాసి పెట్టమని కోరినాను. అందుకు నా సంగతి తెలిసిన ఆమె సమ్మతించినది. అంతకు ముందే ఈ పు స్తకమును ఆమెకు అంకితము ఇవ్వవలెనని నిర్ణయించు కున్నాను. ఆమె దానిని చూచి చాలా సంతృప్తి పడినట్లుగా అనిపించింది. మా 50 సంవత్సరాల వైవాహిత జీవితములో నా బాధలకు, కష్టాలకు, కోపానికి, పెట్టని గోడలా నిలచి నాకు మా కుటుంబానికి సేవ చేసినది. ఒకసారంటే ఒక్కసారి కూడా మీరు చేసినది తప్పని పొరపాటున అనలేదు. ఆమెతో నా జీవితము నాకు శ్రీ వేంకటేశ్వరస్వామి ఇచ్చిన వరముగా నేను భావిస్తాను.

చివరి మాట నేను ఈ పుస్తకాన్ని ముగింపు చేస్తూ పర్ణి సోదరులు తనువు చాలించి సమాధిని పుచ్చుకున్నారు. అని వ్రాస్తున్నప్పుడు నా కళ్ళలో నీళ్ళు తిరిగినవి ఇది జయవిజయులు ఎంచుకున్న మొదటి జన్మ వృత్తాంతము రెండవ జన్మ వృత్తాంతముతో త్వరలో మిమ్మల్ని కలుస్తాను.

మీ

**గణపతి శంకర్‌రావు పట్వారి**

నాసిక్ (మహారాష్ట్ర)

# కృతజ్ఞతలు

ప్రథమ పూజ్యులుగా విశ్వక్సేనుని వైష్ణవులు, గణపతిని మిగిలిన హిందువులు పూజించి కొలుస్తారు. నేను వ్రాసిన ఈ పుస్తకమునకు పరిపూర్ణ రూపమునిచ్చి, ఎన్నో ప్రయాసలకు ఓర్చి తీర్చిదిద్దిన శ్రీ మేడిచర్ల ప్రభాకర్‌రావు గారికి నా ప్రథమ ధన్యవాదములు. అందుకు వారే అర్హులు. తరువాత నేను ఎరుగకపోయినను పుస్తకమును వ్రాసినాను. ఫోనులో వివరించినంతనే పీఠిక వ్రాసి ఇస్తానని కొంత ధన సహాయము చేస్తానని తనకు తానుగా ముందుకు వచ్చిన శ్రీ కసిరెడ్డి వెంకటరెడ్డి గారికి కృతజ్ఞతలు.

**ఈ పుస్తకము ముద్రణకు ధన సహాయము చేసివారు.**

1. డా॥ ఆర్. శ్రీహరిబాబు
   (రిటైర్డ్ ప్రిన్సిపల్ అగ్రికల్చరల్ కాలేజి, తిరుపతి)
2. శ్రీ మండ శివరామ ప్రసాద్ (ఉయ్యూరు)
3. శ్రీ సురేశ్‌దేశ్ పాండె (వడూరు)
4. శ్రీ బాలాజి దేశ్‌పాండె (వడూరు)
5. శ్రీ యశ్వంత్ కుమార్ (బోరిగామ)
6. శ్రీ కసిరెడ్డి వెంకటరెడ్డి (హైదరాబాద్)
7. శ్రీమతి భారతి (సైనిక్‌పురి, హైదరాబాద్)
8. శ్రీ కిరణ్ దేశ్‌ముఖ్ (నిజామాబాద్)
9. శ్రీ నవనీత్ దేశ్‌పాండె (వడూరు)



ఈ రోజులలో కంప్యూటర్ యుగములో పుస్తకాలు కొని చదివే ఓపిక ఏ కొద్ది మందికో ఉంటుంది. కనుక ఈ పుస్తకమును యథావిధంగా కంప్యూటర్ సెట్‌లో అప్‌లోడ్ చేయుటకు సిద్ధపడిన నా కూతురు శ్రీమతి మాధురికి దీవెనలు.

నేను పుస్తకమును వ్రాసినానని తెలుపగానే దాన్ని ఇంగ్లీషులో అనువాదము చేసి కంప్యూటర్‌లో అప్‌లోడ్ చేస్తానని తనకు తానుగా ముందుకు వచ్చిన నా మనుమడు చి॥ ఇక్షన్‌కు దీవెనలు. నాకు పరోక్షముగా సహాయము అందించిన చి॥ సురేష్ (బోరిగామ)కు దీవెనలు. డా॥ రవీందకుమార్ కులవల్లికి ధన్యవాదములు ఈ పుస్తకమునకు డి.టి.పి. చేసిన శ్రీ ప్రసాద్ గ్రాఫిక్స్ గారికి మరియు కవర్ డిజైన్ చేసిన నితిన్ డిజిటల్స్ గారికి, ఈ పుస్తకమును సర్వాంగ సుందరముగా ముద్రించి ఇచ్చిన మౌనిక గ్రాఫిక్స్, సంతోష్ కుమార్ గారికి ధన్యవాదములు.

**– జి. శంకరరావు పట్వారి**



# జయవిజయుల విజయవైభవము

## సనత్కుమారుల శాపము

ప్రకృతి ఎంతో రమణీయమైనది. అందమైనది. ప్రకృతి అందాలు ఎందరో ఋషులు, కవులు, గాయకులు వర్ణించారు. ప్రకృతి అందాలు వర్ణింప తరమా అని కొందరు తమ ఆవశ్యకతను వ్యక్తం చేస్తూ వాపోయారు. సృష్టి ఆది నుండి మానవులు బట్ట కట్టి సంస్కారము నేర్చినప్పటి నుండి సృష్టిమూలాలు, రహస్యాలు తెలుసుకోవడానికి విశ్వ ప్రయత్నాలు చేసినారు. కొందరు తపస్సు ద్వారా, కొందరు ఏకాగ్రత ద్వారా, కొందరు ప్రకృతి శక్తుల ద్వారా, ఆరాధన ద్వారా, దేవి దేవతల ప్రార్థనల ద్వారా, పూజలు, పునస్కారాల ద్వారా, రకరకాల పద్దతుల ద్వారా ప్రకృతి రహస్యాలను అన్వేశించ పూనినారు, సాహసించారు. ఎవరికి అంతుబట్టని విధములుగా, ఎవరికి అర్థమైన విధముగా రకరకాల తమ భావనలు వ్యక్తము చేసి తెలియబరిచారు.

సృష్టికి మూలకారణము మాత అని ప్రకృతి శక్తి అని తరువాత త్రిమూర్తులని ఇలా ప్రకృతి రహస్యాలను అర్థము జేయ ప్రయత్నించారు. త్రిమూర్తులను బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుగా విభజించి వారి వారి విధులను తెలుసుకొన ప్రయత్నించినారు. బ్రహ్మ సృష్టి కర్తయని, విష్ణువు పాలకుడని, మహేశ్వరుడు లయకారకుడని, ఈ విధముగా మునులు, ఋషులు మనకు విజ్ఞానాన్ని వినయాన్ని అందించారు. కాలగతులు తెలుప ప్రయత్నం చేసినారు. నాలుగు యుగాలని, కల్పాలని, మన్వంతరాలని, యుగానికి నాలుగు పాదాలని, దానికి ముందుగా సౌరకుటుంబాలని, అవి 12 అని, పాల పుంతలని ఇలా విశ్వాన్ని అర్థము చేయప్రయత్నించారు.



మహేశ్వరుడు లోక కళ్యాణార్థము తప మాచరించునని, విష్ణువు యుగాల పాటు ధ్యానములో గడుపునని, బ్రహ్మ సృష్టి కార్యము నిర్వహించునని, పురాణాల ద్వారా వ్యక్తమవుచున్నది.

బ్రహ్మ దేవుడు సృష్టికార్యము చేయతలచి తానుగా నలుగురు మానస పుత్రులను పొందినాడు. వారు సనకసదానందులుగా పేరు పొందారు. వారు సనకుడు, సనాతనుడు, సదానందుడు, సనత్కుమారుడు. ఈ నల్గురు బ్రహ్మ మానస పుత్రులు బ్రహ్మచర్యాని పాటించాలను కున్నారు. బ్రహ్మ ఈ నల్గురు సృష్టి కార్యములో తనకు సహాయకారులుగా ఉంటారని భావించి తన మనః శక్తి ద్వారా సృష్టించాడు కాని వీరు బ్రహ్మ కోరికకు విరుద్ధంగా అందుకు సమ్మతించలేదు. వీరు నల్గురు ఆధ్యాత్మిక, ఆది భౌతిక, ప్రపంచములో ఏ కోరిక లేకుండ తిరుగ సాగారు. వీరు తమ చిన్న తనములోనే వేదాలు ఉప నిషత్తులు, పురాణాలు, కూలంకషంగా చదివినారు. వీరు అన్ని కోరికల నుండి ముక్తిపొంది విష్ణునామ స్మరణ చేయసాగినారు. వారు తమకు తాము విష్ణువు అవతారమని భావించెవారు. వీరి నల్గురి పేర్లు 'సనా' తో మొదలవుతాయి. సనక (అతి ప్రాచీనమైన) సనాతన (ఆధ్యాత్మిక) సదానంద ఎల్లప్పుడు ఆనందముగా సంతోషముగా ఉండువాడు సనత్కుమార నిత్యయౌవ్వనుడు.

బ్రహ్మ సృష్టి కార్యము మొదలు పెట్టడానికి తన శరీర భాగాల నుండి మొదటగా నల్గురిని ఉత్పత్తి చేసినాడు. బ్రహ్మ వీరి నల్గురిని సృష్టి కార్యముతో తనకు సహాయకారిగా ఉండవలసినదిగా ఆదేశించాడు. కాని వీరు బ్రహ్మ ఆజ్ఞకు విరుద్ధముగా అతనికి సహాయ పడడానికి నిరాకరించారు. వీరు ఏ కోరిక లేకుండ నగ్నంగా లోకాలన్ని తిరుగుతూ ఆధ్యాత్మిక చింతనమును వ్యాపింప ప్రయత్నించారు. ఈ నల్గురు కుమారులు రాక్షసరాజు మిత్రుడైన గురువు శుక్రాచార్యులకు జ్ఞాన బోధ

చేసినారు. శుక్రాచార్యునికి విష్ణువు సృష్టి, స్థితి లయ కారుడనియు, విష్ణుమూర్తి తన శరీర భాగాల ద్వారా ప్రపంచాన్ని ఆవిర్భవింప చేసాడు. భూమిని తన పాదాల ద్వారాను, నీటిని నాలుకతోను సృష్టించాడు. సనత్కుమారుడు విష్ణువు ఆరురంగులను, మూడు గుణాలను సత్త్వ, రాజస, తామస గుణాల కలయిక ద్వారాను సృష్టించాడు. ముందు నలుపు రంగును తామస గుణము అధికముగాను రాజస గుణము మధ్యముగాను, సత్వ గుణము తక్కువగాను, తరువాత నీలి రంగులో రాజస గుణము ఎక్కువగాను సత్వగుణము మధ్యముగను తామస గుణము తక్కువ స్థాయిలో ఉండును. ఎరుపు రంగులో రాజస గుణము, సత్వగుణము, తామస గుణములను పసుపులో సత్త్వగుణము, తామసగుణము, రాజసగుణము ఈ రీతిలో ఉండును. తెలుపు రంగులో క్రమముగా సత్వ, రాజస, తామస గుణములు ఉండును. విష్ణువు జంతు జాలము ప్రాణము లేని వస్తువులు, మానవులు, ప్రజాపతులు, ఇతర దేవుళ్ళను సృష్టించాడు. సనత్కుమారుడు ఇంకా వివరముగా జీవుడు, నలపు నుండి తెలుపుకు ప్రయాణములో తమవేరు వేరు పుట్టుకలతో చివరగా మోక్షప్రాప్తి పొందును. కుమారులు నలుగురు పృథురాజు, సభకు పోగా రాజు వారిని పూజించి మోక్ష ప్రాప్తికి మార్గము తెలుపుమనెను. వారు రాజా! విష్ణువు ఒక్కడే మోక్షమును అనుగ్రహించు దేవతయని, విష్ణువును పూజించుట వలన కోరికలు నశిస్తాయని అదే మోక్ష మార్గమని సాధారణ జీవితము గడపడం, వస్తువులపైన వ్యామోహము లేకుండ ఉండడం, శాంతిని కాంక్షించడం, గురువు చెప్పినవి పాటించడం, విష్ణువును ఆరాధించడం, తనను తాను తెలుసుకోవడం, జీవజాలమంత భగవత్ స్వరూపమని, తెలుసుకోవడం, ఆత్మపరమాత్మ, ఆధ్యాత్మికము ద్వారా విష్ణువును శరణువేడడం ముక్తికి ప్రాధాన్యము. పురాణములను విష్ణువు బ్రహ్మకు బ్రహ్మవారి నలుగురు కుమారులకు, వారు నారదునికి, నారదుడు వ్యాసునికి బోధించారు.



నలుగురు కుమారులు తిరుగుతు తిరుగుతు తమ ధార్మిక శక్తి ద్వారా విశ్వభ్రమణము చేస్తు వైకుంఠానికి చేరుతారు. విష్ణుమూర్తి వైకుంఠములో (7) ఏడు గుండ్రని ప్రాకారాల మధ్య నివసిస్తాడు, నలుగురు కుమారులు ఆరు ప్రాకారములకున్న ద్వారములను దాటి ఏడవ ప్రాకారములో అడుగు పెట్టారు. ఏడవ ప్రాకార ద్వారాన్ని జయవిజయులు కాపలగా ఉంటారు. ఇద్దరు ద్వార పాలకులు కుమారులను లోనికి పోనీయకుండ అడ్డుకుంటారు. నల్గురు కుమారులు ఆశ్చర్యచకితులవుతారు. ఇంతకు ముందు ఎవరు కూడ తమని అడ్డుకోలేదు. ద్వార పాలకులు కూడ విష్ణుమూర్తివారే సామ్యంగా ఉండాలని భావించారు. కాని జయవిజయులు ససేమిరా లోనికి పోవీలు లేదని ఖరాఖండితము చెప్పినారు. అందకు కోపగించిన నలుగురు కుమారులు విష్ణువు ద్వారపాలకులమని మీకు చాలా గర్వంగా ఉంది మేమెవరమో తెలియకుండ మమ్ము అడ్డగించారు అందుకుగాను మీరు భూలోకంలో జన్మనెత్తుదురు అని శపించారు. తప్పును తెలిసికొన్న జయవిజయులు తమను కనికరించమని వేడుకున్నారు.

ఇది గ్రహించిన విష్ణువు పరుగు పరుగున బైటకు వచ్చి నలుగురు కుమారులకు దర్శనభాగ్యము కలుగజేసినారు. కుమారులు నలుగురు వైకుంఠమునకు తమ మొదటిరాక, మరింత విష్ణువును దర్శించడం మొదటి సారి కావడము మరియు విష్ణుమూర్తి యొక్క దివ్యమంగళ విగ్రహము చూసి పరవశించి రకరకాలుగా స్తోత్రించి తమను భక్తులుగా గ్రహించమని విష్ణుపాదాల వద్ద స్థానము ప్రసాదించమని వేడుకున్నారు. విష్ణుమూర్తి నలుగురు కుమారుల విన్నపము నాలకించి వరమొసగి వారిని సంతృప్తి పరిచారు.

తరువాత విష్ణువు జయవిజయుల వంక చూసి మీరు జ్ఞాన శక్తి లేక కుమారులను అడ్డగించారు కావున వారి వాక్కు ప్రకారము మీరు భూలోకములో జన్మనెత్తక తప్పదు.

విష్ణుమూర్తి జయవిజయులతో మీరు విష్ణుమూర్తి ద్వారా పాలకులని గర్వము పోడసూపి, సనక సనందన మహాఋషిలను వారి గొప్పతనమును గ్రహింపక వారి రాకను అడ్డుకొని శాప గ్రస్తులైతిరి. ఇప్పుడు మీరు భూలోకములో జన్మనెత్తవలసినదే. అయితే నేను మీకు రెండవకాశాలను కల్పిస్తున్నాను. ఒక అవకాశము ప్రకారము భూలోకములో జన్మించి నాకు శత్రువుల వలె బ్రతికి నాచే వధింపబడి మూడు జన్మలలో వైకుంఠము చేరవచ్చును. రెండవ అవకాశము భూలోకంలో జన్మించి ఏడు జన్మల తరువాత ప్రతిసారి సహజ మరణము పొంది వైకుంఠము చేరవచ్చును. ఈ ఏడు జన్మలలో మీరు భక్తులుగా నన్ను ఆరాధించి కీర్తిని పొందుదురు. మీరు దేనినైన ఎన్నుకొనవచ్చును. అప్పుడు జయవిజయులు ప్రభు! మూడు జన్మలంటే సత్‌యుగము, త్రేతాయుగము, ద్వాపరయుగము, ఇక మిగిలినది కలియుగము, సత్‌యుగములో మనిషి ఆయుషు 100000 (లక్ష) సంవత్సరాలు ఎత్తు 34 అడుగులు ఇచ్ఛా మరణము. త్రేతా యుగములో ఆయుష్షు 10000 (పదివేల) సంవత్సరాలు ద్వాపర యుగంలో 1000 (వెయ్యి) సంవత్సరాలు, కలియుగంలో మానవుని ఆయుష్షు 100 (వంద) సంవత్సరాలు, కలియుగం చివరలో మనిషి ఎత్తు 1 అంగుళం ఆయుష్షు 12 సంవత్సరాలు.

మూడు జన్మలు ఎత్తి మీకు శత్రువులగా బ్రతికి మీచే వధింపబడాలంటే జీవితాంతం మిమ్మల్ని ద్వేషించాలి పగ పెంచుకోవాలి, తూలనాడాలి, మీ భక్తులను హింసించాలి. వైరము పెంచుకోవాలి అనుక్షణం శత్రు బుద్ధితో, పగతో మనసా, వాచ, కర్మణా ప్రభువును ద్వేషించాలి. పూర్ణకాలము బ్రతికినను చివర మీచే వధింపబడినను మూడు జన్మలలో మూడు యుగాలలో ఒక లక్ష పదకొండువేల సంవత్సరాలు బ్రతకాలి అనుక్షణము చావు భయంతో బ్రతకాలి, కాని పనులు చేస్తూ ప్రపంచములో అందరితో 'ఛీ' అనిపించుకుంటు బ్రతకాలి. ఏ సుఖము,



సంతోషము మనఃశ్శాంతి, లేకుండ గడపాలి, శాంతి, సౌఖ్యము అంటే తెలియకుండా గడపాలి క్షణ క్షణము మరణ భయంతో బ్రతకాలి, సాధువులు, సజ్జనాదులను పూజిస్తే మిమ్మల్ని కూడ తేరుస్తామని అంటు వారు భయంతో మిమ్మల్ని దేవుడే కడ తేరుస్తాడు అనే మాటలను పరోక్షంగా వింటు బ్రతకాలి. కల్పాలుగా యుగాలు, మీ ద్వారా పాలకులుగా మీకు సేవలందించిన మేమూ నేడు విరుద్ధంగా రాక్షసులుగా దయాదాక్షిణ్యాలు లేకుండ మిమ్మల్ని శత్రువుగా భావించి బ్రతకడం సాధ్యమయ్యే పని కాదు. మీ ద్వారా పాలకులుగా ఉండడము మేము చేసిన ఏ పుణ్యఫలమో, నీపరిసరాలలో నివసించడమే మాకు గొప్ప వరము, గొప్ప శక్తి, గొప్ప ఆధ్యాత్మిక చింత, మేము మిమ్ములను మాత లక్ష్మిదేవిని చూడకపోయిన, దర్శించుకోకపోయిన, ఈ పరిసరాలలో ఏడవ ప్రాకారము దగ్గర ఉండడమే గొప్ప పుణ్యఫలము, జన్మజన్మల సుకృతము. ఆకలి దప్పులు లేకుండ, కోరికలు లేక సంపాదించాలనే తపన లేక ఇక్కడున్నామని భావన చాలా గొప్పది, సనాతనమైనది, ధార్మికమైనది, శక్తిని, బలాన్ని చేకూర్చేది, మమ్మల్ని నిత్యయవ్వనులుగా శక్తి యుక్తమైన, కామమైన, దేవతలము కాకున్న, అమృతము సేవించకున్నను మాతపిత నుండి వచ్చేప్రేమ మీ నుండి నిత్య సుఖము, నిత్య ఫలము, నిత్య నైవేద్యము, నిత్యశాంతి, విశ్రాంతి పొందుచున్నాము.

ఇవి ఇప్పటి నుండి వదిలి మా మనస్సును చంపుకొని కల్పాలుగా యుగాలుగా, మీపై ఉన్న భక్తి శక్త్యాలను విడిచి ఉండడము మాకు సాధ్యము కాదు, అసాధ్యము, అవహేళనము. ఈ అనురాగ ఐశ్వర్యముల అనితర ప్రేమ అలలను పెంచుకొని బద్ధవిరోధులుగా పుట్టి బ్రతకడము మాకు సాధ్యమైన పని కాదు.

ప్రభు! ఇక రెండవ పద్ధతి ద్వార ఏడు జన్మలు నీకు భక్తులుగా జన్మించి సహజమరణము పొంది నిన్ను చేరడమే మాకు సరైన మార్గముగా

తోచుచున్నది ఏలన ఇంతవరకు మీ సేవలో బ్రతికిన మేము, మా మనస్సులను, శరీరములను మనసా, వాచా, కర్మేణా మిమ్ము ద్వేషించకుండ, పూజించి నీ నామస్మరణము చేసి జనావళికి ఇతోధిక ఆధ్యాత్మిక సేవలందించి, నీ నామస్మరణ మహత్యము తెలిపి, మమ్ము మేము సంతృప్తి పొందడమే కాకుండ జనావళికి, నీ నామ స్మరణ రహహస్యము, లాభము, శుభము, సుఖము మరియు దుఃకములను దూరము చేసి నిన్నే పూజించి స్మరించే దారి చూపించి భక్తులను చేసి తరింప జేయడంలో మావంతు పాత్ర పోషించడం కన్న మాకు కావలసినది ఏమి కలదు. ఏడు జన్మలలో మేము సహజ మరణము సాధించి నిన్ను చేరుటకు మేము మృత్యు లోకంలో బ్రతికెదము. సత్‌యుగములో లక్ష సంవత్సరాలు, త్రేతా యుగంలో పదివేల సంవత్సరాలు, ద్వాపరయుగంలో వెయ్యి సంవత్సరములు మనిషి ఆయుష్షు, సత్ యుగంలో ఒక జన్మ, త్రేతాయుగంలో ఒక జన్మ, మిగిలిన ఐదు జన్మలు ద్వాపర యుగంలో గడపగా మొత్తము గాను ఒక లక్ష పదిహేను వేల సంవత్సరాలు బ్రతకవలసి ఉంటుంది మీకు ద్రోహులుగా మూడు జన్మలలో 1 లక్ష 11 వేల సంవత్సరాలు బ్రతకవలసి ఉంటుంది. మొదటి మరియు రెండవ అవకాశాలలో మరి ఎక్కువ సంవత్సరాల వ్యత్యాసములేదు. కనుక భక్తులుగా సాధువులుగా జన్మించి మనఃశ్శాంతితో బ్రతికి నీయందు మోహవాత్సల్యములతో బ్రతికి నిన్ను చేరుటయే మాకు సమ్మతము. భక్తి, శాంతి, సుఖము ఇతరులకు సేవ, ప్రజలను సన్మార్గములలో నడపడం కన్న భాగ్యము ఏముంటుంది. ప్రభు? మాపై దయయుంచి మాకు రెండవ మార్గము అనుగ్రహించి మమ్మిద్దరిని కృతార్థులను చేయమని వేడుకున్నారు.

ఇక ఈ సనకసదానందులు ఋషులు నిరాడంబర పరులు, ఆధ్యాత్మికులు, ఆది భౌతికతకు దూరముగా ఉన్నవారు, జీవితములో సుఖః సంతోషాలకు అతీతంగా బ్రుతకనేర్చిన వారు మేము అడ్డగించి



నామనుకోపముతో క్షణికావేశములో మమ్ములను శపించి తమ సర్వశక్తులను కోల్పోయినారు. సకల వేదాలు, వేదాంగాలు ఆవపోషణ పట్టి కూడా ద్వార పాలకుల విధులను తెలసికూడ కోపాన్ని ఆపుకోలేక మమ్మల్ని శాపగ్రస్తులను చేసినారు. అందువలన వారి శక్తి సామర్థ్యాలను పూర్తిగా పోగొట్టుకున్నారు. మీరు వారికి మీ పాదల వద్ద చోటిచ్చినను అనుగ్రహించినను వారు తమ శక్తిని కోల్పోయి తమ అర్హతను కోల్పోయినారు. తిరిగి దేశ దిమ్మరులై పశ్చాత్తాపంతో, ధ్యానముతో, తపస్సుతో ఇంకా శక్తిని, పుణ్యమును కూడ బెట్టిన కాని వారు ఇక్కడకు మరల వచ్చుటకు తమ శక్తి అర్హత సరిపోదు. ఇది మేము వారికిస్తున్న శాపము కాదు మాకంత శక్తి లేదు. వారి అర్హతలను, శక్తిని గుర్తుచేస్తూ తెలియచెప్పుచున్నాము. పద్మనాభ నీవు మమ్ములను అనుగ్రహించి మమ్ము భూలోకమునకు పోవుటకు అనుగ్రహింప ప్రార్థిస్తున్నాము, విన్నపము చేస్తున్నాము. ఇక ఏడు జన్మల తరువాతనే తమ సేవకులుగా ద్వారపాలకులుగా మరల సేవలందించే భాగ్యము కలుగజేయుము. ఇలా మా కోరికను అనుగ్రహించమని వేడుచున్నాము. మా బాధంత, విచారమంత, మేము లేని ఈ ఏడుజన్మల సమయములో మీకు ద్వారపాలకులు లేని లోటును ఎలా తీరగలదో ఇదే మా ఇద్దరి ఆలోచన.

## కవలలుగా కాశీలో జన్మించుట

జయవిజయులు భూలోకంలో సత్‌యుగంలో సుఖవర్ణి, ముఖపర్ణిగా జన్మించి హరి భక్తులుగా జీవితము కొనసాగించాలని లక్ష సంవత్సరములు నిరంతరము హరినామస్మరణ చేయసాగారు. జయవిజయులు మొదటి జన్మలో వారణాసి నగరములో గంగానది ఒడ్డున నివసిస్తున్న శ్రీ ఏకపూర్ణి మరియు సౌధామిని దంపతులకు కవలలుగా జన్మనెత్తినారు. వారణాసి భూమిపై అందునా భారతదేశంలో అతి పురాతనమైన నగరము, తాపసులు,

సర్వసంగ పరిత్యాగులు ఏ ఆపేక్షలేనివారు, సుఖఃదుఖాలకు, కష్టసుఖాలకు, మంచికి చెడుకు, దూరంగా ఎంతో ప్రగతిని సాధించిన వారు, పాలకులు, విధులు, బాధ్యతలు తెలసినవారు, క్షణకాలములో క్షణికావేశము లేకుండా సరైన ప్రజాజీవితము గడుపువారు వారణాసిలో నివసిస్తారు.

వారణాసి నగరాన్ని శివుడు నిర్మించాడు వారణా, అసి అను రెండు నదుల సంగమము మధ్య నెలకొన్నది కనుకవారణాసి అను నామము స్థిరపడినది. రెండు నదులు సంగమించి గంగానదిలో కలియుచున్నవి.

శ్రీ ఏకపర్ణి సౌధామిని దంపతులు కాశీ నగరములో నివాసముంటు నిరాడంబర జీవితాన్ని గడుపుచున్నారు. శ్రీ ఏకపర్ణికి కాశీరాజు కొలవులో పండితునిగా స్థానమున్నది. ఆయన తన విధి నిర్వహణలో కాశీరాజు కొలవులో పండితునిగా రాణిస్తున్నాడు. దంపతులిద్దరు ఉదయాననే లేచి కాలకృత్యములు తీర్చుకొని జపతపాదులు చేసి సౌధామిని చేసిన నైవేద్యాన్ని తీసుకొని శ్రీ ఏకపర్ణి విశ్వేశ్వరుని పూజించి, నైవేద్యాన్ని కైంకర్యము చేసి తిరిగివచ్చేవారు. దపంతులిద్దరు విశ్వేశ్వరుని నైవేద్యము ప్రసాదముగా స్వీకరించిన తరువాత శ్రీఏకపర్ణి కాశీరాజు కొలువుకు పోయేవాడు. సౌధామిని రోజంతా ఇంటిపనులు చక్కబెట్టుకొని సాయంకాలము భర్తరాకకై ఎదురు చూసేది.

ఒకరోజు రాజుగారి కొలవులో ఒక వింత వ్యాజ్యము వచ్చినది ఇద్దరు యువతులు ప్రమిలాంబ, యోగాంబ ఒకే బాలునికి తనుతల్లి అంటే తానే నిజమైన తల్లియని వాదించసాగారు. వైద్యులు, న్యాయవాదులు, న్యాయవేత్తలు, మంత్రులు వారిని రకరకాల ప్రశ్నలు వేసి కూడ నిజమైన తల్లి ఎవరో పిల్లవాడు ఎవరి కుమారుడో తెలిసికోలేక పోయారు. పిల్లవాడు కూడ ఇద్దరిదగ్గర అదే ప్రేమతో అంతే సౌఖ్యముతో ఉండడము గమనించినారు. ఏది ఏమైన ఇద్దరాడవారు ఒకే పిల్లవానికి తల్లులు కాలేరు



కదా! రాజ్యసభ అంత నిశబ్ధములో మునిగి పోయింది. ఎవరు కాని, ఎటుగాని, ఏమి గాని చెప్పలేక పోయారు. అంత ఏకపర్ణి రాజుగారితో మహారాజు సభలో ఎవరు కూడ సరైన నిర్ణయానికి రాలేకపోతున్నారు. నా అభిప్రాయము ఏమిటంటే ప్రస్తుతము పిల్లవాడ్ని ఇద్దరాడ వాళ్ళకు కాకుండా ప్రభుత్వ అనాధశరణాలములో ఉంచాలి. వీరిద్దరు వంతులవారిగా రోజుకొకరు పిల్లవాడి సేవకు రమ్మనాలి కాలక్రమేణ నిజం అదే బయటపడ్తుంది. కాశీరాజు అందుకు సమ్మతించి పిల్లవాడిని ప్రభుత్వ అనాధ శరణాలమునకు అప్పగించారు. అప్పుడు కూడ ఇద్దరు స్త్రీలలో ఏ విధమైన అలజడి లేకపోవుట వలన సభాసదులంతా ఆశ్చర్య చకితులైనారు. రాజుగారు ఇక సభ చాలించారు.

అంత ఏకపర్ణి రాజ్య అనాధశరణాలయానికి వెళ్ళి అక్కడున్న ఆయాలను సంప్రదించి ఏమి చేయాలో ఇద్దరాడవారి వ్యవహారాలను గమనించమని చెప్పినారు. ఒక పక్షము రోజుల తరువాత మహారాజా వారి ఆజ్ఞతో ఇద్దరు తల్లులను పిల్లవాడిని, సభకు పిలపించాడు అప్పుడు శ్రీ ఏకపర్ణి హే! మహారాజ నేను రోజు అనాధ శరణాలయానికి వెళ్ళి ఇద్దరు తల్లుల ప్రవర్తనను ఆయాల సహాయముతో గమనించాను. మొత్తానికి నేను చెప్పే నిర్ణయము ఏమిటంటే ప్రమిలాంబనే పిల్లవాని నిజమైన తల్లి నేను ఇది ఎలా చేప్తున్నానంటే ప్రమిలాంబ యోగాంబ ఇద్దరు చాలా తెలివైనవారు వీరిద్దరు పిల్లల మనస్తత్వాన్ని గూర్చి పూర్తిగా అధ్యయనము చేసినారు, తెలసుకున్నారు అందువలన పిల్లవాడ్ని ఎత్తుకోవడం, ఆడించడం, ఆలనా పాలనా ఇద్దరు సమానముగా చేయుట వలన సభలో ఎవరు కూడ నిర్ణయానికి రాలేకపోయినారు. ఈ మధ్య కాలములో నేను పిల్ల మనస్తత్వముతో పాటు తల్లుల మనస్తత్వమును కూడ అధ్యయనము చేసినాను. ఈ పక్షము రోజులలో ప్రమిలాంబ తనపిల్ల

వాడి ఆలనాపాలనా చూస్తూ అవసరము పడిన మిగిలిన పిల్లల సంగతి కూడ చూచేది, మరియు వారికి కావలసిన సౌకర్యములను కూడ చూసేది. యోగాంబ అలా కాకుండ అవసరమైనను, అవసరము పడినను అత్యవసర పరిస్థితులలో కూడ ప్రక్క పిల్లను పట్టించుకొనేది కాదు.

ఇది పక్షము రోజులుగా అక్కడ ఉన్న ఆయాలు గమనించారు. తల్లి పిల్లలపై నున్న ప్రేమను ఆపుకోలేదు. అవసరము అయితే తన పిల్లవాడితో బాటు ఇతర పిల్లల అవసరాలను కూడ చూస్తుంది. ఇది తల్లి మనస్తత్వము. తల్లి తనపిల్లల అవసరాలుగాని ఇతర పిల్లల అవసరాల్ని కాని చూస్తు నిర్లిప్తంగా ఉండలేదు. ఆగలేదు. ఊరుకోలేదు. ఇది సహజముగా తల్లి మనఃస్తత్వము. యోగాంబ అలకాకుండ ఇతర పిల్లల అవసరాలు అత్యవసరమైన పట్టించుకోనేది కాదు. ఇది తల్లి సహజ మనస్తత్వానికి విరుద్ధము కనుక పిల్లవాడ్ని ప్రమీలాంబకు అప్పగించవ లయును. ఇది విని ప్రమీలాంబ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఇది గమనించిన సభాసదులంతా శ్రీఏకపర్ణి నిర్ణయాన్ని బల పరచినారు. రాజు పిల్లవాడ్ని ప్రమీలాంబకు అప్పగించి యోగాంబకు శిక్ష వేయాలని అనుకున్నారు. అంతే శ్రీ ఏక పర్ణి రాజుతో రాజా! మీరు యోగాంబకు ఏ శిక్ష వేయవద్దు. ఆమెలో తల్లి కావాలనే బలమైన కోరిక ఇలా చేయించినది. ఇద్దరును పిల్లల మనఃస్తత్వమును అధ్యయనము చేసినారు కనుక తొందరగా బైట పడలేదు. యోగాంబకు రాజావారి అనాధ శరణాలయములో పిల్లల ఆలనపాలన చూస్తు ఉండే బాధ్యతను అప్పగించగలరు. ఇది ఆమెలో పిల్లలపై నున్న తపనను ప్రేమను సంతృప్తి పరచగలదు. ఇదే ఆమెకు సరైన శిక్ష. రాజావారు శ్రీ ఏకపర్ణి విచక్షణా శక్తికి మెచ్చి పిల్లవాడ్ని ప్రమీలాంబకు అప్పగించి యోగాంబను అనాధ శరణాలములో పిల్లల ఆలనపాలన చూసేందుకు నియమించి శ్రీ ఏకపర్ణిని మెచ్చుకొని తగిన కానుకలతో సత్కరించారు.



శ్రీ ఏకపర్ణితో సౌధామిని భర్తకు తగిన రీతిగా నడుచుకొని ఎంతో సంతోషముగా సంసార జీవితాన్ని గడపసాగినారు. ప్రతిరోజు ఉదయాన ఇద్దరు నిద్రలేచి గంగానదిలో స్నానమాచరించి శుభ్రమైన వస్త్రములు ధరించి కాశీ విశ్వేశ్వరుని దర్శించి ఇంటికి వచ్చి తమ దినచర్యను ప్రారంభించే వారు. వివాహమై పది సంవత్సరములు గడిచిన వారికి సంతాన భాగ్యము కలుగలేదు. రోజు స్నానము తరువాత చెంబెడు నీరు తీసుకువచ్చి లింగాన్ని అభిషేకించి శంభోశంకరా! పార్వతీపతి!, గంగాధర! నీలకంఠ! వెండికొండ నివాస! ఢమురత్రిశూలధర, నటరాజ లయకారక పాహిమామ్, పాహిమామ్, రక్షమామ్ రక్షమామ్ అంటూ రోజు 11 నామాలతో అభిషేకము చేసి తమకు సంతానము ప్రాప్తి కల్గించమని వేడుకొనేవారు. రోజులు ఏండ్లు గడుస్తున్నా వారి కోరిక తీరలేదు. రోజు రోజుకు సంతాన లేమి వ్యాకులత ఎక్కువ కాసాగింది. ఒకరోజు దంపతులిద్దరు గంగానదిలో స్నానము చేసి సూర్యునికి అర్ఘ్యము ఒసగి చెంబుతో నీరు తీసుకొని విశ్వేశ్వరుని గుడికి వెళ్ళి అభిషేకము చేద్దామనుకొనగా ఒకసన్యాసి వారితో మీరు సంతాన లేమితో బాదపడుచున్నారు కదా! నేను చెప్పేదేమిటంటే మీరిద్దరు ఒక మండలము పాటు గంగానదిలో స్నానము చేసి సూర్యునికి అర్ఘ్యము ఇచ్చి అదే తడిబట్టలతో విశ్వేశ్వరుని దర్శించి అభిషేకము చేస్తే మీ కోరిక నెరవేరుతుంది అని చెప్పినాడు. దంపతులిద్దరు మరుసటి రోజు నుండి మండలము పాటు సన్యాసి చెప్పినట్లు తడిబట్టలతో శివుని ఆరాధించాలని సంకల్పము చేసుకొని రెండవ రోజు నుండి అలా విశ్వేశ్వరునికి తడిబట్టలతో అభిషేము చేయసాగినారు. మండలము రోజులు గడిచి రెండు నెలలు అయిన తరువాత సౌధామిని తనశరీరములో ఏదో మార్పును గమనించ సాగింది. ఆ మరుసటి నెలనే ఆమె నెలతప్పి గర్భవతి అయినట్లు రాజ వైద్యుడు నాడి పరీక్ష చేసి నిర్ధారించినాడు. దంపతులిద్దరికి

ఆనందమానందమాయెను. వాళ్ళ ఆనందానికి అవధులు లేక పోయెను. అన్నిటికన్న తమ జీవితాలు సార్థకమైనట్లుగా దలుప సాగినారు. రోజు గంగానదిలో స్నానము తరువాత ఆ సన్యాసి మరల కనిపిస్తాడేమోనని వెదకసాగినారు. కాని ఆ సన్యాసి దర్శన భాగ్యము కలుగలేదు. ఐదు నెలల గర్భధారణ అనంతరము రాజవైద్యుడు మరల సౌధామిని నాడిపరీక్ష చేసి గర్భములో కవలపిల్లలు ఉన్నట్లు వారు మగపిల్లలైనట్లు తెలిపాడు. శ్రీఏకపర్ణి సౌధామినుల ఆనందము ద్విగుణీకృతమాయెను. రాజవైద్యుడు సౌధామినితో ఇకనుండి చన్నీళ్ళ స్నానము ఎక్కువ శారీరక శ్రమ తగదని మానుకోమని సలహా ఇచ్చినాడు. శ్రీఏకపర్ణిమాత్రము రోజు గంగానదిలో స్నానమాచరించి తరువాత చెంబెడు నీటితో పదకొండు నామాలు చదువుతు శివాభిషేకము తప్పకుండ చేసేవాడు. తొమ్మిది నెలల అనంతరము రాజవైద్యుని పర్యవేక్షణలో సౌధామిని పురుడు పోసుకొని పండంటి కవల పిలలను కన్నది.

పురోహితుల వారు 21వ రోజున సంకల్పము పూజాదికాలు నిర్వహించి పెద్దవానికి సుఖపర్ణి, రెండవవానికి ముఖపర్ణి అని నామకరణము చేసి, నామకరణోత్సవము ఘనముగా జరిపినాడు. కవలలిద్దరు దినదిన ప్రవర్ధ మానము పొంది తిరగ సాగినారు. శ్రీఏకపర్ణి దంపతులిద్దరు కుమారులిద్దరికి ఐదవ ఏట ఉపనయన సంస్కారము చేసి గురుకులానికి పంపినారు. పిల్లల ఆటలు, ముచ్చట్లు, అల్లరికి అలవాటైన శ్రీఏకపర్ణి దంపతులు ఇల్లంతా బోసిపోయినట్లు అనుభవించ సాగారు. చదువు మాన్పించి గురుకులము నుండి తిరిగి తీసుకొని రావాలని కూడ ఆలోచించసాగారు. వారి ఎడబాటును భరించడం చాలా కష్టమైనది. ఐన పిల్లల భవిష్యత్తుపై దృష్టి ఉంచి తమ బాదను భావోద్వేగాన్ని అణుచుకొని రోజులు గడుపసాగినారు.



సుఖపర్ణి ముఖపర్ణి పిల్లలిద్దరు గురుకులములో మేటి విద్యార్థులుగా పేరు పొందినారు. వేదాలు, వేదాంగాలు, తర్కము వ్యాకరణము, మీమాంస మొదలగు అనేక శాస్త్రాలలో నిష్ణత సంపాదించారు. గురువు ఒకరోజు ఏదో పట్టుకొని తనపిడికెలిలో ఉన్నదేమి అని తమ శిష్యులను అడిగినారు అందరు మీన మేషాలు లెక్కిస్తు ఏదో శాస్త్రములోని అంగాలు కాగితాలు పైలెక్కలు వేస్తూ ఆ వస్తువు స్వరూప స్వభావాలను తెలసుకొన ప్రయత్నము చేయసాగారు. సుఖపర్ణి, ముఖపర్ణి ఇద్దరు ఏమి మాట్లాడకుండ కూర్చున్నారు. సమయము కాగానే గురువుగారు ఒక్కొక్కరికి వివరాలు అడుగసాగినారు. కొందరు దానికి మూడుచుట్లు ఉన్నాయని ఇలా తమ లెక్కల ద్వారా తెలిసింది చెప్పసాగినారు. గురువుగారు సుఖపర్ణి ముఖపర్ణిని అడుగుతు మీరు ఏమి లెక్కలు వేయలేదు మామూలుగానే కూర్చున్నారు మీరు ఎందుకలా చేసినారు మీ సమాధానము ఏమిటి? అని అడుగగా ఇద్దరు మీ చేతిలో ఉన్నది మీ బంగారు ఉంగరము అని అన్నారు. గురువు ఆశ్చర్యపోయి మీరు ఎలా చెప్పగల్గినారు. అనగా వారిద్దరు గురువు గారు ఇది చాలా సులభము. మీరు మీ చేయి పడికిలి పట్టినప్పుడు మీ చేతికి మాములుగా ఉండవలసిన ఉంగరము లేదు. రెండవది ఉంగరము తీసివేయడము వలన ఉంగరము ఉండవలసిన చోటు తెల్లగా అయినది అది కనిపిస్తున్నది దానికి మీనమేషాలు ప్రశ్నశాస్త్రమ అవసరము లేదు. రోజువారిగా మీరు ఉంగరము పెట్టుకొనేది మేము ఏళ్ళ తరబడి గమనించినాము. మీరు ఎప్పుడు కూడ ఉంగరము తీయలేదు. ఉంగరము లేకుండ ఉండలేదు. ఈ రోజు వేలికి ఉంగరము లేదు. మరి ఆ చోటు తెల్లగా ఉన్నది. ఇది రోజు వారిగా గమనించిన విషయాన్ని విశ్లేషణ చేయడమే కాని, గమనించడమే కాని దీనికి ప్రశ్న శాస్త్రము, పంచాంగ ప్రాముఖ్యము అవసరము లేదు. గురువు గారు వారి మేధాశక్తికి, వారి సూక్ష్మ దృష్టికి మెచ్చుకొని ఇక మీ చదువు అయిపోయినది. ఇక మీరు

ఇంటికి పోవచ్చును అన్నారు. తరువాత గురువుగారు శ్రీ ఏకపర్ణి దంపతులను పిలిచి వారికి పిల్లలను అప్పగించారు. మీ కుమాలిద్దరు ఉద్దండులు. వీరి సూక్ష్మదృష్టి, విచక్షణ శక్తి అమోఘము. భవిష్యత్తులో వీరిద్దరు జీవితంలో చక్కగా రాణించి మీకు పేరు తెస్తారు. అలా విద్యార్థులిద్దరిని సాగనంపారు.

గురువుగారు సుఖపర్ణి, ముఖపర్ణిలను ఆశీర్వదించి వారికి ఈ విధంగా చెప్పసాగినారు. ఇన్ని సంవత్సరములు మీరు గురుకులము లోన నివసించి విద్యాభాగ్యసము చేసినారు. మీ ఇద్దరిలో నేను గమనించినది ఏమిటంటే మీరు ఇతర సంగతులు అనగా మీరు నేర్చిన శాస్త్రాలు, గణితాలు, సాహిత్యములోనే కాకుండ మీరిద్దరు భక్తిమార్గము వైపు ఎక్కువగా ఆకర్షితులైయున్నారు. భక్తి మార్గము కూడదని నేను అనను మీకు ఇతరత్ర నడవమని గురువుగా శాషించడం కాని, సలహా ఇవ్వడము కాని చెయ్యను. భక్తి అనేది తమ తమ జీవితాలకే పరిమితమవును. ఇందులో కేవలము ఆనందమున్నది. భగవత్ నామము, భక్తి మార్గము మనలను చెడుమార్గమునకు దూరంగా ఉంచుతుంది. తమ శక్తి సామర్థ్యాలు పెంచుతుంది ఒక్కొకసారి మనిషిని సోమరిగాను, అన్నిటికి భగవంతుడే ఉన్నాడని వితండవాదమునకు దారి తీయవచ్చు. అన్నిటికి, భగవంతునిపై వదిలి కేవలము భక్తిని అవలంబించుట వలన, పురుషార్థాలు తమ శక్తి సామర్థ్యాలు బయట పడకుండ తెలివితేటుల అవసరమైన చోట వినియోగించు కోకుండ అవకాశము ఏర్పడవచ్చును. ముఖ్యముగా చెప్పాలంటే మన భక్తి, మన దినసరి అవసరాలను సమాజ అవసరాలను గమనించకుండ, సాధించకుండ శక్తిని మరుగున పడవేయవచ్చును.

అదే భక్తి పుణ్యము, పురుషార్థము, భౌతిక స్థితి గతులను, సామాన్య స్థితిగతులకు, సామాజిక స్థితిగతులను మేలుచేసే విధముగా మలచుకొంటే, స్వయంగా సంతృప్తి పొందడమే కాకుండ ఇతరులకు మనము సహాయము



చేసే అవకాశము కల్గుతుంది. ఇతరులకు కలిగే లాభాల వలన ఎంతో ఆనందము సంతృప్తి కలుగుతుంది. ఒక వ్యక్తి భక్తి మార్గములో పయనిస్తూ, కేవలము అంత భగవంతుని ఇచ్ఛ అని మన చేతిలో ఏముందని ఆలోచిస్తూ ఉంటే అతని చుట్టు ఉన్న బంధవులు ఇతని అవసరాలను తీరుస్తు ఉంటే తను మాత్రమ ఏమి పట్టక భగవాన్నమ స్మరణ చేస్తూ గడిపేవాడు. సంసారిక విషయాలు, అవసరాల గూర్చి పట్టించుకొనకుండా గడిపిన సందర్భములో ఒకరోజు ఏదో సమస్య ఏర్పడి ఇంట్లో అందరు దానిని తీర్చుటలో నిమగ్నము అయినారు. ఇతనికి భోజన సమయము అయినది ఎవరు వీని విషయము పట్టించుకోలేదు. భరించరాని ఆకలి కలిగిన వీనివైపు ఎవరును చూడలేదు, అరచిన, పిలచిన ఎవరు పల్కలేదు. ఏమి తోచడము లేదు. ఆకలి దంచి వేస్తున్నది తాళలేని స్థితికి చేరకున్నది. ఇలా ఎందుకు జరిగినదని ఒకసారి ఆలోచన కల్గి తన జీవితాన్ని కూలంకషంగా పరీక్షించాడు. తను భౌతిక విషయాలను, అవసరాలను ఇతరులకు సంబంధించినవి కాక తనకు సంబంధించినవి కూడ పట్టించుకోవడం లేదన్న సంగతి గ్రహించి, తను జీవితంలో చేస్తున్నదేమి? ఇప్పుడు నెత్తి మీదకు వచ్చిన తరువాత తనకు తానుగాని ఇతరులను గాని నిందించి ప్రయోజనము ఏమున్నది. ఈ పరిస్థితి తన ఆకలిని తీర్చలేదు. శక్తి ఇవ్వలేదు. ఇతరులు తనకు సేవ చేస్తున్న ఈ విషయాలను కూడ తను గుర్తించలేదు. భక్తి మార్గము తమ సంతృప్తి కొరకు మాత్రమే జీవిస్తున్నాడు, కాని చుట్టు జరుగుతున్న విషయాలు గమనించలేదు. తను ఎవరికి సహాయము గాని వాళ్ళ విషయము గాని పట్టించుకోలేదు. ఒక్కరోజు తనను ఎవరు పట్టించుకొనక పోతే తనకు కల్గిన బాధ చెప్పనలవి కాదు, వర్ణనాతీతము. తన కుటుంబములో సభ్యులకు కూడ వారికి అవసరాలు ఉంటాయి. అవి వారి గూర్చి కాని, వాటిని గూర్చి కాని తను పట్టించుకొనలేదు. ఇంత చదివి, ఇంత జ్ఞానము సంపాదించి ఏమి

లాభము? భక్తి తనకు తప్పు, తన మానసిక స్థితి, సంతృప్తిని ఇస్తుంది తప్ప మరే విధముగా పనికి రాకుండ పోయినది. కుటుంబ సభ్యులంతా తన అవసరాలు తీరుస్తున్నారు తాను మాత్రము వారి గూర్చి పట్టించుకోవడంలేదు. మనిషికి భక్తి ఉండాలే కాని, దేనికైన ఒక హద్దు ఉంటుంది. అతి సర్వత్రావర్జితే అని తెలిసికూడా ఒక గాడిలో పడిన విదముగా భక్తి మార్గములో ప్రయాణించి సాధించినది ఏమి? తెలియదు తన భక్తికి భగవంతుడైన సంతృప్తి చెందినాడో లేడో తెలియదు. పరోపకారం ఇదం శరీరం అని తెలిసి అజ్ఞానములో బ్రతికినాను. ఇకనైన తెలివి తెచ్చుకొని పది మందికి ఉపయోగపడేలా కర్తవ్యము నిర్వహిస్తాను ఇలా మనస్సులో అనుకొని తన జీవిత విధానము మార్చుకొని తనకు తెలిసిన అనేక విషయములలో ఇతరులకు సహాయము చేస్తు అందరి మన్నలను పొందినాడు.

ఈ కథ మీకు చెప్పడంలో ఉద్దేశ్యము ఏమంటే మనము సంఘములో జీవిస్తున్నాము. స్వంత అవసరాలు ఉన్నట్లు సంఘములో కూడా అవసరాలు ఉంటాయి, అవి కూడా తీరుస్తుంటే మంచి జీవితము పొందుతారు. ఇక మీ తల్లిదండ్రులతో కలసి ఇంటికి వెళ్ళి మీ జీవితాలను తగుమంచి బాటలో గడుపగలరు స్వస్తి.

## జయవిజయుల సంచారము

ఇలా గురువు దగ్గర చదువుశిక్షణ, ఉపదేశము పొంది అన్నదమ్ములిద్దరు ఇంటికి వెళ్ళి తమ తల్లిదండ్రులతో విలాసముగా ఉల్లాసముగా గడపనిర్ణయించుకున్నారు. ఇన్ని సంవత్సరాలు తమ తల్లిదండ్రుల ప్రేమ, అభిమానము, ఆప్యాయతలకు దూరమై కఠోర గురుకుల నియమాలను పాటిస్తు గడిపినందున కొంత కాలము విశ్రాంతి అవసరమని అన్నదమ్ములిద్దరికి తోచినది. విశ్రాంతిగా ఉంటు తమకు



తెలిసిన విషయాలను విశ్లేషణ అనే విషయాలను విశ్లేషించి అర్థమును అన్వేషించ సాగినారు. గురువుగారు చెప్పినట్లు ముఖ్యముగా తమ మనసులు భక్తి వైరాగ్యము పట్ల ఆకర్షితులైనందులకు ముందుగా భక్తి గూర్చి కూలంకషంగా విచారము చేయసాగారు.

భక్తి అనగా ఏమి? వైరాగ్యమనగానేమి? భక్తికి వైరాగ్యములకు ఏదన్న సామ్యము కాని భేదము కాని ఉన్నదా లేదా. దేని కదే వేరు వేరుగా రెండింటికి సంబంధము ఏమి? భక్తి వైరాగ్యము వాటి సంబంధము గూర్చి తెలియాలంటే ముందు వాటిని గూర్చి తెలుసుకోవాలి, అర్థము చేసుకోవాలి. అప్పుడే వాటి మధ్య ఉన్న సంబంధము అనగా సామ్యము భేదము తెలుస్తుంది. భక్తి అంటే ఏమిటి? అది ఎన్ని రకాలుగా ఉంటుంది. దానికి సందర్భాలు తోడు చేసుకుంటాయా! అలాగే వైరాగ్యము ఎన్ని రకాలు వాటికి కూడ సంఘటనలు చోటు చేసుకుంటాయా.

శాండిల్యముని మరియు నారదుల వారు భక్తిని నాలుగు రకాలుగా విభజించినారు. 1) ఆత్మభక్తి తమ ఆత్మను అర్థము చేసుకొనుట, 2) ఈశ్వరభక్తి, సగుణ నిర్గుణ దైవత్వాని తలచుకోవడం, 3) ఇష్ట దేవతాభక్తి తమ మనస్సుకు నచ్చిన దేవి దేవునిపై శ్రద్ధ. 4) గురు భక్తి. ఇంకొక రకముగా భక్తిని తొమ్మిది విధములుగా చెప్పవచ్చునన్నారు. 1) శ్రవణభక్తి వినడము వలన వచ్చే అంతర్గత అర్పణము. 2) కీర్తన భక్తి ప్రార్థన చేయుట వలన కల్గు భక్తి 3) స్మరణ భక్తి జ్ఞాపకము చేయుటవలన కల్గు భక్తి. 4) పాదసేవ భగవంతుని పాదాలపై తదేక దృష్టిని నిలపడం. 5) అర్చన భక్తి ఆరాధన చేయుటవలన కల్గు అర్పణ. 6) వందన లేదా నమస్కార భక్తి భగవంతునికి వందనము చేసి అర్పించుకోవడం, 7) దాస్యభక్తి తాను భగవంతునికి సేవకుడనే భావించుకోవడం. 8) సఖ్యతభక్తి భగవంతునికి తను స్నేహితుడని భగవంతుడు తన స్నేహితుడని భావించడం, 9) ఆత్మ నివేదన భగవంతుని తనను తాను అర్పణ

చేసుకోవడం, మరో విధమైన విశ్లేషణ ప్రకారము భక్తి 5 విధములు, 1) శాంతిభక్తి భగంతునితో తిరుగులేని సంబంధము, 2) సఖ్యస్నేహ 3) భక్తి దాస్యభక్తి, 4) వాత్సల్యభక్తి తల్లిగా తన సంతానము పైన ఉండే అవ్యాజ్యమైన ప్రేమ, 5) మధుర భక్తి స్త్రీలకు తమ భర్తపై ఉండే ప్రేమ.

అన్నదమ్ములిద్దరు ఇలా భక్తుని గూర్చి ఆలోచించి, కూలంకషంగా భక్తి యొక్క తత్త్వాన్ని గ్రహించినవారై ఇక వైరాగ్యము గూర్చి విచారించతలచినారు. వైరాగ్యము అంటే ఏమిటి? వైరాగ్యము అంటే అది రెండు పదముల కలయిక అంటే రాగమనగా ప్రేమ తత్త్వము. అనగా ఆలోచనలు లేకుండ సామాన్య అర్థమేమంటే దేనితోను ఎక్కువగా సంబంధము లేకుండ కోరికలకు అతీతంగా ఎటువంటి విచక్షణ లేకుండ మనస్సు పరి పరి విధములు పోకుండ ఉండడము. వైరాగ్యము పొందడంలో ఐదు మెట్లు కలవు. 1) మనస్సును ఇంద్రియ సుఖము కొరకు పరుగెత్త కుండా ఉంచడం. 2) వ్యతిరేకత అన్ని రకాల వస్తువులకు, సంఘటనలకు, సుఖాలకు దూరంగా ఉండడం. ఈ వస్తువుల పట్ల, సుఖాల పట్ల ఎంత విముఖత కల్గింది తెలిసికోవడం మనస్సు ద్వారా గ్రహించడం, 3) వికేంద్రియత అనగా మనస్సును రాగ ద్వేషాలకు అతీతముగా ఉంచి అన్నింటికి మనస్సును ఒకే భావముతో మెలగడం, 4) విసిధార మనస్సు శరీరము ఏ విధమైన ఆకర్షణలకు లోను కాకుండా మనస్సు అనే సంకెలల నుండి విడివిడడం. మనస్సు అన్నింటికి అతీతముగా ఉండడం. ఆ విధంగా అలవర్చుకోవడం మానసిక సంతృప్తి ఎదుగుదల అనే మానసిక, శారీరక ఎదుగుదలపై స్థాయికి చేరుకోవడం. వైరాగ్యము తోనే మానిసకోన్నతిని సాధించగలము అనే స్థితి పొందడం. సాధ్యమని తెలిసికోవడం. 5) పరావైరాగ్యము ఇది ఉత్తమమైన స్థితి సాధకుడు అన్నిరకాల వ్యవస్థల నుండి బయటపడి తన గూర్చి ఆలోచన మరచి పోవడం.



వైరాగ్యము 3 స్థాయిలలో ఉంటుంది. 1) మంద 2) తీవ్ర, 3) తీవ్రతర, ప్రతి రోజు అన్నదమ్ములిద్దరు కాలకృత్యములు తీర్చుకొని గంగానదిలో స్నానము చేసి కాశీవిశ్వేశ్వరుని దర్శించి గంగ నుండి తెచ్చిన నీటితో శివునికి అభిషేకము చేసి ఇంటికి పోయి భోజనాదులు గ్రహించి, శాస్త్ర పరిజ్ఞానము గూర్చి చర్చించసాగారు. గురుకులము నుండి వచ్చి కొంత కాలము గడచిన తరువాత ఇద్దరును ఒకే ఆలోచన చేయసాగినాడు. 1) తమకు తెలిసిన విద్యను వ్యాప్తి చేయుటకై ఒక గురుకులమును స్థాపించి ఇతరులకు ధార పోయడం. 2) హిమాలయాలకు పోయి తపస్సు చేసి భగవంతుని గూర్చి తెలసికోవడం, 3) తమ భాగ్యముతో జ్ఞానముతో ఏదో ఒక రాజు కొలువులో ఉద్యోగము సంపాదించి జీవితాన్ని ప్రారంభించడం. 4) దేశ దేశాలు తిరిగి మరింత జ్ఞానము సంపాదించడం ఇందులో ఏదో ఒకటి చేసే విధముగా నిర్ణయము తీసుకోవలసినదిగా ఆరాటపడసాగారు. గురుకులంలో తమ శిక్షణ పూర్తి అయిన తరువాత గురువుగారు అన్న మాటలు పలుమార్లు జ్ఞాపకము వచ్చేవి. గురువుగారు నేను మీరు గురుకులంలో ఉన్న ఇన్ని సంవత్సరాలలో గమనించింది ఏమిటంటే మీరు భగవద్ భక్తిపై ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చేవారు. భగవద్ భక్తి చేయడం, భగవంతుని గూర్చి తెలిసికోవడం, భగవంతుని చేరుకోవాలనే మీ కోరిక నేను కాదనను భక్తి జ్ఞానము వైరాగ్యము తమ మనస్సుకు, శరీరాలకు సంబంధించినది అందులో ఉన్న అలౌకిక ఆనందము ఎందులోను లేదు. భగవంతుని చేరుకోవాలని, భగవంతుని ఆరాధించి మోక్షము పొందాలన్నది మంచి తపనే కాని దాని వలన వ్యక్తిగా సంతృప్తిని ఇస్తుంది, దాని వలన సమాజానికి గాని కుటుంబానికి కాని, కించిత్ లాభము కలుగదు. ఒకొక్కసారి సమాజానికి బరువుగా కూడకనిపించవచ్చును. నన్నే ఉదాహరణగా తీసుకోండి. నేను నా విద్యాభ్యాసము తరువాత కొన్ని రోజులు దేశాటన చేసినాను. ఎన్నో

శారీరక, మానసిక, సామాజిక, ఆధ్యాత్మిక సంపదను సంపాదించినాను. తరువాత సమాజానికి సేవ చేయాలనే ఉద్దేశముతో ఈ గురుకులాన్ని స్థాపించి ఎందరికో విద్యాదానము చేసి మంచి విద్యార్థులుగా మంచి పౌరులుగా మెలిగే విధంగా తీర్చిదిద్దినాను. నా విద్యార్థులెందరో రకరకాల వృత్తులలో స్థిరపడి వారికి తోచిన విధముగా తమకు, కుటుంబానికి సమాజానికి, దేశానికి ప్రత్యక్షముగా, పరోక్షముగా సేవ చేస్తున్నారు. వారు నేను గురువునని వారు చెప్పుకోవడంలో ఆనందము కలుగుంది. మీరు కూడ భక్తి మార్గములో ఆసక్తి ఉన్నను అదికూడా సమాజ సేవకు, సమాజ వసరాలకు తోడ్పడే విధముగా మలచుకొనవచ్చును. ఇంతకు ముందు భక్తి మార్గము ద్వారా ఎవరు సాధించలేనిది మీరు సాధించవచ్చు. అందరు నడిచే దారిలో నడవడం ఏమున్నది కొత్తదనం. అందరికి ఉపయోగకరమైనది ఏదన్న ఉన్నదా అని ఆలోచన చేయడంలోనే ఉన్నది గొప్పతనం. ఆలోచనలకు పదును పెట్టి సాధించడానికి మార్గాలు అన్వేషించడం లోనే ఆనందము ఉంటుంది. దాన్నే లోకానికి భిన్నంగా సాధించి నడచి సమాజానికి మేలు చేయడంలో ఉన్న ఆనందము, సంతోషము, సంతృప్తి చెప్పనలవి కానిది. ఏదన్న సాధించిన తరువాత కలిగే భావనలు వర్ణనాతీతము. ఇది తనకు, తన కుటుంబానికి, సమాజానికి, తోడ్పడే విషయమే గొప్ప బహుమానము. ఎప్పటికి భావావేషములో నిర్ణయానికి రావద్దు. మీకున్న గొప్ప సదావకాశము ఏమంటే మీరు ఇద్దరు చర్చించి విచారించి, నిర్ణయించుకునే అవకాశము ఉన్నది. భగవంతుడు మీ ఇద్దరిని ఇలా పుట్టించడంలో గొప్ప పరమార్థమున్నది అని నేను భావిస్తాను. ఇలా గురువుగారి చివరిబోధన తమ ఇద్దరి మనస్సులలో అనుక్షణము తమ ఆలోచన పరిధి, తమ భవిష్య కార్యక్రమము ఏ విధముగా ఉండాలో నిర్ణయానికి రావడానికి తగిన విధముగా ఏ పద్ధతి అవలంబించాలో విచారంచసాగారు.



గురువుగారు చెప్పిన మరోమాట కూడా వారికి తరచుగా జ్ఞాపకం వస్తుంది. భక్తి అంటే ఏమిటి? భక్తులంటే ఏ హిమాలయాలలో ఏకాంత ప్రదేశమునకు పోయి తపస్సు చేసి ఏకాగ్రత సాధించడం కాదు. అది నేను తప్పనిగాని, మంచి పద్ధతి కాదు అని, తగిన పద్ధతి కాదు అని నేను అనను. నేను ఇంతకుముందు చెప్పినట్లు భక్తి ప్రతిఒక్కరి మనస్సుకు సంబంధించినది. అది భగవంతునికి వ్యక్తికి మద్య సాన్నిధ్యము పెంపొందించేది. వ్యక్తిని భగవంతునికి దగ్గరగా చేసేది. తపస్సు చేసి ఏకాగ్రత సాధించి భగవంతునికి దగ్గర ఔతున్నాననే వ్యక్తి మానసికస్థితి మాత్రమే. తను భగవంతునికి దగ్గర అవుతున్నానని ఆలోచననే. అది కొన్నిసార్లు రకరకాలుగా అనుభవంలోనికి రావచ్చును. ఇది తనకు సంబంధించినది మాత్రమే. భగవంతుని దృష్టిలో అంత సమానమే. ఏ విధమైన భేధాలు లేవు. మంచివాడు, బీదగొప్ప ఇలా రకరకాల తారతమ్యాలు మనిషి సృష్టించుకొన్నవి మాత్రమే. భగవంతుని తెలుసుకున్నవారు. భగవంతునివలనే వీటికి ఆతీతులు. భగవంతుడు సర్వకాల సర్వాస్థలలో, ఎల్లవేళలలో అన్ని చోట్ల ఉంటాడు. భూమిపై నున్న మానవులకు సూర్యోదయము సూర్యాస్తము ఉంటుంది. భూమి గుండ్రగా ఉంటుంది. తన చుట్టూ తాను తిరిగుతుంది. ఒక చోట పగలు ఉంటే మరోచోట రాత్రి ఉంటుంది కదా! కొంత సమయానికి రాత్రి ఉన్నచోట పగలు పగలు ఉన్న చోట రాత్రి వస్తుంది. ఇవన్ని సూర్యునికి సంబంధములేదు. ఒక భూమికి భూమిపై అనురాగము రెండు వేరు వేరు కావు. ఇది మన ఆలోచన మాత్రమే. భక్తిని అనురక్తిగా అనురక్తిని భక్తిగా మార్చుకోవడమేనని అటువైపుగా త్రిప్పడము మాత్రమే. కనుక ఈ విషయాలు మీరు జాగ్రత్తగా జ్ఞాపకము పెట్టుకొని జీవితాన్ని ఆరంభించండి. మనము సమాజములో ఉన్నది మానవ సేవయే మాధవసేవ చేయుటకని పెద్దలు అన్నారని, పరోపకారం ఇదం శరీరం

అని పూర్వము ఋషులు, మునులు, వేదాంతులు అన్నారు. ఇందులోని అర్థాన్ని పరమార్థాన్ని మీరు గ్రహించకలిగి మెలగగలరు. గురువు ఉపదేశాన్ని గుర్తు చేసుకుంటు, మననము చేసుకుంటు రోజు విశ్వేశ్వరుని సేవించుకుంటు కొంతకాలము గడపసాగినారు. భక్తి వైరాగ్యము, మోక్షము గూర్చి రోజు చర్చించసాగినారు. భక్తి వైరాగ్యము, మోక్షము గూర్చి రోజు చర్చించుకొనసాగినారు. ఒకరోజు తమ విద్యార్జన అయింది ఇక ఎన్ని రోజులు తండ్రిమీద ఆధారపడడం తాము కూడా తమకంటు ఒక స్థానాన్ని సంపాదించాలని జీవితము కొరకు కావల్సిన హంగులను సమకూర్చుకోవాలని ఆలోచన కల్గింది. కాశిరాజు కొలవులో ఏదన్న కొలువు సంపాదిద్దాం అనే ఆలోచనలు కలుగగా అది అంతసబబుగా ఉండకపోవచ్చును అనిపించింది. ఎందుకనగా తాము ఇద్దరు వృత్తి వ్యాపారాలు స్వయంగా తమ చేతులోతో చేసే పనేమి నేర్చుకోలేదు. కనుక అవి తమకు సాధ్యము కాదు. ఇకపోతే చదువు విజ్ఞానముతో రాజుగారి సభలో కొలువు, స్థానము సంపాదించాలి. అంటే ముందు ఈ విధమైన వృత్తిలో తమ తండ్రిగారు ఉన్నారు ముందు ఆయనకు పోటిగా ఉండవలసి ఉంటుంది తమ చతురత, చాకచక్యము, విద్యా ప్రాబల్యము రాజుగారి ముందు నిరూపించవలసి ఉంటుంది. అందులో తమ తండ్రిగారితో పోటికి దిగవల్సి ఉంటుంది. మరేదైన మార్గము అన్వేషించవలెనని నిర్ణయించుకున్నారు. కాశీ విశ్వేశ్వరుని భక్తిగా సేవిస్తున్నారు నమ్ముకున్నారు కనుక భక్తే ఏదైన మార్గము చూపిస్తుందని ఆలోచించసాగారు.

ఒక రోజు ఉదయం రోజులాగా గంగానదిలో స్నానము చేసి గుడికి దర్శనానికి వెళుతుండగా ఒక విద్వాంసుల గుంపు ఏదో చర్చించుకోవడం చూసినారు. వారిని అడుగగా వారు తాము ఒక గురుకులంలో చదువకున్నవారమని తాము ప్రయాగ నగరానికి వెళ్తున్నామని తమ తీరుతెన్నులు తెలివి. ప్రగతి ప్రయాగరాజు కొలువులో ప్రదర్శించి మంచి



బహుమానాలు పొందాలని బయలుదేరినామని, మాకు రాజుగారి కొలవులో ఏదన్న కొలువు పదవి దొరకుతుందని ఆశిస్తున్నారా సోదరులిద్దరు అడుగగా వారు తమకు అలాంటి ఆలోచన లేదని తమ విద్వత్తు ప్రదర్శించడానికి వెళ్తున్నామని అన్నారు. మీరు రాజుగారి సభలో ఏదైన కొలువు సంపాదించాలని ఎందుకు అనుకోవడం లేదనగా తమకు కొలువు మీద పదవి మీద ఆసక్తి లేదని దేశాటనను చేస్తూ తమతమ విద్యను పెంపొందించుకోవలెనని తమ ఆలోచన ఉద్దేశము అని తెలిపినారు. అందువలన ఎన్నో దేశాలు తిరుగవచ్చునని తెలిపారు. తరువాత అన్నదమ్ములిద్దరు తమను కూడా వారితో బాటు రావడానికి అనుమతించగలరని విన్నవించారు. తాము వారితో వచ్చి సామాన్య ప్రేక్షకుల లాగ ఉంటామని వారి కార్యక్రమాలకు గాని కలాపాలకు గాని, వ్యాపకములో గాని కల్పించుకోమని అన్నారు. అంత వారు సరే నన్నారు. మేము ఈ రోజు ఇక్కడ కాశీ విశ్వేశ్వరుని దర్శించుకొని ఈ పూట కాశీలో ఉండి కాశీ నగర విశేషాలను చూసి మరుసటి రోజు ప్రయాణము అన్నారు. మీరు మాతో రావచ్చు అన్నారు. అన్నదమ్ములిద్దరు తరువాత ఇంటికి పోయి తల్లిదండ్రులకు విషయము వివరించి తమకు కూడ ప్రయాగ వెళ్లుటకు అనుమతి నిమ్మని కోరినారు. తల్లిదండ్రులు సరేనని వారికి ప్రయాణములో తీసుకోవలసి జాగ్రత్తలు వివరించి దారి ఖర్చులకు ధనము కొంత ఇచ్చినారు. అన్నదమ్ములిద్దరు ఉదయాన గంగానదిలో స్నానము చేసి శివుని పూజించి పండితులను కలవడానికి వారు నివసించిన రాజధర్మశాలకు వెళ్ళినారు. అప్పటికే వారు ప్రయాణానికి సిద్ధమైనారు. మేము మీ కోసమే ఎదురు చూస్తున్నామని ఇద్దరు యువకులు ఇంకా రాలేదేమని అనుకుంటున్నాము. మీరు రానే వచ్చినారు. ఇక మనము ప్రయాణానికి బయలుదేరవచ్చును. అన్నదమ్ములిద్దరు కూడ తగు సామానులతో బాటు బయలుదేరినారు. పండితులలో ముఖ్యుడు ఇలా

చెప్పసాగినాడు వారణాసి నుండి ప్రయాగ, సుమారుగా 16 యోజనముల దూరమున ఉన్నది. మనము రోజుకు 4 యోజనములు నడిచిన 4 రోజుల ప్రయాణము తరువాత 4వ రోజు సాయంత్రం ప్రయాగ నగరము చేరగలము. ఏ కారణము వలనైన ఎప్పుడైన ఒక రోజు తక్కువ నడిచిన 5వ రోజు సాయంత్రము ప్రయాగ నగరము చేరగలము. మనము దారిని దూరభారాన్ని మరి ఎవరైన తప్పిపోకుండ ఉండడానికి మనము గంగానది తీరము వెంబడే ప్రయాణము చేయవలసి ఉంటుంది. దారిలో ఇతరులను వాకబు చేస్తూ ప్రయాణము సాగించవలసి ఉంటుంది. మొదటి రోజు సాయంత్రానికల్లా మనము వశిష్ఠ మహర్షి ఆశ్రమము చేరితే అక్కడ మనకు సకల సౌకర్యాలు లభిస్తాయి. అదియు కాక వశిష్ఠ మహాముని మనకు సౌకర్యాలను కలుగ చేయడమే కాకుండ తరువాత మార్గదర్శనము చేయగల్గుతారు. వీలుఐతే వారి శిష్యులలో ఒకరిని మనవెంట పంపే అవకాశము కూడ ఉంటుంది. ఇది మనము అనుకోవడమే కాని ఇలా అవుతుందని కాని చెప్పలేము. వశిష్ఠుల వారు మహానుబావుడు బ్రహ్మమానస పుత్రుడు భూతభవిష్యవర్తమాన కాలములను చూడగల సమర్థత గలవాడు వశిష్ఠుని ఎంత పొగడినను ఆయన గుణగణాలను ఎంత కీర్తించినను తక్కువే. ఎంతో సాహిత్యాన్ని శాస్త్రాన్ని అందించిన మహానుభావుడు. ఎవరికి నొప్పించని వాడు అరిషడ్ వర్గాల జోలికి పోకుండ ఉండే అతీతుడు. మనకు ఆతిథ్యము ఇవ్వడం అతనికి క్రొత్త ఏమి కాదు. ఇలా వారణాసి నుండి మార్గాయాసము తెలియకుండ సాయంత్రానికి వశిష్ఠుల వారి ఆశ్రమానికి చేరుకుంటారు. వశిష్ఠులవారు వీరి రాకను గూర్చి అడిగి తెలుసుకొని వారికి తగిన సౌకర్యాలను కలుగ చేసినారు. వశిష్ఠుల వారు సుఖపర్ణి, ముఖపర్ణి సోదరుల గురించి అడుగగా వారు తాము వారణాసిలో ఉంటున్నామని, వారణాసిలో ఉన్న తమ తండ్రిగారికి పోటిగా ఉండవలసి వస్తుందని అందువలన ప్రయాగరాజైన



మరుత్తు గారి సభలో ఏదైన కొలువు కాని ఉద్యోగము కాని సంపాదించి తమ జీవితాల్ని సార్థకము చేసుకోవాలని తమ అభిలాష అని వశిష్ఠులవారికి విన్నవించారు. వశిష్ఠుల వారు తన దివ్యదృష్టి ద్వారా వీరి పుట్టు పూర్వోత్తరాలను గ్రహించి మీకు మరుత్తు మహరాజు కొలువులో చాలా మంచి జరుగుతుందని అన్నారు. అన్నదమ్ములిద్దరు వశిష్ఠుల వారి వాక్కు తమకు గొప్ప ఆశీర్వాదముగా భావించినారు. వశిష్ఠుల వారు అన్నదమ్ములిద్దరితో మీరు జీవితాన్ని మొదలు పెట్టేముందు ప్రతి విషయాన్ని కూలంకషంగా విచక్షణా జ్ఞానము ద్వారా పరిశీలించి ప్రయత్నించి నట్లైన మీకు జీవితంలో తిరుగు ఉండదు, ఓటమి ఉండదు. జీవితములో ఎప్పుడైన అసంబంధితమైన పరిస్థితులైన ఎదురుకొనవలసి వచ్చిన మానసిక సంతులనము పోగొట్టుకొనవలదు. జీవతానికి భక్తి మార్గమును అనుక్షణము జోడించనిట్లైన మీకు సదా సుఖము సంతోషము కల్గుతుంది అని హితభోద చేసినారు.

మరునటి రోజు ఉదయాన స్నానము సంధ్యావందనాల కార్యక్రమములు ముగించుకొని అల్పాహారము గ్రహించి ముందుకు సాగడానికి వశిష్ఠులవారి అనుమతి కోరినారు. వశిష్ఠువారు ఇక్కడకు నాల్గు యోజనముల దూరంలో నాగదంతి అనే మహానుభావుని ఆశ్రమము ఉన్నది అక్కడకు మీకు చేరినట్లైతే మీకు అందరికి నాగదంతి గారు సౌకర్యాలను చేకూర్చడానికి ప్రయత్నించవచ్చును. ఐతే ఆ ఆశ్రమము చాలా చిన్నది అవుట వలన అక్కడ మీరు ఆశ్రయము కోరినట్లైన మీరు కొంత వడిగా నడచి సూర్యాస్త సమయానికి ఒక జాము ముందు చేరినట్లయిన ఆయన తమచుట్టు దగ్గరగా ఆశ్రమ వాసులకు కలిసి మీరు ఇతిథ్యము ఇవ్వడానికి అవకాశము ఉంటుంది. నాగదంతి గారు ఒక్కరు మీకందరికి సౌకర్యాలను కలుగజేయలేక పోవచ్చును. కనుక మీరందరు

కొంచము త్వరగా నడిచి నేను చెప్పినట్లుగా సూర్యాస్తసమయానికి ఒక జాము ముందు అక్కడకు చేరగలరని వారిని సాగనంపినారు.

గుంపులోని వారంతా వశిష్ఠుని మాట ఆలకించి ప్రయాణము కొనసాగింపసాగినారు. మధ్యలో మధ్యాహ్నకాలంలో అడవిలో దొరికిన పండ్లను నడుస్తూనే సేవిస్తూ ఒకే వేగముతో నడక సాగించినారు. దారిలో ఒక గొల్లమంద ఈ ఋషుల గుంపును చూచి వివరాలు తెలుసుకొని ప్రతి ఒక్కరికి తమగోవులనుండి క్షీరము సమర్పించి వారికి నడవడానికి కొంత శక్తి కల్గేలా చేసినారు. బ్రాహ్మణ గుంపు అంత వడివడిగా నడుస్తూ సూర్యాస్తమయ్యే సమయానికి ఒక జాముముందు నాగదంతి వారి ఆశ్రమానికి చేరుకున్నారు. ఋషి నాగదంతి గారు వీరి గూర్చి వివరాలు అడిగి తెలుసుకొని వశిష్ఠుల వారు వీరికి తన ఆశ్రమములో విడిది చేయమని సలహా ఇచ్చినారు అని తెలుసుకొని ఋషి నాగదంతిగారు చాలా సంతోషించినారు. వశిష్ఠుల వారు చెప్పినట్లుగా చుట్టుప్రక్కల ఉన్న ఆశ్రమ వాసులను పిలిచి వీరికి సౌకర్యాలను సమ కూర్చడంలో సహాయపడమని విజ్ఞప్తి చేసినారు. ఇది మహర్షి వశిష్ఠుల వారి కోరిక, మార్గదర్శనము అని కూడా విన్నవించినారు. చుట్టు ప్రక్కలనున్న అందరు ఆశ్రమ వాసులు తమ తమ వంతు సహాయము చేయుటకు తమ తమ అంగీకారములు తెలిపినారు.

నాగదంతి ఋషివారితో ఆరోజు రాత్రి అందరు కొంచెము స్థిరపడిన తరువాత మీరు ఈ రోజుకు 8 యోజనాలు నడిచినారు. మీ శరీరాలు ఎంతో అలసి ఉండవచ్చును. కనుక మీరు ఇంకా ఒక రోజు ఇక్కడనే విశ్రమించి ఎల్లుండి బయలుదేరి ప్రయాగకు దగ్గరగా ఉన్న భరద్వాజ ముని ఆశ్రమములో బస చేయవచ్చును. అక్కడ మీకు అన్ని సౌకర్యాలు కలుగు చేయడానికి వీలు ఉంటుంది. రేపటి రోజు మీరందరు తమ



తమ విద్యా ప్రగల్భాలతో మా ఆశ్రమ వాసులందరికి ఇతోధికంగా కొంత విద్యను తెలుపడానికి ప్రయత్నము చేయండి. వీరందరికి మీ ద్వార కొంత నేర్చుకొనే అవకాశము దొరుకుతుంది. నేను రేపు ఉదయాన్నే నా శిష్యులలో ఒకరిని భరద్వాజముని ఆశ్రమానికి పంపి మీరాకను తెలియపరుస్తాను. అందువలన వారు మీకు తగిన సౌకర్యాలను కలుగ చేయడంలో ఆతురత పడవలసిన అవసరము లేదు. వారు మీ కొరకు తగిన ఏర్పాట్లు చేసి ఉంచుతారు. గుంపులో ఉన్నవారందరు రాత్రికి విశ్రమించి ఉదయాన్నే కాలకృత్యాలను తీర్చుకొని ఫలహారాదులను గ్రహించిన తరువాత ఒక చోట సమావేశము ఐనారు. ప్రతి ఒక్కరు ఒక్కరుగా తమకు తెలిసిన జ్ఞానమును ఇలా తెలుపసాగినారు. జ్ఞానము, భక్తి, వైరాగ్యము, మోక్షము అనేవి నాల్గు భౌతిక, మానసిక, ఆత్మ అవసరాలు ఇందులో మొదటి మూడు వ్యక్తి మానసిక స్థితికి సంబంధించినవి మరియు భౌతికానికి కూడ సంబంధించినవి చివరిది మోక్షము మాత్రము ఆత్మకు సంబంధించినది. ప్రతి వ్యక్తి మోక్షము కొరకు పాటు పడాలని ప్రయత్నిస్తాడు. మోక్షము పొందడానికి రకరకాల అనేక మార్గాలు ఉన్నాయి. అందులో కర్మమార్గము ఉత్తమైనదని చాలా మంది తలపోస్తారు. రాజయోగ మార్గము భక్తి మార్గము జ్ఞాన మార్గము వైరాగ్య మార్గము ఇవి తమను ప్రసుత్త పరిస్థితుల నుండి దూరముగా తీసుకొని వెళ్తాయని కొందరు నమ్ముతారు. కర్మమార్గమొక్కటే సరియైన మార్గమని తలుస్తారు. అది వేరుకాదు. భక్తి జ్ఞాన, వైరాగ్య మార్గాలు తమను ఈ వస్తు భౌతిక ప్రపంచము నుండి కొంత వరకైన దూరంగా ఉంచుతాయని చాలామంది విశ్వాసము. కర్మ ఎందుకు చేయాలి దుర్లభమైన మనిషి జన్మము ఎత్తినాము. ముందు మనము జన్మించిన ఈ భూతలము నందు, పుట్టినప్పటి నుండి ఇంత వరకు పెరిగినాము. మన పెరుగుదలకు మనము ఇలా

601. ఓం గ్రహారశ్రేష్ఠాయ నమః స్వాహా
602. ఓం గ్రహకేతవే నమః స్వాహా
603. ఓం గ్రహాశ్రయాయ నమః స్వాహా
604. ఓం గ్రంథకారాయ నమః స్వాహా
605. ఓం గ్రంథకారమాన్యాయా నమః స్వాహా
606. ఓం గ్రంథప్రసాదాకాయ నమః స్వాహా
607. ఓం గ్రంథశ్రమజ్ఞాయ నమః స్వాహా
608. ఓం గ్రంథారిగాయ నమః స్వాహా
609. ఓం గ్రంథభ్రహనివారకాయ నమః స్వాహా
610. ఓం గ్రంథప్రవణసద్యాంగా నమః స్వాహా
611. ఓం గ్రంథప్రణయ తత్పరాయ నమః స్వాహా
612. ఓం గీతాయ తత్పరాయ నమః స్వాహా
613. ఓం గీతాగుణాయ నమః స్వాహా
614. ఓం గీతకీర్తయే నమః స్వాహా
615. ఓం గీత విశారదాయ నమః స్వాహా
616. ఓం గీతస్ఫేతయే నమః స్వాహా
617. ఓం గీతప్రణయినే నమః స్వాహా
618. ఓం గీతచంచురాయ నమః స్వాహా
619. ఓం గతప్రసన్నాయ నమః స్వాహా
620. ఓం గీతాత్మనే నమః స్వాహా
621. ఓం గీతలోలాయ నమః స్వాహా
622. ఓం గీతస్పహాయే నమః స్వాహా
623. ఓం గీతాశ్రయాయ నమః స్వాహా
624. ఓం గీతామయాయ నమః స్వాహా
625. ఓం గీతత్వార్థకోవిదాయ నమః స్వాహా



626. ఓం గీతసంశయ ఛేత్రే నమః స్వాహా
627. ఓం గీతసంగీతశ్లాసనాయ నమః స్వాహా
628. ఓం గీతార్థజ్ఞాయ నమః స్వాహా
629. ఓం గీతతత్వాయ నమః స్వాహా
630. ఓం గీతతత్వాయ నమః స్వాహా
631. ఓం గీతాశ్రయాయ నమః స్వాహా
632. ఓం గీత సారాయ నమః స్వాహా
633. ఓం గీత కృతయే నమః స్వాహా
634. ఓం గీత విఘ్నవినాశయనాయ నమః స్వాహా
635. ఓం గీతాస్సక్తాయ నమః స్వాహా
636. ఓం గీతలీనాయ నమః స్వాహా
637. ఓం గీతవిగతసంజ్వరాయ నమః స్వాహా
638. ఓం గీతైకదృశే నమః స్వాహా
639. ఓం గీతభుతే నమః స్వాహా
640. ఓం గీతాక్రీతాయ నమః స్వాహా
641. ఓం గీతాలసాయ నమః స్వాహా
642. ఓం గీతవాద్యపరవే నమః స్వాహా
643. ఓం గీతప్రభవే నమః స్వాహా
644. ఓం గీతార్థతత్వవిదే నమః స్వాహా
645. ఓం గీతవివేకజ్ఞానాయ నమః స్వాహా
646. ఓం గీతప్రవణచేతనాయన నమః స్వాహా
647. ఓం గీతభియే నమః స్వాహా
648. ఓం గీతవిద్యేశాయ నమః స్వాహా
649. ఓం గీతసంసార బంధనాయ నమః స్వాహా
650. ఓం గతమాయయ నమః స్వాహా

651. ఓం గతత్రాసాయ నమః స్వాహా
652. ఓం గతదుఃఖాయ నమః స్వాహా
653. ఓం గత జ్వరాయ నమః స్వాహా
654. ఓం గతాసహృదయే నమః స్వాహా
655. ఓం గతజ్ఞానాయ నమః స్వాహా
656. ఓం గతదుశ్శశయాయ నమః స్వాహా
657. ఓం గతాయ నమః స్వాహా
658. ఓం గతార్థాయే నమః స్వాహా
659. ఓం గత సంకల్పాయ నమః స్వాహా
660. ఓం గతదుష్టవిచేష్టితాయ నమః స్వాహా
661. ఓం గతాహంకారసంచారాయ నమః స్వాహా
662. ఓం గతదర్పాయ నమః స్వాహా
663. ఓం గతాహితాయ నమః స్వాహా
664. ఓం గతవిద్యాయ నమః స్వాహా
665. ఓం గతభయాయ నమః స్వాహా
666. ఓం గతగతనివారకాయ నమః స్వాహా
667. ఓం గతవ్యధాయ నమః స్వాహా
668. ఓం గతాపాయా నమః స్వాహా
669. ఓం గతదోషాయ నమః స్వాహా
670. ఓం గతేఃపరాయ నమః స్వాహా
671. ఓం గత సర్వవికారాయ నమః స్వాహా
672. ఓం గరగర్జిత కూజరాయ నమః స్వాహా
673. ఓం గతకంపితభూప్రష్టాయ నమః స్వాహా
674. ఓం గతబుషే నమః స్వాహా
675. ఓం గతకల్మషాయ నమః స్వాహా



676. ఓం గతశైన్యాయ నమః స్వాహా
677. ఓం గతస్టైన్యాయ నమః స్వాహా
678. ఓం గతమానాయ నమః స్వాహా
679. ఓం గతశ్రమాయ నమః స్వాహా
680. ఓం గతక్రోధాయ నమః స్వాహా
681. ఓం గతగ్లానయే నమః స్వాహా
682. ఓం గతమ్లానయే నమః స్వాహా
683. ఓం గత భ్రమాయ నమః స్వాహా
684. ఓం గతాభావాయ నమః స్వాహా
685. ఓం గతాభవాయ నమః స్వాహా
686. ఓం గతతీత్వార్థసంశయాయ నమః స్వాహా
687. ఓం గయాసురశిరచ్ఛేత్రే నమః స్వాహా
688. ఓం గయాసురవరప్రదాయ నమః స్వాహా
689. ఓం గయావాసాయ నమః స్వాహా
690. ఓం గయానాథాయ నమః స్వాహా
691. ఓం గయావాసినస్రతాయ నమః స్వాహా
692. ఓం గయాతీర్థఫలాధ్యక్షాయ నమః స్వాహా
693. ఓం గయాయాత్రఫలప్రసాదాయ నమః స్వాహా
694. ఓం గయామయాయ నమః స్వాహా
695. ఓం గయాక్షేత్రాయ నమః స్వాహా
696. ఓం గయాక్షేత్రవివాసకృతే నమః స్వాహా
697. ఓం గయావాసిస్తుతాయ నమః స్వాహా
698. ఓం గాయత్మధూవ్రతలసక్తటా నమః స్వాహా
699. ఓం గాయాకాయ నమః స్వాహా
700. ఓం గాయకవరాయ నమః స్వాహా

701. ఓం గాయకేష్ఠఫల(ప్రదాయ నమః స్వాహా
702. ఓం గాయక(ప్రణయినే నమః స్వాహా
703. ఓం గా(త్రే నమః స్వాహా
704. ఓం గాయకాభయదాయకా నమః స్వాహా
705. ఓం గాయక(ప్రవణస్వాంత నమః స్వాహా
706. ఓం గాయక(ప్రథమాయ నమః స్వాహా
707. ఓం గాయకోద్గతితసం(ప్రీతా నమః స్వాహా
708. ఓం గాయకోత్కట విఘ్నఘ్నే నమః స్వాహా
709. ఓం గానగేయాయ నమః స్వాహా
710. ఓం గాయకేశాయ నమః స్వాహా
711. ఓం గాయక(ప్రియదాయకాయ నమః స్వాహా
712. ఓం గాయక(ప్రియదాయకాయ నమః స్వాహా
713. ఓం గాయకాధీన వి(గ్రహాయ నమః స్వాహా
714. ఓం గేయాయ నమః స్వాహా
715. ఓం గేయగుణాయ నమః స్వాహా
716. ఓం గేయచరితాయ నమః స్వాహా
717. ఓం గేయతత్త్వవిదే నమః స్వాహా
718. ఓం గాయక(త్రాసామ్నే నమః స్వాహా
719. ఓం (గ్రంథాయ నమః స్వాహా
720. ఓం (గ్రంథతత్త్వవివేచకాయ నమః స్వాహా
721. ఓం గాఢామరాగాయ నమః స్వాహా
722. ఓం గాఢాంగాయ నమః స్వాహా
723. ఓం గాఢగంగాజలోద్వహాయ నమః స్వాహా
724. ఓం గాఢావగాఢజలధయే నమః స్వాహా
725. ఓం గాఢ(ప్రజ్ఞాయ నమః స్వాహా



726. ఓం గాఢమయాయ నమః స్వాహా
727. ఓం గాఢ(ప్రత్యార్థి సైన్యాయ నమః స్వాహా
728. ఓం గాఢాను(గ్రహతీత్పరాయ నమః స్వాహా
729. ఓం గాఢాశ్లేషసాభిజ్ఞాయ నమః స్వాహా
730. ఓం గాఢనివృత్తిసాధకాయ నమః స్వాహా
731. ఓం గంగాధరేష్టవరదాయ నమః స్వాహా
732. ఓం గంగాధరభయపహాయ నమః స్వాహా
733. ఓం గంగాధర గురవే నమః స్వాహా
734. ఓం గంగాధరధ్యాన పరాయిణాయ నమః స్వాహా
735. ఓం గంగాధర సుతాయ నమః స్వాహా
736. ఓం గంగధర సుతాయ నమః స్వాహా
737. ఓం గతస్మయాయ నమః స్వాహా
738. ఓం గంగాధర(ప్రియాయ నమః స్వాహా
739. ఓం గంగాధరాయ నమః స్వాహా
740. ఓం గంగాంబుసుందరాయ నమః స్వాహా
741. ఓం గంగాజలరసస్వాదచతురాయ నమః స్వాహా
742. ఓం గంగానిరతాయ నమః స్వాహా
743. ఓం గంగాజల(ప్రణయవతే నమః స్వాహా
744. ఓం గంగాతీరవిహారాయ నమః స్వాహా
745. ఓం గంగా(ప్రియాయ నమః స్వాహా
746. ఓం గంగాజలావగహాన నమః స్వాహా
747. ఓం గంధమాదవ సంవాసాయ నమః స్వాహా
748. ఓం గంగమాధవకేధీకథతే నమః స్వాహా
749. ఓం గంగాంధానులిప్తసర్వారాయ నమః స్వాహా
750. ఓం గంగలుభ్యన్మభృ(వ్రతాయ నమః స్వాహా

751. ఓం గంధాయ నమః స్వాహా
752. ఓం గంధర్వరాజాయ నమః స్వాహా
753. ఓం గంధ్వప్రియకృతే నమః స్వాహా
754. ఓం గంధర్వవిద్యాతత్వజ్ఞాయ నమః స్వాహా
755. ఓం గంధర్వప్రీతి వర్ధనాయ నమః స్వాహా
756. ఓం గకురబీజనిలయాయి నమః స్వాహా
757. ఓం గంధకాయ నమః స్వాహా
758. ఓం గర్విగర్వేనుదే నమః స్వాహా
759. ఓం గంధర్వగణసంసేవ్యాయ నమః స్వాహా
760. ఓం గంధర్వవరనాయకాయ నమః స్వాహా
761. ఓం గంధర్వాయ నమః స్వాహా
762. ఓం గంధమాతంగాయ నమః స్వాహా
763. ఓం గంధర్వకులదైవతాయ నమః స్వాహా
764. ఓం గంధర్వసంశయచ్ఛేత్రే నమః స్వాహా
765. ఓం గంధర్వవరదప్రఘ్నే నమః స్వాహా
766. ఓం గంధర్వప్రవణస్వాంతాయ నమః స్వాహా
767. ఓం గంధర్వగుణసంస్తుతాయ నమః స్వాహా
768. ఓం గంధర్వద్భీతపాదాబ్జాయ నమః స్వాహా
769. ఓం గంధర్వభయహారకాయ నమః స్వాహా
770. ఓం గంధర్వప్రీతిపాలకాయ నమః స్వాహా
771. ఓం గంధర్వాభయదాయ నమః స్వాహా
772. ఓం గంధర్వగీతచరితాయ నమః స్వాహా
773. ఓం గంధర్వప్రణయోత్సుకాయ నమః స్వాహా
774. ఓం గంధర్వగానశ్రవణప్రణయినే నమః స్వాహా
775. ఓం గంధర్వభాజనాయ నమః స్వాహా



776. ఓం గంధర్వత్రాణసన్నద్ధాయ నమః స్వాహా
777. ఓం గంధర్వసమరక్షమాయ నమః స్వాహా
778. ఓం గంధర్వస్త్రీభిదారాధ్యాయ నమః స్వాహా
779. ఓం గానాయ నమః స్వాహా
780. ఓం గానపటవే నమః స్వాహా
781. ఓం గచ్ఛాయ నమః స్వాహా
782. ఓం గచ్ఛపతయే నమః స్వాహా
783. ఓం గచ్ఛనాయకాయ నమః స్వాహా
784. ఓం గుచ్ఛగర్వఘ్నే నమః స్వాహా
785. ఓం గచ్ఛరాజాయ నమః స్వాహా
786. ఓం గచ్ఛేశాయ నమః స్వాహా
787. ఓం గచ్ఛరాజ నమస్కృతాయ నమః స్వాహా
788. ఓం గచ్ఛప్రియాయ నమః స్వాహా
789. ఓం గచ్ఛగుర్వే నమః స్వాహా
790. ఓం గచ్ఛత్రాతే కృతోద్యమాయ నమః స్వాహా
791. ఓం గుచ్ఛప్రభవే నమః స్వాహా
792. ఓం గచ్ఛచరాయ నమః స్వాహా
793. ఓం గుచ్ఛప్రియకృతోద్యమాయ నమః స్వాహా
794. ఓం గచ్ఛతీత గుణాయ నమః స్వాహా
795. ఓం గచ్ఛమర్యాదప్రతిపాలకాయ నమః స్వాహా
796. ఓం గచ్ఛధర్త్రే నమః స్వాహా
797. ఓం గచ్ఛభర్త్రే నమః స్వాహా
798. ఓం గచ్ఛవంధ్యాయ నమః స్వాహా
799. ఓం గురోర్గురవే నమః స్వాహా
800. ఓం శృష్ణాయ నమః స్వాహా

801. ఓం గృత్సదుదయ నమః స్వాహా
802. ఓం గృత్సమదాభీష్టవరప్రదాయ నమః స్వాహా
803. ఓం గీర్వాణ గీత చరితాయ నమః స్వాహా
804. ఓం గీర్వాణగణసేవితాయ నమః స్వాహా
805. ఓం గీర్వాణవరదాత్రే నమః స్వాహా
806. ఓం గీర్వాణభయనాశకృతే నమః స్వాహా
807. ఓం గీర్వాణగణసంగీతాయ నమః స్వాహా
808. ఓం గీర్వాణరాతి సూదయ నమః స్వాహా
809. ఓం గీర్వాణధామ్నే నమః స్వాహా
810. ఓం గీర్వాగోస్త్రే నమః స్వాహా
811. ఓం గీర్వాణగర్వనుదే నమః స్వాహా
812. ఓం గీర్వాణార్థిహరాయ నమః స్వాహా
813. ఓం గీర్వాణవరదాయకాయ నమః స్వాహా
814. ఓం గీర్వాణశరణాయ నమః స్వాహా
815. ఓం గీతానామ్నే నమః స్వాహా
816. ఓం గీర్వాణ సుందరాయ నమః స్వాహా
817. ఓం గీర్వాణప్రాణదాయకాయ నమః స్వాహా
818. ఓం గంత్రే నమః స్వాహా
819. ఓం గీర్వాణానీకరక్షకాయ నమః స్వాహా
820. ఓం గుహేహపూరకాయ నమః స్వాహా
821. ఓం గంధమత్తాయ నమః స్వాహా
822. ఓం గీర్వాణ పుష్టిదాయకాయ నమః స్వాహా
823. ఓం గీర్వాణప్రయుతత్రాత్రే నమః స్వాహా
824. ఓం గీతగోత్రాయ నమః స్వాహా
825. ఓం గీతాహితాయ నమః స్వాహా



826. ఓం గీర్వాణ సేవితపదాయ నమః స్వాహా
827. ఓం గీర్వాణగ్రథితాయ నమః స్వాహా
828. ఓం గలతే నమః స్వాహా
829. ఓం గీర్వాణగోత్రవరాయ నమః స్వాహా
830. ఓం గీర్వాణబలదాయ నమః స్వాహా
831. ఓం గీర్వాణప్రియకర్త్రే నమః స్వాహా
832. ఓం గీర్వాణాగమసారవిదే నమః స్వాహా
833. ఓం గీర్వాణాగమసంపత్తయే నమః స్వాహా
834. ఓం గీర్వాణవ్యసినామఘ్నే నమః స్వాహా
835. ఓం గీర్వాణప్రణయాయ నమః స్వాహా
836. ఓం గీతగ్రహణోత్సుకమానసాయ నమః స్వాహా
837. ఓం గీర్వాణమిద సంహర్త్రే నమః స్వాహా
838. ఓం గీర్వాణ గణ పాలకాయ నమః స్వాహా
839. ఓం గ్రహాయ నమః స్వాహా
840. ఓం గ్రహపతయే నమః స్వాహా
841. ఓం గ్రాహాయ నమః స్వాహా
842. ఓం గ్రహపీడాప్రణాశనాయ నమః స్వాహా
843. ఓం గృహస్తుతాయ నమః స్వాహా
844. ఓం గ్రహాధ్యక్షాయ నమః స్వాహా
845. ఓం గ్రహేశాయ నమః స్వాహా
846. ఓం గ్రహదైవతాయ నమః స్వాహా
847. ఓం గ్రహకృతే నమః స్వాహా
848. ఓం గ్రహభర్త్రే నమః స్వాహా
849. ఓం గ్రహేశాయ నమః స్వాహా
850. ఓం గ్రహేశ్వరాయ నమః స్వాహా

851. ఓం గ్రహారాధ్యాయ నమః స్వాహా
852. ఓం గ్రహహర్త్రాత్రే నమః స్వాహా
853. ఓం గ్రహగోప్త్రే నమః స్వాహా
854. ఓం గ్రహోత్కటాయ నమః స్వాహా
855. ఓం గ్రహగీతగుణాయ నమః స్వాహా
856. ఓం గ్రంధప్రణోత్రే నమః స్వాహా
857. ఓం గ్రహవందితాయ నమః స్వాహా
858. ఓం గవినే నమః స్వాహా
859. ఓం గవీవ్వరాయ నమః స్వాహా
860. ఓం గర్వీణే నమః స్వాహా
861. ఓం గర్విద్దాయ నమః స్వాహా
862. ఓం గర్వగర్వఘ్నే నమః స్వాహా
863. ఓం గవాంప్రియాయ నమః స్వాహా
864. ఓం గవాంనాథాయ నమః స్వాహా
865. ఓం గవీశానాయ నమః స్వాహా
866. ఓం గవాంపతయే నమః స్వాహా
867. ఓం గవ్యప్రియాయ నమః స్వాహా
868. ఓం గవాంగోప్త్రై నమః స్వాహా
869. ఓం గవిసంపత్తిసాధకాయ నమః స్వాహా
870. ఓం గవిరక్షణన్నద్ధాయ నమః స్వాహా
871. ఓం గవిభయహరాయ నమః స్వాహా
872. ఓం గవిగర్వహరాయ నమః స్వాహా
873. ఓం గోదాయ నమః స్వాహా
874. ఓం గోప్రదాయ నమః స్వాహా
875. ఓం గోజయప్రదాయ నమః స్వాహా



876. ఓం గోజాయుతబలాయ నమః స్వాహా
877. ఓం గండగుంజన్మధృవ్రతాయ నమః స్వాహా
878. ఓం గండస్థలగలధ్యానమిలన్మత్రలిశుండితాయ నమః స్వాహా
879. ఓం గుడాయ నమః స్వాహా
880. ఓం గుండప్రియాయ నమః స్వాహా
881. ఓం గండగలధ్యానాయ నమః స్వాహా
882. ఓం గుడాశనాయ నమః స్వాహా
883. ఓం గుడాకేశాయ నమః స్వాహా
884. ఓం గుడాకేశాసహాయయ నమః స్వాహా
885. ఓం గుడలడ్డుభుజే నమః స్వాహా
886. ఓం గుడభజే నమః స్వాహా
887. ఓం గుడభుగ్గన్యాయ నమః స్వాహా
888. ఓం గుడకేశవరప్రదాయ నమః స్వాహా
889. ఓం గుడాకేశార్చితపాదాయ నమః స్వాహా
890. ఓం గుడాకేశాయసభాయ నమః స్వాహా
891. ఓం గనాధరార్చితవదాయ నమః స్వాహా
892. ఓం గదాధరార్చితవదాయ నమః స్వాహా
893. ఓం గదాయుధాయ నమః స్వాహా
894. ఓం గదాయుద్ధవిశారదాయ నమః స్వాహా
895. ఓం గదాపాణయే నమః స్వాహా
896. ఓం గదఘ్నే నమః స్వాహా
897. ఓం గదదర్పఘ్నే నమః స్వాహా
898. ఓం గదగర్వప్రణాశనాయ నమః స్వాహా
899. ఓం గణాగ్రస్తపరిత్రాత్రే నమః స్వాహా
900. ఓం గదాడంబరఖండకాయ నమః స్వాహా

901. ఓం గుహాయ నమః స్వాహా
902. ఓం గుహాగ్రాగాజయ నమః స్వాహా
903. ఓం గుప్తాయ నమః స్వాహా
904. ఓం గుహాశాయినే నమః స్వాహా
905. ఓం గుహాశయాయ నమః స్వాహా
906. ఓం గుహప్రితీకాయ నమః స్వాహా
907. ఓం గుడాయ నమః స్వాహా
908. ఓం గఢాగుల్ఫాయ నమః స్వాహా
909. ఓం గుణైకదృశే నమః స్వాహా
910. ఓం గిరే నమః స్వాహా
911. ఓం గీష్పతయే నమః స్వాహా
912. ఓం గిరీశాయ నమః స్వాహా
913. ఓం గీర్దేవీగీతసద్గుణాయ నమః స్వాహా
914. ఓం గీర్ధేవాయ నమః స్వాహా
915. ఓం గీఃప్రియాయ నమః స్వాహా
916. ఓం గీర్భువే నమః స్వాహా
917. ఓం గీరాత్మనే నమః స్వాహా
918. ఓం గీఃప్రియాకరాయ నమః స్వాహా
919. ఓం గీర్భుమయే నమః స్వాహా
920. ఓం గీరసంజ్ఞాయ నమః స్వాహా
921. ఓం గీః ప్రసన్నాయ నమః స్వాహా
922. ఓం గీరేశ్వరాయ నమః స్వాహా
923. ఓం గిరీశజాయ నమః స్వాహా
924. ఓం గిరిరాజర్చితపదాయ నమః స్వాహా
925. ఓం గిరిరాజసుఖావహాయ నమః స్వాహా



926. ఓం గిరిరాజనామస్కృతాయ నమః స్వాహా
927. ఓం గిరౌశాయినే నమః స్వాహా
928. ఓం గిరిరాజగుహావిజ్ఞాయ నమః స్వాహా
929. ఓం గిరిరాజాభయప్రదాయ నమః స్వాహా
930. ఓం గిరిరాజ జేష్ఠవరదాయ నమః స్వాహా
931. ఓం గిరిరాజప్రపాలకాయ నమః స్వాహా
932. ఓం గిరిరాజ సుతా సూనవేద నమః స్వాహా
933. ఓం గిరిరాజ జయప్రదాయే నమః స్వాహా
934. ఓం గిరివ్రజ వవస్థాయినే నమః స్వాహా
935. ఓం గిరివ్రజ చరాయ నమః స్వాహా
936. ఓం గర్గాయ నమః స్వాహా
937. ఓం గర్గప్రియాయ నమః స్వాహా
938. ఓం గర్గదేవాయ నమః స్వాహా
939. ఓం గర్గనమస్కృతాయ నమః స్వాహా
940. ఓం గర్గవరదాయ నమః స్వాహా
942. ఓం గర్గసంస్తుతాయ నమః స్వాహా
943. ఓం గర్గగీతప్రసన్నాత్మనే నమః స్వాహా
944. ఓం గర్గనందకరాయ నమః స్వాహా
945. ఓం గర్గశ్రీయాయ నమః స్వాహా
946. ఓం గర్గమానప్రదాయ నమః స్వాహా
947. ఓం గర్గరిభంజకాయ నమః స్వాహా
948. ఓం గర్గేపరిత్రాత్రే నమః స్వాహా
949. ఓం గర్గసిద్ధిప్రదాయకాయ నమః స్వాహా
950. ఓం గర్గగ్లాని హరాయ నమః స్వాహా
951. ఓం గర్గశ్రమనుదే నమః స్వాహా

952. ఓం గర్గసంగతాయ నమః స్వాహా
953. ఓం గర్గాచార్యయ నమః స్వాహా
954. ఓం గర్గఋషయే నమః స్వాహా
955. ఓం గర్గసన్మానభాజనాయ నమః స్వాహా
956. ఓం గంభీణయి నమః స్వాహా
957. ఓం గణితప్రజ్ఞాయ నమః స్వాహా
958. ఓం గణితాగమసారవిదే నమః స్వాహా
959. ఓం గణకాయ నమః స్వాహా
960. ఓం గణకశ్లాఘ్యాయె నమః స్వాహా
961. ఓం గణకప్రణయోత్సుకాయ నమః స్వాహా
962. ఓం గణకప్రవణస్వాంతాయ నమః స్వాహా
963. ఓం గణితాయ నమః స్వాహా
964. ఓం గణితాగయాయ నమః స్వాహా
965. ఓం గద్యాయ నమః స్వాహా
966. ఓం గద్యమయాయ నమః స్వాహా
967. ఓం గద్యపద్య విద్యావివేచకాయ నమః స్వాహా
968. ఓం గలలగ్నమహానాగాయ నమః స్వాహా
969. ఓం గలదర్చిషే నమః స్వాహా
970. ఓం గలన్మదాయ నమః స్వాహా
971. ఓం గలకుష్ఠివ్యథాహత్రే నమః స్వాహా
972. ఓం గలకుష్ఠిసుఖప్రదాయ నమః స్వాహా
973. ఓం గంభీరనాభయే నమః స్వాహా
974. ఓం గంభీరస్వరాయే నమః స్వాహా
975. ఓం గలభీరలోచనాయ నమః స్వాహా
976. ఓం గంభీరగుణసంపన్నాయ నమః స్వాహా



977. ఓం గంభీరగతీశోభనాయ నమః స్వాహా
978. ఓం గర్భప్రదాయ నమః స్వాహా
979. ఓం గర్భరూపాయ నమః స్వాహా
980. ఓం గర్భాపద్వినివారకాయ నమః స్వాహా
981. ఓం గర్భాగమన సంభూతయే నమః స్వాహా
982. ఓం గర్భదాయ నమః స్వాహా
983. ఓం గర్భసోకనుదే నమః స్వాహా
984. ఓం గర్భత్రాతే నమః స్వాహా
985. ఓం గర్భగోప్త్రై నమః స్వాహా
986. ఓం గర్భపుష్ఠికరాయ నమః స్వాహా
987. ఓం గర్భగౌరవసాధనాయ నమః స్వాహా
988. ఓం గర్భగర్వనుదే నమః స్వాహా
989. ఓం గరీయసే నమః స్వాహా
990. ఓం గర్వమదే నమః స్వాహా
991. ఓం గర్వమర్ధినే నమః స్వాహా
992. ఓం గరదమర్దకాయ నమః స్వాహా
993. ఓం గరసంతాపశమనాయ నమః స్వాహా
994. ఓం గురురాజ సుఖ ప్రదాయ నమః స్వాహా
995. ఓం గర్భాశ్రయాయ నమః స్వాహా
996. ఓం గర్భమయాయ నమః స్వాహా
997. ఓం గర్భామయ వివారకాయ నమః స్వాహా
998. ఓం గర్భాధారాయ నమః స్వాహా
999. ఓం గర్భదరాయ నమః స్వాహా
1000. ఓం గర్భసంతోషసాధకాయ నమః స్వాహా
1001. ఓం మహాపూర్ణగణపతయే నమః స్వాహా

ఈ విధముగా గణపతియాగములో సహస్రనామములలో సహస్ర మోదకములు సమర్పించినారు. అదే యాగశాలలో ముప్పది ఒక్క లక్షలసార్లు 'ఓం గణపతయే నమః' అను మహాజపము పరిసమాప్తి అయిన తరువాత పూర్ణాహుతికి ఉపక్రమించినారు. పూర్ణాహుతిలో గణపతి ఆహ్వానమంత్రములతో పాటు రకరకాల వస్తువులు పంచగవ్యములు, కొబ్బరికాయలు, ద్రాక్షపండ్లు, ఖర్జూరఫలములు, నూతన వస్త్రములు, నవధాన్యాలు సమర్పించి పూర్ణాహుతి పరమాప్తి చేసినారు. రాజగురువు గారు తరువాత అందరిని ఉద్దేశించి మరోమారు ఇలా చెప్పసాగినారు. మూడురోజులుగా అందరు శ్రద్ధాభక్తులతో ఏకాగ్రతతో ఈ యాగములో పాల్గొని దీనిని సమర్ధవంతముగా పూర్తిచేయడము జరిగినది. ఇక నాలుగవరోజు సాంస్కృతిక కార్యక్రమము ఉంటుంది. ఇందులో కవితాగోష్ఠి, నాటకములు, హరికథ, కాలక్షేపము, నృత్యములు, గాత్రసంగీతము, వాద్యసంగీతము మొదలగు కార్యక్రమములు ఉంటాయి. కవులు, పండితులు, కళాకారులు తమ తమ ప్రతిభ పాటవాలను ప్రదర్శించగలరు.

## ఆస్థానకవులుగా నియామకం

ఇక నాల్గవరోజు సభ మొదలుకాగానే రాజగురువు అందరిని ఉద్దేశించి ఇలా ప్రసంగించసాగినారు. మన ఆస్థానములో ఉన్న ఉద్దండ పండితులైన శాండిల్యుడు, పిప్పలాదుడు, పదార్థుడు, మొదలగు కవి పండితులున్నారు. మీరు చూపిన ప్రతిభ పాటవాలు వీరి ద్వార చేరవేయబడి గుర్తింపుపొందిన వారికి రాజుగారి ద్వారా తగిన బహుమతులు పొందే యోగ్యత కల్గుతుంది. కవి పండితులంతా తమ కవితలను తమవి మాత్రమే క్రొత్తవి వినిపించవలసి ఉంటుంది.

ముందుగా మహారాజుగారు సదస్సులకు ప్రజలకు ప్రజాప్రతినిధులకు, కవి పండితులకు ఆహ్వానము పలుకుతారు. వీరందరు సాదరంగా కరతాళ



ధ్వనులతో రాజుగారిని వారి కుటుంబ సభ్యులను ఆహ్వానించగలరు. అప్పుడు మరుత్తుమహారాజు అందరిని ఉద్దేశించి ఇలా చెప్పసాగారు. మీరందరు పాల్గొన్న విధముగా 3 రోజులుగా శ్రీ మహాగణపతి యాగములో వ్యయప్రయాసలకు ఓర్చుకొని దూరదూరము నుండి దేశవిదేశాల నుండి వచ్చిన అందరికి ఈ నాల్గవరోజు సభకు సాదరంగా ఆహ్వానిస్తున్నాము. మీరందరు నన్ను నాదేశాన్ని కృతార్థులుగా చేసినందుకు అందరికి ధన్యవాదములు. ఈ 3 రోజులలో ఏ విధమైన అసౌకర్యములు కలుగలేదని సాదరసత్కారములు తగిన విధముగా అందరికి అందినవని నేను భావిస్తున్నాను. దేశానికి దేశ ప్రజాసుభిక్షానికి నేను తలపెట్టిన యాగములో అందరు ఇతోధికంగా తమ సహాయ సహకారాలను అందించినట్లు నా రాజ్య ప్రజలను ఎంతో ఆనందింప చేసినారు. ఇక చివరగా ఈ రోజు సాంస్కృతిక కార్యక్రమములు అందుభాగముగా ముందుగా కవి సమ్మేళనముతోను సాయంత్రము నృత్యము. యక్షగానము, మొదలగు కార్యక్రమములు ఉంటాయి. అందరును తమతమ శ్రద్ధా భక్తులతో ఇందు ప్రేక్షకులుగా ఉండి కళాకారులను వారి సిబ్బందిని తగిన ప్రోత్సాహము అందించగలరని నా అభిలాష. తదుపరి కార్యక్రమము రాజగురువు గారు పర్యవేక్షిస్తారు. అంత రాజగురువుగారు భండనావిద్యుడనే నేను మరుత్తుమహారాజు రాజగురువుగా ఇక ఈ రోజు కార్యక్రమము మొదలు పెట్టుటకు మహారాజుగారి అనుమతి పొంది ముందుగా కవి సమ్మేళన కారక్రమము జరుగుతుందని మీకు విన్నవిస్తున్నాను. దీన్ని ఆస్థాన పండితులు కవులు అయిన శాండిల్యుడు, పిప్పిలాదుడు, పదార్జుడు కలిసి పర్యవేక్షిస్తారు. ముందుగా ఆస్థాన పండితులు కవులలో ఒకరైన శాండిల్యుడు గారు కార్యక్రమ వివరాలు తెలియజేస్తారు.

శాండిల్యుడుగారు ఇలా చెప్పసాగినారు. ముందుగా మరుత్తు మహరాజుగారికి నమస్సులు. తరువాత ఇందులో పాల్గొనదలచిన కవి

పండితులకు మరియు ప్రేక్షకులకు సాదర ఆహ్వానములు. ఈ కవి సమ్మేళనములో ఎక్కువ నిబంధనలు, సమస్యలు అంటు ఏమి ఉండవు. ఎవరైనను ఇందులో పాల్గొనవచ్చును. పాల్గొన దలచిన కవి పండితులంతా ఒక కవితను గాని సంభాషణగాని తమ స్వంతవి మాత్రమే వినిపించగలరు. అది తాము బాగా ఉన్నది అనుకున్నది మాత్రమే వినిపించవలసి ఉంటుంది. ఇతరులు వ్రాసినవి కాని ఇతరకవుల విరిచితమైనది కాని నిశిద్ధము. ఇది తమ స్వంతము మాత్రమే అయినది ఉండాలి. మొదటి సారి మాత్రమే వినిపించే విధముగా ఉండాలి. ఇదే నిబంధన. మాకు అందిన చిట్టా ప్రకారము పది మంది కవి పండితులు మాత్రమే తమ పేర్లను నమోదు చేసుకున్న ప్రకారము తమ కవిత్వము స్పష్టముగా చిన్నదిగా ఐదునిమిషాల వ్యవధిలో సమయము తీసుకునేదిగా ఉండాలి. అంతేగాని ఒక పెద్ద కావ్యముగా చాలా సమయమును తీసుకొనేదిగా ఉండకూడదు. ఇకమనము మరుత్తు మహారాజుగారి అనుమతితో కార్యక్రమము మొదలుపెడుదాము. ముందుగా కవి రాజేంద్ర భూషణములు గారు కవితను వినిపించగలరని మనవి.

**మహారాజు మరుత్తవర్యా మరి రారు తమలాంటి**
**ప్రభువుల మరి రాబోరు మీలాంటి రాజులు.**
**తమరు సర్వ పరాక్రమశాలులు, మరి మరచి పోలేని**
**ధాతృత్వ సంపన్నులు, ముదము గల్గు మిమ్ము చూసిన**
**మదము పోవుగా మిమ్ము గాంచిన, మమతల పల్లకి**
**నెక్కినారు తమ ప్రజలు, మందబుద్దులు లేరు**
**ఈ రాజ్యమందు సాహసవంతులకు పేరు**
**మీ రాజ్యము, మీలాంటి రాజు న భూతో న భవిష్యతి.**

రాజగురువు గారు ఈ కవిత చలా బాగుంది అన్నారు. ఈ కవిత వీరి స్వంతము కాదు. నేను వినిపిస్తాను. చూడండని శాండిల్యుడు గారు



అని వెంటనే కవితను వినిపించారు. తరువాత మరోకవి పప్పిలాదుడు మరోసారి వినిపించారు. కవిగారు మరేమిచెప్పలేక తమ ఆసనాన్ని అలంకరించినారు. తరువాత కవిపేరు విద్యావేత్త గారు తమ కవితను వినిపించారు.

**రాజుకు రాజ్యమే కాదు రాజ్యప్రజలే సంతతి**
**రాజుకు రాజ్యప్రజల క్షేమమే రాజ్యక్షేమము**
**వినాయకుడే రాజు సైన్యాధ్యక్షుడు**
**ఈ రాజ్యము శాంతి సౌఖ్యాలకు నిలయము**
**కావాలని సౌభాగ్యములు వర్ధిల్లాలి వర్ధిల్లాలి**
**రాజ్యప్రజ సంక్షేమము ఈ యాగము రాజావర్గానికి**
**అద్దము ప్రజల ప్రేమకు ప్రభువుల అనురాగము**
**అన్నిటికన్న శ్రేష్ఠము హిమాలాయాలంత**
**ఉన్నతము. ప్రభువుకు ప్రేమ ప్రజలు ప్రభు**
**ప్రజలు వేరు కారన్నదే ఈ యాగసందేశము**
**ముల్లోకాలలో మునుపెన్నడు జరుగలేదు**
**ఇలాంటి యాగము ప్రజలకై అమృతము**
**వర్షించే దేవతల కృపకలుగు**

అంత శాండిల్యుడు గారు కవిగారి ముగింపు వాక్యములు అద్భుథము. తరువాత సదానందకవిగారు తమ కవితను వినిపిస్తారు.

**రతనాలు, వరహాలు మాణిక్యాలు ధాన్యపు**
**రాసులు ధాత్రత్యపు హస్తాలు మరుత్తు**
**మహారాజు గారి స్వంతము. సర్వ స్వంతము**
**అనుమానాలు లేవు అరాచకాలు లేవు**
**అనుభవాలే అందరికి ఆనందదాయకాలు**

**ప్రజలు పామరులు కారు అమరులు**
**ప్రతికార వాంఛతో పొంగిపోరు**
**ఈ రాజ్యప్రజలు పరిమాణాలు పొందిన**
**ప్రేమలు, ప్రేమతో పలుకుతారు.**

అంతట శాడిల్యుడు గారు కవిగారి ప్రజల గుణగణాలను బాగా వర్ణించినారు. ఇక తరువాత కవి సుందరమూర్తిగారు తమ కవితను వినిపిస్తారు.

**చండశాసనము కలలోకూడ ఎరుగము**
**చంద్రుని, చల్లనదమే వీరికి తెలుసు**
**చందనమున ముంచినట్లు అనిపించు రాజపాలక**
**చంపకములు పరిచినట్టు ఈ పరిపాలన**
**చక్రవాకము తలపింపదు రాగము**
**తలపించును సౌమ్యచాత్రమువలే**
**ఎండవానలు రక్షించునట్లు ఉండు ఈ పరిపాలన**
**చాపలపై నడుచునట్లుండు ప్రజా జీవనము**
**జీవన సరళి చెరగని ముద్రవేయు**
**ఈ రాజ్యదర్శనము సందర్శనము.**

శాండిల్యుడు గారు కవి యొక్క కవిత్వాన్ని పొగడుతు కవిగారు 'చ' అక్షరముతో మొదలైన పదాలను ఉపయోగించి మంచి కవితను పొందుపరిచినారు. ఇది ఇంతకు ముందు విన్నకవితనే అని దాన్ని వల్లే వేసినారు. అంతట పిప్పిలాదుడు కూడా ఈ కవిత్వాన్ని విన్నానని అతను కూడా మళ్ళీ అని వినిపించినారు. శాండిల్యుడు గారు కవిగారిని తమ స్థానాన్ని అలంకరించ వలసినదిగా కోరగా కవి సుందరమూర్తి గారు బిత్తరపోయి చేసేది లేక తమస్థానాన్ని గ్రహించారు. తరువాత కవి ఉద్దండులు గారు తమ కవితను వినిపిస్తారు.



**మరుత్తు మహారాజా మాకవులందరి తరపున తమకు వందనాలు**
**తమను పొగడడంగా తమ సుగుణాలు వందలు వందలు**
**తమ రాజ్యాన్ని కబళించవచ్చి తమ సైన్యధాటికి ఆగలేక**
**పారిపోయిరి పిరికిపందలు, పందలు**
**రాజ్యములో వ్యవసాయము పుట్టించు పుట్టించ బడు**
**క్రొత్తవంగడాలు వంగడాలు**
**కనుక రాజ్యము సుభిక్షము కాదెందుకు కాదెందుకు**

శాండిల్యుడుగారు కవియొక్క ఆలోచనా సరళిని బాగా మెచ్చుకున్నారు. రాజ్యములో అన్నివ్యాపకాలకు తట్టి మరి కవితలో నింపినారు. తరువాత కవిగారైన కవి సేనాధిపతి గారు తమ కవితను వినిపిస్తారు.

**గణాధ్యక్షా గం గణపతి నమో నమో**
**మూషక వాహన నమో నమో**
**లంబోదర నమో నమో, మోదకప్రియ నమో నమో**
**పక్షివాహనుని సోదరా నమో నమో**
**సార్థకము చేసితివి ద్విజుడను నామము నమో నమో**
**సులభ మార్గాన్ని గ్రహించి భూప్రదక్షిణము చేసితివి నమో నమో**
**ముఖ్య నదులందు ముందే మునిగితివి నమో నమో**
**ప్రథమ పూజకు అర్హుడైతివి నమో నమో**
**అన్ని హంగులకన్న బుద్ధిబలము గొప్పదని చెప్పితివి**
**లోకానికి నమో నమో, నమో నమో నమో ॥**

అంత శాండిల్యుడు గారు గణపతిని గూర్చి విషయాలు అర్హతలు అన్ని తెలిసిన వాటిని ఒక కవిత్వ కోణములో ప్రతిపాదించి కవిగారు తమ ఔనత్యాన్ని చాటుకున్నారు. ఇలా కవులందరు తమ తమ కవితా పాటవాలను ప్రదర్శించిన తరువాత రాజాజ్ఞతో మహామంత్రి గారు

కవులందరిని పూల మాలలతో కృతకృత్యులు గావించినారు. శాలువతో సత్కరించి ప్రతి కవికి వంద వరహాలను బహుమతిగా ప్రధానము చేసినారు. తరువాత నృత్యగానాలతో యక్షగానములతో సాంస్కృతిక కార్యక్రమమును ముగించబడినది. అంత అతిథులు, ఆహ్వానితులు తమ తమ విడుదులకు చేరుకొని మరుసటిరోజు తమ తమ ప్రదేశాలకు బయలుదేరు కార్యక్రమములో నిమగ్నమైనారు.

పర్ణి సోదరులిద్దరు కొన్ని రోజులు రాజ్యములో ఉండదలచి రాజుగారి ధర్మసత్రములో బస చేసినారు. వీరిద్దరు రాజ్యములోని విశేషాలను తెలిసికొని రాజ్యములో ఉన్న ముఖ్యముగా రాజధానిలో ఉన్న విశేష ప్రదేశాల గూర్చి తెలిసి కొనసాగినారు. వారు గ్రహించినది ఏమిటంటే రాజుగారు ప్రతి పౌర్ణమికి రెండు రోజులు ముందుగా సభ నిర్వహిస్తారు. అందున ప్రజలు వారి సమస్యలను అడిగి రాజుగారు తెలిసుకుంటారు. వాటికై పరిష్కార మార్గాన్ని సూచిస్తారు. అలాగే ఎవరన్న తమ తమ ప్రతిభాపాటవాలను ప్రదర్శించవచ్చును. తమ తమ వ్యక్తిగత చాతుర్యాన్ని ప్రదర్శిచవచ్చును. రాజ్యములో రాజధానికి దగ్గరలో ఉన్న ఒక నదిపై చిన్నజల పాతము ఉన్నది. సూర్యుడు ఉన్నంత కాలము పగలు జలపాతముపై ఇంద్రధనస్సు కనిపిస్తూనే ఉంటుంది. సూర్యోదయము నుండి, సూర్యాస్తమయము వరకు ఇంద్రధనస్సు కనిపిస్తూనే ఉంటుంది. ఆ ఇంద్రధనస్సుకు దాని రంగులకు ఆకర్షించబడి రకరకాల పక్షులు దాని దగ్గరగా తిరుగుతు ఉంటాయి. ఇంద్రధనస్సు పక్షులు వాటి సౌందర్యము చూడడానికి ప్రజలకు జలపాతము వద్దకు చేరుతారు. ఒక్కొక్కసారి కొన్ని అపురూప మైన పక్షులు కూడ కనిపిస్తాయి.

ఒకరోజు అన్నదమ్ములు సుఖపర్ణి, ముఖపర్ణిలు ధర్మశాలలో ఉపనయనము మరియు యజ్ఞోపవీతము గూర్చి ధర్మశాలలో విడిది చేసిన వారికి ఇలా తెలుపసాగినారు. ఉపనయనము మరియు యజ్ఞోపవీతమును గూర్చి చాలామందికి తెలియదు. యజ్ఞోపవీతమును అన్ని కులాల వారు



ధరించవచ్చును. కాని ఉపనయనము కార్యక్రమములో చాతుర్వర్ణములకు కొంత భేదము ఉంటుంది. బ్రాహ్మణులు, శూద్రులు, తెలుపురంగు యజ్ఞోపవీతాన్ని, క్షత్రియులు ఎరుపు రంగు యజ్ఞోపవీతాన్ని, వైశ్యులు పసుపు రంగు యజ్ఞోపవీతాన్ని ధరించవలసి ఉంటుంది. యజ్ఞోపవీత దారాన్ని ఒక కన్నె మాత్రమే వడిగిన నూలుతో తయారు చేయవలసి ఉంటుంది. ఆధారపు పొడువు అరవైయైదు బెత్తెలంత ఉండవలెను. యజ్ఞోపవీతానికి మూడు నూలిపోగులు ఉంటాయి. ఒకొక్క పోగులో తొమ్మిది సన్నని దారాలు ఉంటాయి. మూడు దారాలలో మొత్తము ఇరువదిఏడు నూలు పోగులు ఉంటాయి. ఇవి మొత్తము ఇరువది ఏడు నక్షత్రములకు సంతకేతము. ఇక మూడు నూలి పోగులు సాత్విక రాజస, తామస గుణాలు మరియు బ్రహ్మ విష్ణువు, మహేశ్వరులకు ప్రతీకలు అంతే కాకుండా తల్లి ఋణము, తండ్రి ఋణము గురు ఋణాలకు ప్రతీకలు, జీవితములో ప్రతి ఒక్కరు ఎల్లప్పుడు వీరికి ఋణపడి ఉంటారు. అని అవి గుర్తు చేస్తుంటాయి. మల మూత్ర విసర్జన సమయములో యజ్ఞోపవీతమును ఎడమచెవి చుట్టు వేసుకొని విసర్జన కార్యక్రమము చేయవలసి ఉంటుంది. అందువలన విసర్జన అవయవాలకు సంబంధించిన నరాలు ఉత్తేజము పొంది మల మూత్ర విసర్జనలు సాఫీగా జరుగుతాయి. త్రికాలములో సంధ్యానందనము చేయ వలసి ఉంటుంది. సంధ్యావందనము అంటే సూర్య ఆరాధన, సృష్టిలో అన్ని ఐహిక సుఖాలకు మూలకర్త సూర్యుడు, సూర్యుని త్రికాలములలో ఆరాధించడము వలన శరీరములో శక్తి పెరుగుతుంది. ఇలా పెద్దలు, ఋషులు, మునులు, తెలిపినారు. యజ్ఞోపవీతము, ఎడమభుజము పై నుండి కుడి చెయ్యి క్రిందుగా వేసుకోవలసి ఉంటుంది. యజ్ఞోపవీతము ఆ వ్యక్తి బొడ్డు వరకు మాత్రమే పొడవు ఉండవలసి ఉంటుంది. ఇలా యజ్ఞోపవీత ప్రాముఖ్యతను తెలియచెప్పినారు. ఇలా అన్నదమ్ములిద్దరు రాజధర్మశాలలో విడది చేసిన యాత్రికులకు ఇతోధికమైన జ్ఞానాన్ని తెలియచేసినారు.

పూర్ణిమ రోజు రాజుగారి ఆస్థానమున జరిగే కార్యక్రమములకు హాజరు కాదలచి రాజాస్థానములో పూర్ణిమ రోజు సభలో తమ తమ ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించినవారికి ఇతోధికముగా సత్కారము జరుగుతుందని ఆ విధమైన సాంప్రదాయము ప్రతి పూర్ణిమ రోజు పాటిస్తున్నామని అన్ని వృత్తుల వారికి తగిన గౌరవము లభిస్తుంది. అందుకు గాను అన్ని వృత్తులవారు తమ చాతుర్యమును, చతురతను ప్రదర్శించడానికి కృతకృత్యులవుతారు. కాని కవి పండితులకు మాత్రము తగిన గౌరవము లభించడం లేదు. ఏ కవి గాని పండితుడు కాని తమ కవిత్వాన్ని, కవితను పాండిత్యాన్ని ప్రదర్శించగా శాండిల్యుడు పిప్పిలాదుడు ఇది వరకే ఈ రచనను ఇంతకుముందు ఎవరో వ్రాసినదని వారు దాన్ని తిరిగి చదివి ఏ విధమైన తప్పులు లేకుండా మరల వ్యక్తీకరిస్తారు. అందువలన కవి పండితులకు సభామర్యాదలు, గౌరవాలు, దొరికే వీలు కాకుండా అడ్డుపడుతున్నారు. సుఖపర్ణి, ముఖపర్ణి ఇద్దరును రాజ సభలో జరుగుతున్న ఈ తతంగాన్ని గమనించినారు. ఎంతటి కవి ఐన తమ తమ నూతన భావములను కవిత్వాన్ని తెలియచెప్పిన ఫలితము లేకుండా వీరిద్దరు అడ్డుకుంటున్నారు. వారిద్దరిని తప్పని అనలేము కదా అని సోదరులు అనుకున్నారు. ఎందుకనగా వీరిద్దరు తిరిగి అప్పచెప్పుచున్నారు. ఇలా రెండు మూడు నెలలు గమనించిన తరువాత సోదరులిద్దరు ఒక విషయాన్ని గ్రహించినారు. అదేమంటే వీరిద్దరు ఇంత త్వరగా ఎలా నూతన కవిత్వాన్ని కూడా తిరిగి అప్పచెప్పుతున్నారు. అలా ఆ పండితుల విషయమును ఆరాతీయడము మొదలు పెట్టినారు. కాని ఏ విధమైన సమాచారమును గ్రహించలేక పోయినారు. స్వయముగా వారితో పరిచయము చేసుకుందామని అనుకున్నారు. కాని అందువలన లాభము లేక పోగా నష్టము కల్గుతుందని సంకోచము చెందసాగారు. ఐన ఎందకైన మంచిదని ఒకసారి వారి దర్శనము చేసుకొన నిర్ణయించుకున్నారు.



ఒకరోజు మధ్యాహ్న సమయము దాటిన తరువాత శాండిల్యుని పిప్పిలాదుని దర్శించుకొనవలెనని నిర్ణయించుకున్నారు. వారి నివాసానికి చేరి అక్కడ ఉన్న భటునితో తాము పండితుల వారిని కలుసుకొనే ఆసక్తితో ఉన్నామని తెలియపరచారు. భటుడు కవి పండితుల ఆజ్ఞను తెలిపి వారిని లోనికి తీసుకొని వెళ్ళినారు. శాండిల్యుడు పిప్పిలాదుడు వీరిని పరిశీలించిన అనంతరము వారి రాకకు కారణము వివరించమనగా అన్నదమ్ములిద్దరు తాము కాశీ నుండి వచ్చినామని రెండు నెలలుగా రాజుగారు పౌర్ణిమ రోజున జరిపే సభలో పాల్గొంటున్నా మని పండితుల వారి పాండిత్యము జ్ఞాపకశక్తులు అమోఘములు, అనీర్వచనీయములు కనుక తమ దర్శనమును కోరి వచ్చినామని తెలిపినారు. అంత శాండిల్యుడు పిప్పిలాదుడు మేము మీకు ఏ విధమైన సహాయమ కావల్సినను చెప్పండి. మేము మీకు సహాయ పడదలచుకున్నాము. అనగా సోదరులు మేము తమ అంత జ్ఞానులము పండితులము కాక పోయినను మాకు తోచిన నాలుగు వాక్యాలను రాజుగారి ముందు మనవి చేయాలని అనుకుంటున్నాము. అనగా వారు సరేనని మీరు వచ్చేపౌర్ణిమ రోజున జరిగే సభకు రండి. వచ్చి తమ చాతుర్యాన్ని కవిత్వాన్ని ప్రదర్శించి రాజుగారి మన్ననపొంది తగు సత్కారమును పొందండి అని సోదరులకు సెలవిచ్చినారు.

అన్నదమ్ములిద్దరు బైటకు వచ్చి తరువాత తాము గ్రహించిన విషయాల గూర్చి ఆలోచించసాగారు. తరచితరచి ఆలోచించగా వారికి తట్టినది ఏమంటే శాండిల్యుడు ఏక సంతాగ్రహి అని పిప్పిలాదుడు ద్విసంతాగ్రహి అని గ్రహించినారు. అలా నమ్మకముగా అనుకున్నారు. అందుకు గాను తొందర పడకుండా మరొక నెలరోజులు వేచి యుండి, వారిద్దరిని గమనించాలని మరల పౌర్ణమిరోజు సభలోనికి వెళ్లినారు. యధావిధిగా సభ మొదలు కాగానే ముందుగా చిల్లుపడిన గిన్నెలకు

బిందెలకు మాట్లు వేసేవాడు రాజుగారి తమ విద్యుత్తను ప్రదర్శించడాన్ని విజ్ఞప్తి చేయగా రాజుగారి ఆజ్ఞతో రెండు గిన్నెలకు ఒక బిందెకు ముందు అందరిచే చిల్లులను పరీక్ష చేయించి చూపి తరువాత మాట్లు వేసి చూపగా అక్కడ ఉన్నవారు మాట్లు ఎక్కడ వేసినది కనుగొనలేక పోయినారు. అవి అంతగా సహజంగా బిందెలకు గిన్నెలకు కలసిపోయినవి. రాజుగారు వాని విద్యకు మెచ్చి తగిన పారితోషకము బహుమానము ఇప్పించినారు. తరువాత ఒక కవిగారు తన కవితను వినిపించగా శాండిల్యుడు, పిప్పిలాదుడు తమ సహజమైన పద్ధతిగా దాన్ని తిరిగి వినిపించి ఇది కవిగారి సొంత కవిత్వము కాదని తేల్చేసినారు. ఐనను రాజుగారు కవి గారికి దారి ఖర్చుల నిమిత్తము భత్యాల క్రింద కొంత సొమ్ము ఇమ్మని ప్రధాన మంత్రిని ఆదేశించినారు. సభ తరువాత అన్నదమ్ములిద్దరు ఆ కవిగారిని కలిసి తమకు ఎవరి కవితనో చదవవలసిన అవసరము ఏమి వచ్చినది అనగా దానికి కవిగారు ఇది తన స్వంత రచనని వీరు ఎలా తిరిగి వినిపించినారో అర్థము కాకుండా ఉన్నది. ఇద్దరు కూడా నా రచనను తిరిగి ఎలా అప్పజెప్పకల్గినారు అని ఆశ్చర్యముగా ఉంది అనగా చింత చేయకండి ఈరోజు రాజావారి ధర్మసత్రములో బస చేయండి ఉదయమునే తమ ఊరికి పోదరుకాని ఇందులో విచారించిన పర్యావసానములో మార్పు ఉండదు కదా! అని అతనిని స్వాంతన పరిచారు. దీనితో అన్నదమ్ములిద్దరి ఆలోచనకు మరింత బలము చేకూరినది. అన్నదమ్ములిద్దరు ధర్మశాలలో ఉన్న వారిని ఉద్దేశించి మనకు రెండు రోజుల తరువాత మరొక సారి సమావేశమై వచ్చే కార్తీక ఏకాదశి రోజున కవి పండితులైన శాండిల్యుడు మరియు పిప్పిలాదుడు వారికి సన్మానము చేద్దాము. దాని వివరాలు ఆరోజు మాట్లాడుకుందాము అనగా మిగిలిన వారంతా తమ అంగీకారమును తెలిపినారు.

ధర్మశాల వాసులందరు కార్తీక ఏకాదశిరోజున శాండిల్యుడు పిప్పిలాదుడితో ఇష్టాగోష్ఠిగా మాట్లాడి అనంతరము వారిని ఏదన్న ఒక



కవితను వినిపించమని కోరినారు. అంత శాండిల్యుడు మరుత్తు మహారాజును పొగుడుతు కొన్ని వాక్యాలను ఇలా వినిపించాడు.

**రాజన్న మహారాజన్న అందుకు మీరే పేరు మరుత్తు మహారాజుగారు**
**ప్రతాపములో ప్రణయములో పరాకాష్ఠ పొందినారు పలుమార్లు**
**తిరుగుబాటుకు అణఛివేసి సమర్థతను నెలకొల్పినారు**
**రాజకీయములో ప్రజల మేలు తెలిసికొని అదే రాజ్య శ్రేయస్సని విశ్వసించినారు**
**తిరుగులేదు వారి గుణగణాలకు**
**తిరుగులేదు వారి రాజ్యపాలనకు ప్రజాపాలనకు**

ఇలా శాండిల్యుడు వారు రాజుగారిని పొగిడినారు.

ఇలా శాండిల్యుడు వారు రాజును పొగడగా రకారము ఉన్న పదాల వాక్యాలను సుఖపర్ణి, ముఖపర్ణి వారి మాట పల్కులలోని తత్తర పాటును తొందరపాటును ప్ర అనే అక్షరము పల్కడములోను వారికి కల్గిన అసౌకర్యమును గమనించినారు.

నాలుగురోజుల తరువాత వచ్చు పౌర్ణమిరోజు ప్రజలందరు ఎంతో ఉత్సాహముగా భక్తిశ్రద్ధలతో జరుపుకుంటారు తమ తమ కుటుంబాలతో గడపదల్చుకుంటారు. అందువలన ఆ నెల రాజ్య సభ పూర్ణిమ రోజు కాకుండా మరుసటిరోజు జరుపబడుతుందని రాజు ఆస్థానము నుండి వార్త తెలుపబడినది. పౌర్ణమి మరుసటిరోజు రాజుగారు రాజస్యభ ఆరంభించగానే ఒక వడ్రంగి కర్రతో ఒకక్షణంలో ఒక వినాయక విగ్రహాన్ని అందరు చూస్తుండగా చెక్కి రాజుగారికి బహుమతిగా ఇచ్చినాడు. రాజుగారు చాలా సంతోషించి ఆ వండ్రంగిని తగు విధముగా సత్కరించినారు. తరువాత ఒకరిద్దరు కవులు తన కవిత్వాన్ని రచనలను వినిపించగా మామలుగానే శాండిల్యుడు తరువాత పిప్పిలాదుడు తిరిగి

వినిపించి ఇవి వీరి స్వంత కవితలు కావని నిర్ధారించినారు. కవులు తెల్లముఖాలు వేసుకొని చేసేది లేక వెనుతిరిగి తనకు స్థానాలను గ్రహించినారు. అంత సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులు మహారాజావారి అజ్ఞ పొంది తమ కవితను వినిపించసాగినారు.

**ప్రవర్గము లైన వజ్రదేహము కల్గిన**
**రణము నందు సర్రు సర్రున నడివడిగా**
**కరవాలము త్రిప్పితు రణము చేయగా**
**శత్రురాజు పరి పరి విధములుగా**
**పలాయనము చేయగా సుస్థిర రాజ్యము**
**ఏర్పరచి ప్రజారంజకముగా పరిపాలించే**
**మరుత్తు మహారాజు**

అంత శాండిల్యుడు ప్రణ ప్రజ అంటు ఒత్తు అక్షరాలను సరిగా పల్కలేక ముందుకు సాగలేక పోయినాడు తరువాత పిప్పిలాదుడు కడా రెండవ సారి వినలేదు కావున ఏమి చెప్పలేక పోయినాడు. ఇది సుఖపర్ణి, ముఖపర్ణిల స్వంత కవిత్వమని వారికి రాజ్య సభలో ఒప్పుకొనక తప్పలేదు. రాజు సోదరుల వివరాలు తెలిసికొని రాజా స్థానములో కవిత్వము చెప్త రాజకొలువులో గడుపుదామని తమ అభిప్రాయమని రాజా వారికి తెలియ పరచినారు. రాజావారు వారిని గమనించి ఇన్ని సంవత్సరాలుగా మీరు ఎవరు చేయలేని విధముగా మీ స్వంత కవిత్వము వినిపించి నాగుణాలను నా శౌర్య ప్రతాపములను పొగడడమే కాకుండా మా ఆస్థానకవులైన శాండిల్యుడు, పప్పిలాదుల మన్నలను కూడా పొందినారు. ఇది నాకు చాలా ఆనందముగా ఉన్నది. చాలా సంవత్సరాల తరువాత మీ స్వంత కవిత్వము విన్న ఆనందము కల్గినది. మహారాజావారు మహామంత్రిని ఉద్దేశించి వీరికి మన ఆస్థానములో తగిన స్థానాన్ని మరి ఆ స్థాన దిగ్గజములుగా వీరికి తగిన సౌకర్యాలు విడిది మొదలైనవి కల్పించమని



నా ఆజ్ఞ. అనగా అంత మహామంత్రిగారు తమ ఆజ్ఞ మేరకు జరుగుతుందని సభలో అందరి ముందు హామి ఇచ్చినారు. అంత పర్ణి సోదరులు రాజుకు తాము ఒక విన్నపము చేయదలచినామని అందుకు అంగీకారమే కాకుండా రాజావారు ప్రాణభిక్ష కూడా పెట్టాలని అలా అయితేనే తమ అభిప్రాయము తెలుపుతామని అన్నారు. అంత రాజావారు మీరు ఏమి ఏ విధమైన తప్పు చేసినారని ఇలా అంటున్నారు. మీరు కోరుతున్నారు కనుక అభయము ఇస్తున్నాను అన్నారు.

అంత సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులు తమ కవిత్వాన్ని మెచ్చుకొని తమరు మాకు ఇతోధిక స్థానము కల్పించినందుకు ముందు రాజావారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము. తరువాత మహారాజా మీ ఆస్థానములో ఇన్ని రోజులుగా జరుగుతున్న ఒక నాటకాన్ని మీకు విన్నవించదలచు కున్నాము. తమరి ఆస్థానములో ఉన్న శాండిల్యుడు పిప్పిలాదుడు ఉద్దండ పండితులు. కవులు తమ ఆస్థానములో ఇన్ని సంవత్సరాల నుండి కొలువుగా ఉన్నారు. స్వతఃగా వీరిద్దరు చాలా తెలివికలవారు. కాని గొప్ప భయస్థులు, ఎక్కడ తమ పదవి పోతుందోనని దేవరాజు ఇంద్రుని లాగ క్షణ క్షణము అనగా ప్రతిక్షణము రోజు వారికి ఒక గండముగా కనిపిస్తుండేది. తమ ఆస్థానములో పౌర్ణమిరోజు జరిగే కార్యక్రమములో ఎవరన్న కవి మంచి కవిత్వము వినిపించిన అది తమ పదవులకు ఉద్వాసన పల్కుతుందని వీరి భయము సంకోచము. ఐతే వీరిలో శాండిల్యుడు గారు ఏక సంతాగ్రహి తను విన్న విషయమును ఏదన్న ఒకసారి వింటే జీవితంలో ఇక మరచిపోరు. వెంటనే అవసరము ఉన్నప్పుడు కాని తిరిగి వినిపించగలరు. ఇక పిప్పిలాదులు గారు ద్విసంతాగ్రాహి ఏ విషయమైనను రెండు సార్లు విన్నచో ఆయన జ్ఞానపక శక్తి పొరలలో దాచబడి తిరిగి మరచిపోయే సమస్య ఉండదు. అందువలన వీరిద్దరు తోడుదొంగలవలె ఏ కవిగాని పండితుడు కాని కవిత్వాన్ని వినిపిస్తే వీరు అనగా శాండిల్యుడు గారు వెంటనే దానిని అప్పచెప్పి ఇది మీ స్వంత కవిత్వము కాదు అని

తేల్చేసేవారు. ఇక పిప్పిలాదులు గారు అప్పటికే రెండు సార్లు వినడం వలన ఆయన గారు కూడ ఆ కవిత్వాన్ని అప్పజెప్పి ఇది కవిగారి స్వంతము కాదని తేల్చేసేవారు. ఎందుకనగా వారు ద్విసంతా గ్రాహి. వీరు రెండుసార్లు వింటే కాని తిరిగి అప్పచెప్పుట వీలుకాదు. కవిగారు ఒకసారి శాండిల్యుడు గారు చెప్పడం వలన విని ఉండడం వలన పిప్పిబిలాదులు కూడా మరల తమకు వినిపించి తమ చాతుర్యాన్ని ప్రదర్శించేవారు. కవులు పండితులు చేసేది లేక తమది స్వంత కవిత్వమే అయినను మొదటిసారే వినిపించినను ఇక్కడ జరిగే తత్త్వంగాని, మోసాన్ని తెలుసుకోలేక తెల్లబోయిి తమ ఆసనాలను గ్రహించేవారు. ఇది ఇంతకాలముగా తమ సభలో జరుగుతున్న సంఘటనలకు వివరణ, ఇది ఎవరికి తెలియదు. తెలిసే ఆస్కారము కూడ లేదు మేము అన్నదమ్ములిద్దరము ఈ సభలో జరుగుతున్న వ్యవహారాన్ని మూడు నాల్గు నెలలుగా గమనిస్తున్నాము. కవిత్వము చెప్పిన తరువాత ఆస్థాన కవుల నిర్ణయాలు విన్న తరువాత కవుల ముఖాలలోని భావాలను గమనిస్తూ వస్తున్నాము. ఇందుకు సరైన సూచనలను అభిప్రాయమును గ్రహించడానికి కార్తీక ఏకాదశిరోజున ఇద్దరు కవులను మేముండే ధర్మశాలలో సన్మానము చేయ ఆహ్వానించినాము. అందుకు తగిన ఏర్పాట్లను చేసినాము. అందులో శాండిల్యులవారు రాజుగారిపై అంటే తమరిపై తమ కవిత్వమును వినిపించినారు. వారు వినిపించిన వాక్యాలలో జంట అక్షరాలను పలుకడంలో వారికి కల్గిన అసౌకార్యాన్ని మేము గమనించినాము. అందుకొరకై ఈ రోజు తమ గుణగణాలను పొగుడుతు చెప్పిన కవిత్వములో ముందుగా రెండు పదాల జంట అక్షరాలను ప్రయోగించినాము. తరువాత మధ్యలో కూడ జంట అక్షరాలను ప్రయోగించినాము. శాండిల్యుడు గారు మేము అనుకున్న విధముగానే మొదటి పదాన్ని తరువాత రెండవ పదాన్ని పలుకలేక పోయినారు. తరువాత పూర్తి కవిత్వాన్ని అప్పచెప్పలేక పోయినారు. శాండిల్యుడు గారు మరోసారి అంటే గాని పిప్పిలాదులు గారు తాను కూడ తిరిగి అప్పజెప్పలేక



పోయినారు. కనుక ఇద్దరు ఒకరితరువాత మరొకరు వెంటనే తిరిగి అప్పజెప్పలేక తికమకపడి, అవస్థలు పడి మాది స్వంత కవిత్వమని ఒప్పుకొనక తప్పలేదు. ఈ విధముగా మేము మీ కృపకు పాత్రులమైనాము. అయితే మేము కోరిన విధముగా అభయము ఇచ్చినారు. కనుక విషయము తెలిసిన తరువాత వీరిని శిక్షించకుండ ఉండడానికి ఈ అభయము కోరినాము. అనగా రాజావారు శాండిల్యులు, పిప్పిలాదులను ఉద్దేశించి వీరి చెప్పినది నిజమేనా మీ మనఃసాక్షిగా నిజము చెప్పండి. వారికి మీ గూర్చి అభయము ఇచ్చినాను కనుక మిమ్మల్ని ఏమి శిక్షించను. అంత శాండిల్యుడు, పప్పిలాదులు రాజావారితో సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులు చెప్పినది నిజమేనని మేము మా పదవులను కాపాడుకోవడానికి ఇలా ప్రవర్తించినాము. మమ్మల్ని క్షమించమని రాజాగారికి విన్నవించినారు. అంత రాజాగారు మహామాత్యులను ఉద్దేశించి వీరిద్దరు కొన్ని సంవత్సరాల నుండి ఇలా తప్పిదము చేస్తున్న మనము వివరములు తెలిసికొనలేక పోయినాము. వీరి విషయములో అభయము ఇచ్చినాను. కాని ఇన్ని సంత్సరాలుగా వీరు చేసిన ఈ అరాచకానికి, తప్పిదానికి కొంత శిక్ష వేయక తప్పదు కనుక వీరు అనుభవిస్తున్న సౌకర్యాలను, పదవిలోను పది శాతము తగ్గించేది. అని ఆజ్ఞాపించినారు.

ఈ విధముగా సుఖపర్ణి ముఖపర్ణిలిద్దరు రాజుగారి ఆస్థానములో స్థానము సంపాదించి ఉద్యోగములో ప్రవేశించినారు. రోజు ఉదయాన ప్రయాగలోని త్రివేణి సంగమములో స్నానాదులు ముగించుకొని త్రిమూర్తులను ఆరాధించ సాగినారు. అనతి కాలంలోనే వీరు కొంత తపోబలాన్ని పొంది రాజ్యములో పౌరులను మానసిక శారీరక సమ్యలకు తమ తపః శక్తితో ఇతోధికంగా స్వాంతన చేకూర్చసాగినారు. ప్రయాగలో త్రివేణి సంగమము ఉందని అంటారు గంగా, యమున, సరస్వతి మూడు నదుల కలయిక అంటారు. గంగా, యమున నదులు కలవడము ఎవరన్న

భౌతికముగా ఊడవచ్చును. సరస్వతి నది అంతర్వాహిని అని కనిపించదని అంటారు. కొందరు కాని కాశీ తరువాత జ్ఞానము, విజ్ఞానము విద్య, చదువు, పాండిత్యము ప్రయాగలోనే ఎక్కువగా ఉన్నది. గంగా, యమున, నదుల ప్రవాహము మనకు భౌతికముగా కనపడుతుంది సరస్వతి అంటే విద్యా ప్రజ్ఞ ఇది ఇక్కడ పండితులలో ప్రజలలో ఎక్కువగా ఉంటుంది. అదే సరస్వతి నది అని అదికూడ ప్రజలలో ప్రవాహములా ఉంటుందని విద్యాకనపడదు. కనుక అదే అంతర్యాహిని అని కనపడదని అదే త్రివేణి సంగమానికి నిజమైన నిర్వచనము అంటారు. ఇక్కడ రాజ్యము సుభిక్షముగా ఉన్నను రాజుగారికి ఉన్న ముగ్గురు సంతానములో ఇద్దరు కుమార్తెలు ఒక కుమారుడు ఉన్నారు. కుమారుడు కొంత కాలముగా అస్వస్థతగా ఉంటున్నాడు. వారి అస్వస్థతకు కారణము ఎవరికి అంతు బట్టడము లేదు. ఒక భవిష్యత్ వాణి పండితుడు మాత్రము ఈ రాజు రాజ్యము యొక్క సుభిక్షమునకు ఓర్వలేక రాజకుమారునిపై తాంత్రిక విద్యను ప్రయోగించినారు. దాని వలన దుష్ట దేవతలు ప్రభావము చేత రాజకుమారుడు స్వస్థతను కోల్పోతున్నాడని శారీరక ప్రయోజకుడు కాకున్నాడని ఆరోగ్యపరంగా బాగుండడము లేదని ఎందరో వైద్యులు రకరకాలుగా పరీక్షలు చేసి రకరకాల మందులను ఇచ్చినను లాభము కలగడము లేదు. ఎందరో తాంత్రికులు తమ తమ శక్తికొలది ప్రయత్నించినను వారి శక్తి ప్రయోగించిన తాంత్రిక శక్తి కన్న తక్కువ కావడం వలన ప్రయోజనము లాభము లేకుండా పోతున్నది. రాజకుమారునిపై ప్రయోగించిన తాంత్రిక శక్తి ఎంత బలవంతమైన దంటే రాజ్యములోని తాంత్రికులు దానికి విరుగుడు వేయలేక పోతున్నారు. రాకుమారుని శారీరక రుగ్మతను గూర్చి చాలా వరకు రహస్యముగా ఉంచబడినది. కనుక దాని విషయము అందరికి తెలియలేదు. మంత్రులు, సేనాధిపతి మరి కొందరు ఆంతరంగీకులకు మాత్రమే తెలుసును, వారు వారి, వారి ప్రయత్నాలు రహస్యముగానే చేయుచున్నారు. శత్రువులు,



శత్రురాజులు మామూలు ప్రజలు తెలిసికొంటే రాజ్యములో అస్థిరత కలిగే అవకాశము ఉంటుంది. కనుక ప్రతి విషయము గోప్యముగా ఉంచబడినది. రాజకుమారుని ఆరోగ్య పరిస్థితి విషయము రహస్యముగా ఉంచడానికి సర్వ ప్రయత్నములు జరుగుచున్నవి. ఇక రాజకన్యలు, ఇద్దరు వయస్సుకు వచ్చినారు. ఎంతో అందముగా శారీరకంగా తయారు అయినారు వారు కావ్య నాయకల అందానికి ఏమి తీసిపోరు. రాజకన్యలలో పెద్దామె పేరు కలువకుంత రెండవ ఆమె పేరు శశిరంజని వీరు అందములోనే కాకుండ తెలివి, తేటలలోను, చదువు పాండిత్యము లోను అందె వేసిన చెయ్యి అని పేరు పొందినారు.

సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులిద్దరు త్రివేణి సంగమములో స్నానమాచరించి జపతపాదులు, సంధ్యావందనాదులు పూర్తి చేసి ప్రయాగలోని మాధవేశ్వరిని దర్శనము చేసుకొని తమ తమ ఏకాగ్రతలో లీనమై అంతర్ముఖులై మనస్సు బ్రహ్మవిద్య అర్జనకై మునులు చెప్పిన విధముగా కుండలిని శక్తివైపు కేంద్రీకరించ సాగినారు. వారికి కొంత కాలములో వారి ఏకాగ్రత కేంద్రీకృతమై కొంతకాలములో కుండలిని శక్తివశమై వారి మనఃశక్తి వృద్ధి చెందినది. వారి భక్తి శక్తి కూడా వృద్ధి చెందినది. రోజు సాయంత్రము కొంతకాలము రాజధర్మశాలలో కూర్చుని సామాన్య జనాల బాధలు తొలగిపోవడానికి తమకు తోచిన విధముగా దైవశక్తిని వారిపై కేంద్రీకరించి వారి వారి సమస్యలను తీర్చే ప్రయత్నము చేసేవారు. రోజువారిగా కొంత సమయము ధ్యానములో నిమగ్నమై ఏకాగ్రత సిద్ధి పొందడానికి ప్రయత్నము చేస్తారు. ప్రయాగలోని దేవి మందిరములో శక్తిదేవి ఉపాసన చేస్తూనే విష్ణువు యొక్క కటాక్షమునకై ప్రయత్నము చేయసాగినారు. విష్ణుమూర్తి యొక్క స్వరూప స్వభావాలను తెలుసుకొనడానికి, కటాక్షము పొందడానికి ఎంతో నిష్ఠగా ప్రయత్నము చేయసాగారు.

**శాంతి స్వరూప, శాంతమూర్తి**
**కమల హస్తా, చక్రప్రయోగ పురుషార్థి**
**గదాఖడ్గ శోభిత హస్తా ఉభయ పద్మధర**
**గగన మండల వర్ణ గంభీరవదన**
**కౌస్తుభమణిధర, ముకుంద, మందరధర**
**పన్నగశయన పాలకడలి నివాస, దుగ్ధసముద్ర శ్రీనివాస**
**లక్ష్మి సేవలో ఆనందము పొంది సేదదీరుదేవా.**
**పాహిమామ్ పాహిమామ్, రక్షమామ్, రక్షమామ్**

## జయవిజయుల వైద్య సేవ

అని ఇలా పరిపరి విధములుగా, విష్ణుమూర్తిని సేవించి ఎంతో సంతృప్తికి అలవడినారు. ఏ విషయమైన ఎక్కువ కాలము రహస్యముగా ఉండదన్నట్లు కొన్ని రోజుల తరువాత రాకుమారుని రుగ్మతను గురించి అన్నదమ్ములిద్దరికి సమాచారము అందినది. వారు చాలా రోజులు, చాలాసార్లు ఆలోచించి, ఆలోచించి ఎలా రాజుగారి తమ ధార్మిక శక్తి ద్వారా రాకుమారుని రుగ్మతను బాగు చేయగలమని ఎలా తెలుపాలో తెలియ కొన్ని వారాలు గడిచి పోయినాయి. చివరకు వారు మహామంత్రిని కలిసి తాము రాకుమారుని రుగ్మతను గూర్చి విన్నామని రాకుమారుని ఆరోగ్యము బాగు చేయడానికి తమకు అవాకశము కల్పించమని సహాయము చేయమని అర్ధించినారు. అంత మంత్రి గారు ఇది చాలా జఠిలమైన సమస్య, రాజుగారికి మీ శక్తి సామర్థ్యాల గూర్చి తెలియజెప్పడము ఒక పెద్ద సమస్య. తరువాత వారిని ఒప్పించడము మరొక సమస్య. అయినను మీరు రెండు మూడు సంవత్సరాలుగా ఆస్థానములో ఉంటున్నారు కనుక మీ గూర్చి రాజుగారికి ప్రత్యేకముగా తెలిపే అవసరము లేదు. మీరు రోజువారిగా మామూలు ప్రజల



ఈతిబాధలను పోగెట్టే ప్రయత్నము చేస్తున్న సంగతి నాకు తెలుసు, ఇప్పటికే ఎందరో తాంత్రికులు యోగులు తమ తమ ప్రయత్నములు చేసి ఏమి సాధించలేక పోయినారు. అందువలన రాజుగారు ఎవరిని త్వరగా నమ్మే స్థితిని కోల్పోయారు. మీరు కవులని కవిత్వము బాగా చెప్పగలరని మాత్రమే రాజావారికి తెలుసు. ఇది కాక నేను విన్నది మీరు రోజు రాజ ధర్మశాలలో కూర్చుని చిన్న చిన్న చేతబడులు ఆరోగ్యసమస్యలు సామాజిక సమస్యలు ఉన్న వ్యక్తులకు సహాయము చేస్తున్నారని నాకు తెలుసు ఇది నా సహాయము కొందరు నాకు సమాచారము అందించినారు. కాని నేను విన్నది ఏమంటే మీరు సహాయము చేసిన వ్యక్తుల సమస్యలు చాలా చిన్నవి ఇంత జఠిలమైనవి కావు. మీ శక్తిని గూర్చి మీ సాధన గూర్చి నాకు అంతగా తెలియదు. ముందుగా మీరు రాజకుమారుని రుగ్మతను గూర్చి ఇంతకు ముందు ప్రయత్నము చేసిన వారి వివరాలు వారి ప్రయత్నము పద్ధతులు. వారి వారి అభిప్రాయములు గూర్చిన వివరాలు మన ఆస్థాన వైద్యుల వారి వద్ద ఉన్నాయి. ఒకటి రెండు రోజులలో నేను వారిని సంప్రదించి వారి వీలును బట్టి మీరు వారిని కలిసే విధముగా ఏర్పాటు చేస్తాను. మీరు మన ఆస్థాన వైద్యుల వారితో వివరాలు విని వారి దగ్గర ఉన్న వ్రాతప్రతులను చదివి వారితో చర్చించి మీరు చేయదలచుకొన్న విధి విధనాలను ఆలోచనలకు పద్ధతిని సవిస్తరముగా చర్చించండి. తరువాత వారం మీ సమర్థతపై నమ్మకము కల్గినట్లైన అందరము కలసి చర్చించి ఒక నిర్ణయానికి వచ్చి రాజావారికి మీ విషయము విన్నవించుకుందాము. రాజాగారు ఒప్పుకుంటే మీరు మీ ప్రయత్నము చేయవచ్చును. ఇంత వరకు నేను ప్రత్యక్షముగా ఈ సమస్యలో పాలు పంచుకోలేను. రాజవైద్యులవారే అంత చూసుకుంటారు. విషయము పూర్తిగా తెలుసు కాని నాకు నేనుగా ఇంతవరకు ఇందులో పాల్గొనలేదు. మీరు తప్ప ఇంత వరకు నన్ను ఎవరు సంప్రదించలేదు. అప్పుడు రాజవైద్యులవారు నాకు విషయములను వివరించేవారు. మొదటిసారిగా మీరు నన్ను

ఎందుకొరకు సహాయము కోరివచ్చినారో తెలియదు. మీకు విషయము తెలిసి ఉంటే రాజ వైద్యులువారే ఈ విషయాలను చూస్తున్నారు. మొదటి సారిగా మీరు మాత్రమే నన్ను కలసినా సహాయము అర్జించినారు. కనుక నేను ఇతోధిక సహాయమును చేయదలచుకున్నాను. దీనిలో రాజకుమారుని ఆరోగ్య సంబంధితమున ఉన్న విషయాలు ఏవన్న లాభముచేయదలచుకున్న విషయము సత్ఫలితము ఇచ్చిన ఈ రాజ్యానికి మేలు చేసిన వారై మొత్తము రాజ్యానికి రాజ్యప్రజలకు మేలు జరుగుతుంది. ఒకటి రెండు రోజులలో సమాచారము అందుతుంది. అని ప్రధాన అమాత్యులు సెలవిచ్చినారు. సోదరులిద్దరు తమ నివాసానికి వెళ్ళినారు. తరువాత రోజు లాగానే ధర్మశాలలో సాయంకాలం కూర్చొని రాజకుమారుని ఆరోగ్యము గూర్చి ఏమన్న సమాచారము మరి వివరాలు దొరకుతాయోనని ప్రయత్నము చేయసాగినారు. సమాచారము సేకరించడము ఒక కత్తిమీద సాము చేయడం లాంటిది అనిపించింది. ముందు రాకుమారుని గూర్చి రాజకుటుంబము గూర్చి వివరాలు జనాలకు తెలియవు. తరువాత అందులోను రాజకుమారుని ఆరోగ్యము గూర్చి వివరాలు అంతకన్న తెలియవు. ఇద్దరికి విషయము ఆగమ్య గోచరముగా కనిపించసాగినది. మరుసటి రోజు సాయంకాలము ధర్మశాలలో అన్నదమ్ములిద్దరు యధావిధిగా చేరగానే వారికి ఉదీషుడు అనే ఒక జ్యోతిష్యుని సమాచారము తెలిసినది. ఆయన జ్యోతిష్య శాస్త్రములో ఉద్దండ పండితులలో ఒకడు. ధర్మసత్రములో విడిది చేసేవాడని వారికి విషయము చెప్తే చాలు వివరాలు ఏమి అడుగకుండానే వారి సమస్యను దానికి తగిన విరుగుడు ఆ సమస్యకు కారణము సమస్య తీరే విధానము సవిస్తరముగా తెలుపుతాడని, వారిని కలవడము కొంత ఖర్చుతో కూడుకున్నదని అందువలన సామాన్యులు వారి సేవాభాగ్యములు పొందే అవకాశము తక్కువగా ఉంటుందని తెలిసింది. అన్నదమ్ములిద్దరు జ్యోతిష్య పండితులవారి గది వద్దకు చేరినారు. అక్కడ పండితుని సహాయకుని కలిసి తాము పండితులైన ఉదీషుల వారిని



కలవడానికి అభిలాష కల్గి ఉన్నామని తమకు అవకాశము కల్గించమని విన్నవించినారు. అన్నదమ్ములిద్దరు పది వరహాలు రుసుము చెల్లించి దర్శన వరుసలో కూర్చున్నారు. అన్నదమ్ములిద్దరు వారి వంతు రాగానే లోపలి గదిలో ఉన్న పండితుల వారిని కలవడానికి లోపలికి వెళ్ళినారు. వారి సహాయకుడు వీరిని కూర్చోమని వారికి ఆసనాలను చూపించినాడు. అన్నదమ్ములిద్దరు ఆసనాలను అలంకరించిన తరువాత కొన్ని క్షణాలకు పండితులవారు కనులు తెరిచి మీరు పది వరహాలు రుసము చెల్లించినారా అని అడగగా ఇచ్చినామని జవాబు ఇచ్చినారు. మీ పేర్లు తెలుపండి అనగా వారు తమ పేర్లను సుఖపర్ణి, ముఖపర్ణి అని తెలిపినారు. పండితుల వారు కొంతకాలముగా మీరు ఇద్దరు ఈ మహారాజా వారి ఆస్థానములో కొలువు చేయుచున్నారు. మీరు మరుత్తు మహారాజవారి మరియు ప్రజల మన్ననలు అందుకుంటున్నారు ఇప్పుడు రాజుగార్ని వేధిస్తున్న రాజకుమారుల వారి ఆరోగ్యము గూర్చి నన్ను అడిగి తెలిసికొనవలెనని మీరు వచ్చినారు. మీ ఉద్దేశ్యము చాలా మంచిది. రాజ్యానికి రాజుకు ప్రజలకు మేలు చేయతలచినారు. మీరు ధర్మశాలలో కొంత సమయము గడిపి సామాన్య ప్రజల కష్టనిష్ఠూరాలను తెలిసికొని ఈతోధిక సహాయము చేయుచున్నారు. ఇప్పుడు మీరు చేయ్యదలచుకున్న విషయము చాల జఠిలమైనది. ఇది మీరు సాధించాలనుకుంటే చాలా శ్రమపడవలసి వస్తుంది. నేను మీకు సరైన ఈతోధిక మార్గాన్ని తెలుపుతాను. మీరు ఆ మార్గాన్ని చాలా శ్రమించిన కావల్సినది సాధిచడం సాధ్యపడుతుంది. ఇందు ఏమన్న తేడా వస్తే మాత్రము ఫలితము ఉండబోదు. మీరు మాట్లాడుకుండ నేను చెప్పిన విషయాలన్ని జాగ్రత్తగా మననము చేసుకొని ఆ బాట వెంట పయనించవలసి ఉంటుంది.

రాజకుమారుని ప్రస్తుత ఆరోగ్య పరిస్థితికి ఆయన పూర్వజన్మ సుకృత ఫలితము. ఆ వివరాలలోకి నేను పోదలచుకొనలేదు. ఎవరైతే తాంత్రిక విద్యాప్రయోగము చేసినాడో ఆయన చాలా శక్తి సామర్థ్యములు కల

వ్యక్తి కాని అతను నిమిత్తమాత్రుడు మాత్రమే. ఆయన శక్తి సామర్థ్యాలకు తోడు రాజకుమారుడి పూర్వజన్మఫలము. ఇతర మాంత్రికుకులను, యాంత్రికులను, తాంత్రికులను దగ్గరకు రానీయకడం లేదు. అందువలన ఇంతవరకు ఎందరు ఎన్ని ప్రయత్నాలు చేసినను ఇవి ఫలించడం లేదు. నిష్ప్రయోజనములుగా మిగిలిపోతున్నాయి. రాజ కుమారుని ఆరోగ్య పరిస్థితి కొంచెము కూడ, పిసరంతైన మార్పు కలగడం లేదు. ఇప్పుడు మీరిద్దరు నా వద్దకు రావడము వలన అనగా నేను గ్రహించినది ఏమంటే ఆ పాపపంకిలము కొంతగా కడిగి పోతున్నది. దేనికన్న సమయము ప్రధానమైనది. ఎటువంటి వారలకు గాని వరాలు కాని, శాపాలు గాని, వాటికి సమయమ పాలన ఉంటుంది. రాకుమారుల వారు పోయిన జన్మలో చేసిన పాపఫలితము కొంత ఈ జన్మల వెంట తీసుకొని వచ్చినాడు. అది కొంత వయస్సు కాగానే కారణాత్మకంగా అదిపైకి వచ్చి ప్రస్తుత పరిస్థితి ఏర్పడినది. కాలము తన ప్రభావము చూపినందువలన ఇది వరకు ప్రయత్నములన్ని ఏమియు లాభము లేకుండా పోయినవి. ఇప్పుడు సమయము ఆ సన్నము కాబోతున్నది కాబట్టి మీకు ఈ ఆలోచన వచ్చినది. ఈ విషయము చూచాయిగా మీకు రెండు మూడు సంవత్సరములుగా తెలిసినను మీరు ఈ విషయములో అంతగా ఆత్రతముగా తలచుకొనలేదు. సమయము దగ్గదిర పడినది కాబట్టి మీరు కూడ కొంతకాలముగా సమాచారము సేకరించడము జరుగుతున్నది, మీరు ప్రధాన మంత్రిగారిని ఆస్థాన వైద్యుల వారిని కలవడము కూడ ఇందుకు నిదర్శనము, మీరిద్దరు ఇప్పటి వరకు మీ స్వార్థము కొరకు మీ స్వంత లాభము కొరకు ఏమి ప్రయత్నము చేయలేదు. కనుక అదే మీకు సహాయపడుతున్నది. మీకు తెలియనిది కాదు కాని ఏదన్న భక్తి మార్గము ద్వారా సాధించలేనిది ఏది లేదు. మీరిద్దరు వారం రోజులు త్రివేణి సంగమములో స్నానము చేసి అనంతరము సంధ్యా వందనాలు పూర్తి చేసి శక్తి పీఠములో నిమగ్నులై ధ్యానము చేస్తు ఏకాగ్రత సాధించడానికి సాధన చేయండి. వారం



పదిరోజులలో మీ సాధన ఎంత వరకు వచ్చిందనేది మీకు మాత్రం తెలుపుతుంది. తరువాత రోజు సాయంకాలము విష్ణుమూర్తి భక్తి సాధనలో నిమఘ్నుము కండి. వారం పది రోజుల తరువాత దేవి మరియు విష్ణుమూర్తి ఆజ్ఞప్రాప్తి కాగానే ప్రధానమంత్రి మరి ఆస్థానవైద్యుల వారిని కల్సి మరల మీ ప్రతిపాధనను తెలపండి రాజుగారి ఆజ్ఞ కొరకు వేచి యుండండి. ఒకటి రెండు రోజులలో మీకు మరుత్తు మహారాజుగారి నుండి ఆహ్వానము అందుతుంది. మీరు రాజావారిని కలిసి వచ్చిన పనిని విన్నవించండి తమ వంతు ప్రయత్నము చేస్తామని చెప్పండి. అయితే మీరు మీ భక్తి శక్తులను ధారపోసి మా వంతు ప్రయత్నము చేస్తామని మరల చెప్పండి, తాము చికిత్స చేస్తున్నప్పుడు రాజ కుటుంబ సభ్యులు ఎవరు దగ్గర ఉండకూడదని చెప్పండి. రాజ కుమారుడు తాంత్రిక శక్తులకు లోబడి ఉన్నాడు. కనుక కుటుంబ సభ్యులు ఉన్నట్లైతే వారికి కూడా తాంత్రిక శక్తులు శారీరకంగా హాని తలపెట్టవచ్చును. అందువలన నల్గురు శారీరక దారుఢ్యము కల సైనికులకు రాజకుమారుని ప్రక్క ఉండునట్లు చేయవలసినదిగా రాజుగారిని కోరండి. అంత అన్ని ఏర్పాట్లు అయిన తరువాత మీరు సంకల్పము చేసి మీ పేర్లు మీ దేశము రాజకుమారుని పేరు ఉచ్చరించుచు మీ భక్తిశక్తిని ఏకాగ్ర చిత్తముతో ధారపోయండి మీరు మీ శక్తిని ధారపోసినామని తలచిన తరువాత రాకుమారుని తీసుకొని వెళ్ళమని సేవకులకు చెప్పండి. తరువాత మహారాజా వారిని కలిసి మీ ప్రయత్నము మీరు చేసినారని ఇంకా రెండు సార్లు నెల నెల అంతరములో శక్తిని ధారపోయవలసి ఉంటుందని రాజుగారికి విన్నవించండి. తరువాత ఉద్దీష్ఠుల వారు మీరు చేసిన ఈ ప్రయత్నము ప్రస్తుతము రాకుమారుని భౌతిక స్థితిలో మార్పు తెలియక పోయినను మానసికముగా రాకుమారునిలో మార్పు వస్తుంది. అది రాకుమారునికి మాత్రమే తెలుస్తుందని గమనిస్తారు. మరి రెండు సార్లతో రాకుమారునికి పూర్తి స్పష్ఠత చేకూరుతుందని రాజావారికి విన్నవించండి.

తరువాత నెల రోజుల పాటు ఉదయము దేవిని సాయంత్రము విష్ణుమూర్తిని ఏకాగ్రతతతో మనస్సును నిలిపి ధ్యానము చేయండి. ఇంత వరకు మీరు సాధించుకొన్న శక్తిని రాజకుమారుడికి ధారపోయడం వలన మరల మీరు శక్తిని సమకూర్చుకొనవలసి ఉంటుంది. నెల రోజుల పాటు ఏకాంతముగా ఏకాగ్రతతో మనస్సును పరిపరి విధములు పోకుండ ధ్యానము చేసి శక్తిని సమకూర్చుకొనండి. ఈ నెల రోజుల సాధనలో మీకు ఎన్నో సార్లు అడ్డంకులు ఏకాగ్రత్త క్షీణించడము మనస్సు నిలువక పోవడము ధ్యానములో భంగము కలగడం కావడానికి అవకాశాలు ఉన్నాయి. వాటిని మీరు అధిగమించి సాధన చేయవలసి ఉంటుంది. ఇది వరకు మీరు సాధన చేసినప్పుడు నిష్పక్ష పాతముగా ఏ కోరిక మరి గురి లేకుండా సాధారణ సాధన చేసేవారు. అందువలన మీకు ఏ విధమైన అడ్డంకులు కాని పొరబాట్లు కాని కలిగేవి కావు. ఇప్పుడు అలా కాకుండా మీరు ఒక గురితో లక్ష్యముతో ధ్యాన సాధన చేస్తారు కనుక ఈ విధముగా ధ్యానము చేయడము వలన మనస్సు చలించడము సామాన్యము. మీరు ఏది ఏమైనను మీ ఏకాగ్రత్తకు భంగము కాకుండా మనస్సు చలించకుండ సాధన చేయవలసి ఉంటుంది.. మీరు మీ సర్వశక్తులను మనస్సును క్రోడీకరించి ధ్యానము చేయవలసి ఉంటుంది. నెల రోజులలో ఒక్కరోజు కూడ విడువ కుండ ధ్యానము చేయడం వలన మాతా శ్రీ మహావిష్ణువు ఆజ్ఞ దొరుకుతుంది. అది దొరికిన తరువాత మీరు సంపాదించిన ఈ శక్తితో మరల మీరు రాజకుమారుని మీ శక్తిని ఇది వరకులాగానే సంకల్పము చేసి మీ శక్తిని ఏకాగ్రత్తతో ధారపోయండి. ఈ సారి పళ్ళెములో నీళ్ళు వదలడమే కాకుండా మంత్రించిన నీళ్ళు రాజకుమారునిపై మంత్రజలమును చల్లండి. మంత్రజలము రాజకుమారుని పై పడిన తరువాత త్వరలో అనగా ఒకటి రెండు రోజులలో కొంత భౌతికమైన మార్పును రాజకుటుంబీకులు గమనించి మీకు తెలియపరుస్తారు. మీరు మీ ప్రయత్నము కొంత ఫలితాన్ని ఇస్తుందని గ్రహించవచ్చును. తరువాత



మీరు ముందులాగానే నెల రోజుల పాటు ఏకాగ్రతతో ధ్యానము అమ్మవారిపై నిశ్చల భక్తి ఉంచి సాయంకాలము శ్రీ మహావిష్ణువుపై ధ్యానము దృష్టి కేంద్రీకరించి వారిపై నిశ్చల భక్తి ఉంచి క్రిందటి సారి కన్న కొంత ఎక్కువ సమయము అమ్మవారి సమీపములో తరువాత సాయంకాలము ఒక జాముూరాత్రి వరకు శ్రీ మహావిష్ణువుపై ధ్యానముతో నిమగ్నమవ్వండి. విష్ణుమూర్తిని ఆకార నిరంకార గుణాలను స్తుతిస్తు కాలము గడపండి. శ్రీ మహా విష్ణువు మీ హధయములో అంగాంగములో ఉనప్పట్లుగా ఊహించి గమనించి ఆరాధించండి. మీరు వ్రాసిన విష్ణుమూర్తి పద్యాన్ని పలుసార్లు జపించండి ఇలా కఠోరంగా సాధన చేసిన మూలాన్న మాత మరియు శ్రీ మహావిష్ణువు మీ సాధన పరిపక్వతను తెలియపరుస్తారు. క్రిందటి విధముగానే రాజావారికి సమాచారము అందించి ఉదయాన్నే మీధ్యాన స్నానాదులు ముగించుకొని రాజకుమారుని వద్దకు పోయి రాజకుమారుని ఎదురుగా కూర్చుని సంకల్పము చేసి మాతను శ్రీ మహావిష్ణువును ప్రార్తించి తరువాత రాజకుమారుని పూర్వ జన్మ పాసాన్ని నాశనము చేయమని మాతను శ్రీ మహావిష్ణువును మరి తాంత్రిక దేవిని కూడా ప్రార్థించి తాంత్రికదేవితో రాజకుమారుని ఇంతకాలము అంటి పెట్టుకొని ఉండినందునను, ఇప్పుడు సమయము ఆసన్నమైనందునను చెడు మరియు ఋణశక్తులను రాకుమారుని నుండి దూరము చేసి ఆ స్థానములో తనలో ఉండే మంచి శక్తులను ప్రసాదించమని వేడుకొని మీ శక్తులను క్రోడీకరించి మీరు సాధన వలన సాధించిన శక్తిని గ్రహించి రాకుమారునికి స్వస్థత చేకూర్చమని తద్వార రాజ్యానికి రాజకుటుంబానికి, రాజ్య ప్రజలకు మేలు చేయడము అవుతుందని అందుకు అనుగ్రహించమని వేడుకొనండి, సంకల్పము ద్వారా విడిచిన నీరు చేతులలో తీసుకొని ఏకాగ్రతగా ఆ నీటిపై దృష్టి సారించి రాకుమారునిపై మంత్రజలము చల్లండి, మంత్రజలము ప్రభావముతో రాజకుమారునిలో ఒకటి రెండు రోజులలో పూర్తి మార్పు జరిగి

శారీరకముగా, భౌతికముగా, స్వస్థత చేకూరుతుంది, ఇక ఆజ్ఞ తీసుకోండి. ఇదే విధముగా 3వ సారి చేయడం వలన అరకొర మిగిలిన చెడు గుణాలు పూర్తిగా దూరమై వందశాతము స్వస్థత చేకూరుతుంది. ఇక ఆజ్ఞ తీసుకోండి, అని వారిని వారు చేయవలసిన అనుసరించవలసిన, విధానాన్ని సవిస్తరముగా వివరించినారు. అన్నదమ్ములిద్దరు తమ నివాసానికి పోయి మరుసటి రోజు నుండే అనుసరించవలసిన కార్యక్రమముల గూర్చి మరొకసారి పునరుశ్చరణ చేసినారు.

మరుసటి రోజు ఉదయము కాలకృత్యములు తీర్చుకొని త్రివేణి సంగమములో స్నానమాచరించి సూర్యునికి అర్ఘ్యము ఇచ్చి అమ్మవారిని ఆరాధించి ప్రధానామాత్యుని కలువడానికి వెళ్ళి తమ రాకను వారికి తెలియపరచమని సేవకునికి విన్నవించారు. కొద్ది కాలానికి ప్రధానా మాత్యులు గారు విచ్చేసి వీరిని గమనించి నేను ఇప్పుడే ఆస్థాన వైద్యుల వారికి కబురు చేసినాను. రాజకుమారుని ఆరోగ్యానికి సంబంధించిన వివరాలు కూడా తీసుకొని రమ్మని చెప్పి ఒక సేనకుని ఆపనికి పురమాయించినాను. నాకు కొన్ని రాచకార్యములు ఉన్నాయని నేను వాటిని చూడవలసి ఉన్నది. మీరు వేచి ఉండండి అని లోపలికి వెళ్ళినారు. ఆ కొద్ది సమయములో సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులిద్దరు సమయము వృధా చేయకుండా శ్రీ మహావిష్ణువు గూర్చి ధ్యానము మొదలు పెట్టినారు. కొద్ది సమయములోనే రాజవైద్యుల వారు వచ్చినారు. అన్నదమ్ములిద్దరు వారికి నమస్కారములు ఆచరించిన తరువాత వైద్యులవారు, అన్నదమ్ములకు రాజకుమారుని రుగ్మతను గూర్చి ఇంత వరకు జరిగిన చికిత్స వివరాలు వీరికి అందజేసినారు. అందులో ఎవరెవరు ఏఏ విధములుగా రాజకుమారుని వైద్య పరంగాను, మంత్రపరంగాను, తాంత్రిక పరంగాను ఏఏ విధమైన చికిత్స నిర్వహించినారు, వాటి వివరాలు పొందుపరచబడినాయి. వాటి ఫలితాలు కూడా వ్రాయబడినాయి. కాని వాటి వలన ఆశించిన ఫలితము లాభము చేకూర్చబడలేదని, రాకుమారుని



ఆరోగ్య పరిస్థితి కొంచెము కూడా మెరుగు పడలేదని వ్రాయబడినది. అంతలో ప్రధానమంత్రి గారు విచ్చేసి చర్చలో పాల్గొంటూ వారిని వివరాలు అడగసాగినారు. అంత పర్ణి సోదరులు తాము వైద్యులము కామని తాంత్రికులము మరియు మాంత్రికులము కాదని, తాము దేవి ఉపాసన మరియు శ్రీ మహావిష్ణువు ఉపాసన చేస్తామని తమ ఉపాసనలో దేవీ మరియు శ్రీ మహావిష్ణువునుండి రాజకుమారుని చికిత్స చేయమని, భక్తి మార్గములో సాధించిన శక్తిని ధారపోసి దాని ద్వారా మాత్రమే చికిత్స చేయమని తమకు తమ సాధనలో తెలిసినదని తెలిపినారు. అందుకుగాను తమను మహారాజుగారి వద్దకు తీసుకొని వెళ్ళిన వారికి మీ ముందే వివరాలు తెలియజేస్తామని అన్నారు. అందుకు ప్రధానమంత్రి గారు తాను మహారాజవారిని కలసి తమ ప్రతిపాదనను విన్నవించి రాజాజ్ఞను సంపాదించి ఒకటి రెండు రోజులలో మీకు సమాచారము అందిస్తామని అన్నారు. అంత అన్నదమ్ములిద్దరు ప్రధానమంత్రిగారి వద్ద రాజవైద్యుని వద్ద ఆజ్ఞ తీసుకొని తమ నివాసానికి చేరుకున్నారు. ఆ సాయంకాలము యధావిధిగా శ్రీ మహావిష్ణువు ధ్యానములో కూర్చున్నారు. రోజులాగా కొంత కాలము ధ్యానము చేసి సాయంకాలము కావడము వలన ధ్యానము తరువాత రోజులాగే రాజావారి ధర్మ సత్రమునకు వెళ్ళి ప్రజల ఈతిబాధలు తీర్చే ప్రయత్నము చేయసాగారు.

రెండు రోజుల అనంతరము మహారాజావారిని కలవడానికి రాజమందిరానికి రమ్మని ప్రధానమంత్రి ద్వార సమాచారము అందుకున్న సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులిద్దరు రాజమందిరానికి చేరుకున్నారు. రాజు గారు వారిని వారి రాకను గమనించారు. ప్రధానమంత్రి గారు వీరిని ఆహ్వానించి వారి వారి ఆసనాలపై కూర్చుండ బెట్టి ఇలా చెప్పసాగినారు. నేను మహారాజు గారికి తమ గూర్చి చెప్పి మీరు రాకుమారునికి చేయబోయే చికిత్స గూర్చి ఆ విధానము గూర్చి విన్నవించినాను. మీరు ఇక రాజావారితో వివరంగా మాట్లాడగలరు. అంత పర్ణి సోదరులిద్దరు

ముందుగా నమస్కారము చేసి మా ఇద్దరి ప్రణామాలు స్వీకరించగలరు. మేము తమ కొలువులో ఉంటు సంవత్సరముగా రాజకుమారుని అస్వస్థను గూర్చి విని కొన్ని వివరాలు సేకరించినాము. వారి అనారోగ్యానికి కారణాలను కూడా తెలిసికొనే ప్రయత్నము చేసినాము. మాకు మేము ఇద్దరము శ్రీ మహాదేవి మరియు శ్రీ మహావిష్ణువు ఉపాసన చేస్తాము మా ఉపాసనలో భాగముగా మేము రోజు సాయంకాలము రాజావారి ధర్మశాలలో ప్రజల ఈతిబాధలు విని దేవి మరియు మహావిష్ణువు ఆజ్ఞతో వారికి పరిష్కార మార్గాలు సూచిస్తు వారికి లాభము చేకూరుస్తున్నాము. ఈ సంగతి మన మహామంత్రి గారికి కూడ తెలుసు. మేము మా ధ్యానములో రాకుమారుని ఆరోగ్య పరిస్థితిని గూర్చి తెలుపగా మీకు సరైన మార్గము తెలుస్తుందని వినిపించింది. తరువాత పద్ధతి ప్రకారముగా ఎలా అడుగిడున రాజకుమారునికి ఎలా చికిత్స చేయాలో శక్తిని ఎలా ప్రసాదించాలో అవగతమైనది. దానికి రెండు మూడు నెలల సమయము పడ్తుందని చికిత్స సమయములో రాజ కుటంబానికి సంబంధించిన సభ్యులెవరు దగ్గరగా ఉండకూడదని, ఒక నల్గురు దేహ దారుఢ్యము కల్గిన సేవకులు, సహాయకులుగా అవసరము ఉంటుందని ఈ చికిత్సకు సగము జాము సమయము పడ్తుందని తరువాత రాజ కుటుంబ సభ్యులు రాకుమారుని తీసుకొని వెళ్ళ వచ్చని మొదటిసారి చికిత్స విధానము ప్రయత్నము పూర్తయిన తరువాత రాకుమారునిలో మానసిక పరివర్తనము మొదలు అవుతుందని భౌతికముగా అది కనిపించదని రెండవసారి చికిత్సలో భాగముగా శక్తి ప్రధానము తరువాత కొంత భౌతికముగా మార్పు చూడ వచ్చని మూడవసారి శక్తి ప్రధానము తరువాత పూర్తి స్వస్థత భౌతికముగా, శారీరకముగా మానసికంగా చేకూరుతుందని వివరించినారు. రాజావారు అందుకు సమ్మతించగా ఏ విధమైన మందులు మాత్రలు ఉపయోగించరా అనగా అన్నదమ్ములిద్దరు రాజకుమారుల వారు



శారీరకంగా స్వస్తతగానే ఉన్నారు. అందుకు మన రాజ్యవైద్యుల వారే సాక్షులు, మానసికముగా ఒత్తిడి వలన ఇలా అయినారు. కనుక ఏ విధమైన మూలిక వైద్యము అవసరము లేదు.

తమరు మా ఈ శక్తి ప్రయోగమునకు అనుమతించగలరని మనవి. అంత రాజుగారు వారిని కూర్చోమని ప్రధానమంత్రితో లోపలికి పోయి ప్రధానమంత్రితో వీరు ఏ విధమైన మందులు గాని పై పూత మందులు గాని ఇవ్వడం లేదు. రాజకుమారుని తాకనంటున్నారు కనుక వీరికి అవకాశము ఇవ్వడములో నష్టము ఏమి లేదు అనిపిస్తుంది. ఇన్ని సంవత్సరాలుగా రకరకాల చికిత్సలు తాంత్రిక, మాంత్రిక విధానాలు చేసి చూపినాము రెండు నెలలు అవకాశము ఇవ్వడము మంచిదని మహామంత్రి గారు అనగా రాజావారు కొన్ని క్షణాలు ఆలోచించి తన అంగీకారము తెలిపినారు తరువాత ఇద్దరు సోదరులిద్దరు కూర్చున్న చోటికి వచ్చి మీరు మీ ప్రయ.త్నము చేయవచ్చును. అందుకే మేము అజ్ఞ ఇస్తున్నాము అని మహారాజు గారు అనగా మంత్రిగారు మీరు మీ చికిత్సా విధానము పద్ధతి ఎప్పుడు ప్రారంభిస్తారు. అని అడిగినారు. అంత అన్నదమ్ములిద్దరు ఈ రోజుకు మూడవ రోజు మంచి ముహూర్తము ఉన్నదని ఆరోజు తమ చికిత్స అనగా శక్తిని ధారపోయడము మొదలు పెడ్తాము అన్నారు. మహారాజుగారు సరేననగా అన్నదమ్ములిద్దరు తమ నివాసమునకు చేరినారు.

రెండు రోజుల అనంతరము సుఖపర్ణి, ముఖపర్ణి ఇద్దరు రాజ మందిరానికి ఉదయానే బయలుదేరి రాజమందిరానికి చేరి తమ రాకను రాజుగారికి తెలియజేసినారు. రాజావారు బయటకు వచ్చిన తరువాత తాము రాజకుమారుల వారి చికిత్సకు వచ్చినామని ముందు చెప్పిన విధముగా ఏర్పాటు చేయమని విన్నవించుకున్నారు. రాజావారు ప్రధానమంత్రికి కబురు చేసి సోదరులిద్దరికి కావాల్సిన ఏర్పాట్లు చేయమని

ఆదేశించినారు. సోదరులిద్దరు రాజకుమారుని ఒక సింహాసనముపై కూర్చోబెట్టి నలుగురు సేవకులను తప్ప మిగిలిన వారిని వెళ్ళమని అన్నారు. అందరు వెళ్ళిన తరువాత అన్నదమ్ములిద్దరు రాకుమారునికి సింహాసనమునకు ఎదురుగా కూర్చొని సంకల్పము చేసి దేవి మాతను శ్రీ మహా విష్ణువును ధ్యానించి రాజకుమారుని శరీర రుగ్మతను దూరము చేయడంలో తమ ప్రయత్నానికి ఆజ్ఞ ఇమ్మని వేడుకున్నారు. తరువాత రాజ కుమారుని వైపు దీక్షగా ఏకాగ్రతతో చూడసాగారు. దేవి మాత మరియు శ్రీ మహావిష్ణువును ధ్యానించి తాము క్రోడీకరించిన శక్తిని తమ చేతులతో ప్రవహింప చేయమని వేడుకున్నారు. తరువాత దేవిని విష్ణువును స్తుతించి మంత్రాలు చదువసాగారు. దేవి, విష్ణు సహస్రనామాలు చదివి ప్రతి నామములో గల గూడార్థాన్ని గ్రహించి శక్తి తమ చేతులలో వచ్చిందని అవగాహన కలుగగానే చేతులు రెండు రాజకుమారుని వైపు అరచేతులలోని తాము గ్రహించిన శక్తిని రాకుమారుని శరీరములో ప్రసరింపచేసినారు. శక్తి తనలో ప్రవేశించిన సంగతి తెలియని రాజకుమారుడు మామూలుగా తనకు ఏమి కానట్ల ఉండి. పోయిన తరువాత సోదరులిద్దరు ఆచమనము చేసి రాజకుమారుని ఆయన మందిరమునకు తీసుకొని పొమ్మని అన్నారు. రాజకుమారుని తీసుకొని వెళ్ళిన తరువాత రాజుగారికి ప్రధానమంత్రి గారికి కబురు చేసినారు. వారు రాగానే తాము దేవి మాత మరియు శ్రీ మహావిష్ణువు శక్తిని రాజకుమారుని లోపల ప్రవేశ పెట్టినామన అది మెల్ల మెల్లగా దాని ప్రభావము చూపెడుతుందని కనుక, సావకాశముగా వేచి ఉండవలసి ఉంటుందని తరువాత నెల రోజులకు మరల శక్తిని పంపుతామని తెలిపినారు. తాము ఇన్ని రోజులుగా సాధన చేసి గడించినది రాజకుమారునికి ధార పోసినామని, మరల నెల రోజుల పాటు ధ్యాన ప్రార్థనలు ఏకాగ్రత ద్వారా శక్తిని కూడగట్టుకొని రావలసి ఉంటుందని తెలిపినారు. తరువాత తమ నివాసమునకు బయలుదేరినారు.



మరుసటి రోజు నుండి మామూలుగా ఉదయాన త్రివేణి సంగమములో స్నానపానాదులు, సంధ్యావందనాలు ముగించుకొని మాత మందిరానికి వెళ్ళి ఏకాగ్రతతో ధ్యానము చేయసాగినారు. రాజవైద్యుల వారు రోజు వారిగా రాజకుమారుని పరీక్షించి రోజులాగానే వాని ఆరోగ్య పరిస్థితి, మానసిక పరిస్థితిని అంచన వేయడానికి ఉపక్రమించినారు. వారం రోజుల తరువాత రాజ వైద్యుల వారికి రాజకుమారునిలో చిన్న మార్పును గమనించినారు. రాజకుమారుని చూపులు ఇది వరకు లాగ విచిత్రముగా తీక్షణముగా లేవు. ఏదో పోగొట్టుకున్న విధముగాను లేవు. ఇది వరకు చూపులు శూన్యములోనికి చూస్తున్నట్లుగా ఉండేవి. రెండు రోజుల నుండి చూపులలో సౌమ్యత, సామాన్యతను గమనించినారు. ఈ మార్పు చాలా సూక్ష్మమైనది. కనుక మామూలు జనాలకు రాజకుటుంబ సభ్యులకు గమనించే అవకాశము లేకపోయినది. రాజ వైద్యుల వారు శరీరము శరీర నిర్మాణ శాస్త్రాన్ని క్షుణ్ణముగా తెలిసిన వారు కనుక ఈ మార్పును గమనించ గల్గినారు. అది రాజా వారికి తెలుపగా రాజావారు చాలా ఆనందపడిపోయినారు, సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులు ఇద్దరును రోజువారిగా తమ దినచర్యలో ఏమి మార్పు లేకుండా త్రివేణి సంగమములో స్నానాదులు ఆచరించి జపతపాలు, సంధ్యావందనములు చేసి దేవి మాత మందిరములో మాతను ధ్యానము చేస్తున్నారు. సాయంకాలం యధావిధిగా శ్రీ మహావిష్ణువు ఆరాధనలో తమ ఏకాగ్రతను నిలిపి సాధన చేయసాగినారు. వారు అకుంఠిత దీక్షతో సాధన చేయుట వలనను శ్రీ ఉద్దీష్ఠులవారు చెప్పిన విధముగా ఎక్కువ సమయము ధ్యాన సాధనలో గడపసాగినారు. ధర్మశాలలకు మామూలు జనసహాయము కొరకు సమయమును కేటాయించ లేక పోతున్నారు. పదిహేను రోజుల తరువాత ఇంకా ధ్యానమును కఠోర తరమును చేయదలచి ఏకభుక్త నియమాన్ని పాటించ సాగినారు. అతి శ్రద్ధగా ఏకాగ్రతతో నెల రోజుల పాటు అమ్మవారి మరియు శ్రీ మహావిష్ణువు ధ్యానములో గడిపిన తరువాత వారికి కొంత

శక్తి సమకూరినట్లుగా జ్ఞానము కల్గినది. మరుసటి రోజువారు ప్రధానమంత్రికి తాము రెండవ సారి రాకుమారునికి శక్తి ప్రసాదించుటకు సిద్ధముగా ఉన్నామని అందుకు మహారాజుగారిని కలసి వారి ఆజ్ఞను పొంది తమకు తెలుపుమని సమాచారాన్ని అందించగా, రాజుగారు అందుకు తగిన ఏర్పాట్లు చేయమని మంత్రిగారిని అజ్ఞాపించినారు. రాజవైద్యుల వారు రాజకుమారుల వారి మానసిక స్థితిలో కొంత మెరుగు కనిపిస్తుందని తెలిపి ఉండడం వలన ఇక రాజావారు మరోమారు ఆలోచించకుండా మహామంత్రి గారికి ఆజ్ఞ ఇచ్చినారు. మరుసటిరోజు సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులు రాజభవనానికి చేరుకొని అక్కడ తాము ఇంతకుముందు కోరినట్లుగా అన్ని సౌకర్యాలు ఏర్పాటు చేసి ఉండడము వలన ఇక ఆలస్యము చేయకుండ తమ కార్యక్రమము చేయడంలో నిమగ్నమైనారు. రాజకుమారుని తీసుకొని వచ్చి తమ ఎదురుగా ఉన్న సింహాసనముపై కూర్చుండ పెట్టిన తరువాత నలుగురు సైనికులు తప్ప మిగిలిన వారు నిష్క్రమించినారు. సోదరులిద్దరు ఆచమనము చేసి సంకల్పము చేసి తమ శక్తిని, మనస్సును భౌతికముగా మానసికముగా క్రోడీకరించి అమ్మవారు మరియు శ్రీ మహావిష్ణువును ప్రార్ధి:చి తమ రాజకుమారుని స్వస్థత చేకూరే విధముగా చెయ్యునట్లు తాము సాధించిన శక్తినంత తమ చేతులలోకి వచ్చేట్లు చేయమని ఆజ్ఞ ఇమ్మని ప్రార్ధించి మనస్సును కేంద్రీకరించి తను అరచేతులలోకి తమ శక్తిని క్రోడీకరించి రాజకుమారుని వైపు ప్రసరింప చేయ సాగినారు. ఇలా మూడు సార్లు వారు తమ శక్తిని రాకుమారుని వైపు ప్రసరింప చేసిన తరువాత తమ శరీరాలను భౌతికముగా మానసికముగా శక్తి ద్వారా శుద్ధి చేసుకొని రాకుమారుని తీసుకొని వెళ్ళమని అన్నారు. రాజకుమారుడు తమ కక్షలోకి వెళ్ళిన తరువాత రాజకుటుంబీకులందరు పర్ణి సోదరులను కలవడానికి ఆసక్తిని కనబరచి అక్కడకు వచ్చినారు. మొదటి సారిగా రాజావారి కుటుంబము రాగానే ప్రధానమంత్రి గారు రాజకుటుంబములోని



సభ్యులందరిని ఒక్కొక్కరిగా పర్ణి సోదరులకు పరిచయము చేసాగినారు. వీరు రాజుగారి పట్ట మహిషి పేరు కలా ప్రపూర్ణవతి గారు. వీరిద్దరు రాజుగారి కూతుళ్ళు. ఈమె పెద్ద కూతరు కలవకుంతల ఈమె రెండవ కూతురు పేరు శశిరంజని వీరు ఇద్దరు కూడ మంచి పండితులు ఇతను రాజుగారి సోదరుడు పురు ప్రచండుడు రాజ సైన్యాధ్యక్షులు కూడాను మొదటి సారి మీరు ఇద్దరు ఇచ్చిన చికిత్స కొంతగా పని చేస్తుందని రాజ వైద్యులవారు రాజకుటుంబానికి విన్నవించుకున్నారు. అందువలన వీరంతా మిమ్ములను కలవడానికి ఉత్సాహము చూపించినారు. రాజకన్యలిద్దరు తమకు కల్గిన అన్ని సందేహాలను తీర్చుకోవాలని తమ ఆసక్తిని కనబరుచుకున్నారు. కుటుంబములోని సభ్యులందరికి మొత్తానికి మీమీద సదభిప్రాయము కల్గినది. అనగా పర్ణి సోదరులు ప్రస్తుతము మేము ఇతర విషయాలపై ధ్యాస కాని ధ్యానము కాని పెట్టదలచుకొనలేదు. దాని వలన మా ఏకాగ్రతకు ధ్యాన శక్తి క్షీణిస్తుందని గురువుగారి ఆజ్ఞ. ఇప్పటికి రెండుసార్లు చికిత్సా ఇవ్వడము జరిగినది ఇక మూడవసారి కొరకు మమ్మల్ని మేము సిద్ధము చేసుకొనవలసి ఉంటుంది. మా ఏకాగ్రతలో ఏమాత్రము అలజడి కల్గిన తగిన ఫలితాలు రాకపోవచ్చును. రెండవసారి చికిత్సా తరువాత రాజకుమారుని శరీరములో కొన్ని భౌతికమైన మార్పులు. శారీరక మార్పులు కలిగే అవకాశము ఎక్కువగా ఉంటుంది ఆ నలుగురు సైనికులను రాజకుమారుని దగ్గర పగలు రాత్రి దఫాల వారిగా ఆయన దగ్గరనే ఉండే విధముగా చూడగలరు. ఒక్కొక్క సారి విపరీత భౌతిక మార్పు కలిగే అవకాశము ఉంటుంది. రాజకుమారుల వారు తమను తాము కట్టుదిట్టము చేసికొనలేక పోవచ్చును. అందుకు ఈ నలుగురు సైనికుల సహాయము అవసరము పడవచ్చును. సంవత్సరాలుగా ఒత్తిపట్టి ఉంచిన శక్తినీ బరువు ఒత్తిడి తీసివేయడము జరుగడం వలన కొంత శాంతపరిచే ప్రయత్నము ఈ సైనికులు చేయవలసి ఉంటుంది. కనుక జాగ్రత్తపడవలసిన అవసరము ఉంటుంది. అనగా

రాజావారు ప్రధానమంత్రి వైపు చూడగా ప్రధానమంత్రిగారు ఆ ఏర్పాట్లను చేస్తానని సైన్యాధ్యక్షులైన ప్రచండుల వారివైపు చూడగా వారు విషయము గ్రహించి పగలు రాత్రి వంతుల వారిగా రాకుమారుని దగ్గర సైనికులు ఉండే విధముగా ఏర్పాటు జరుగుతుందని విన్నవించినారు.

సుఖపర్ణి ముఖపర్ణి సోదరులు చికిత్స చేసిన తరువాత మరుసటి రోజు నుండిరాజకుమారునిలో శారీరక మార్పులు జరగసాగినవి. ఇది వరకు కళ్ళలో మాత్రమే చూపులలో కనిపించిన మార్పు ఇప్పుడు శరీరములోను కూడా మార్పు జరుగుతున్న కారణమున రాజకుమారుడు ఒక్కసారిగా ఒళ్ళు విరుచుకొనడము, నవ్వడము, గోడకు తన చేతులతో బాధడం ఎదురుగా నున్న సైనికులపై విరుచుకు పడడము లాంటివి చోటు చేసుకున్నాయి. చాలా సమయము గోడను బాదడం వలన రాజకుమారుని చేతులు కొంత బాదకు గురి అయినాయి. దాన్ని గమనించిన సైనికులు చల్లని నీళ్ళలో రాకుమారుని చేతులను కొంత కాలము ఉంచారు. సైనికులపై విరుచుకు పడినప్పుడు సైనికులు వారి శక్తినుపయోగించి వానిని కట్టుదిట్టము చేసినారు. ఇలా ఒకటి రెండు రోజుల పాటు ఈ పరిస్థితికి లోనై అలసిపోయి నిద్రపోయినాడు. ఒక అరజాము పాటు నిద్రించి లేచిన తరువాత రాజకుమారుడు కొంత శాంత చిత్తము కనబడచినాడు. రెండవ రోజు కూడా మరల ఉన్మాద పరిస్థితి కలిగినను దానిలోని తీవ్రత ముందు రోజు అంతగా లేక పోయినది. ఇక మూడు రోజులు గడిచిన తరువాత ఉన్మాద పరిస్థితి రోజు రోజుకు తగ్గడం అయినది. ఇంకా మరి రెండు రోజులు గడిచిన పిదప రాకుమారునిలో చాలా మార్పులు చోటు చేసుకున్నాయి. కొంత కొంత భౌతిక పరిస్థితుల గూర్చి అవగాహన పెరిగినది.

ఇక సుఖపర్ణి ముఖపర్ణి సోదరులిద్దరు రోజువారిగా త్రివేణి సంగమములో స్నానాదులు నిర్వహించుకొని ప్రాతః కాల



సంధ్యావందనము చేసి అమ్మవారి గుడికి పోయి ఏకాగ్రతతో అమ్మవారి విగ్రహము ముందు కూర్చుని, ఏకాగ్రతతో అమ్మవారి విగ్రహంపై దృష్టి కేంద్రీకరంచి ధ్యాము చేయసాగినారు. తరువాత సాయంకాల సంధ్యావందనములు అయిన తరువాత శ్రీ మహావిష్ణువుని ఆరాధించి శ్రీ మహావిష్ణువుపై ధ్యానము చేయసాగినారు. రోజు ఏకభుక్తము పాటించి ధ్యాన కార్యక్రమము కొంత నిష్ఠగా ఆచరించడం మొదలు పెట్టినారు.

రోజువారిగా వారిద్దరికి శ్రీమాత దేవి నుండి శ్రీ మహావిష్ణువు నుండి కొంత కొంత సందేశములు రావడము మొదలు అయినవి. పర్ణి సోదరులు ఇద్దరు తమ అనుభవాలను గూర్చి కలిసి కూర్చుని చర్చించడము మొదలు పెట్టినారు. తమ కార్యక్రమము యధావిధిగా సాగడము తరువాత అందులో కొంత పురోగతిని సాధించడము పట్ల తమ సంతృప్తిని ఇద్దరును పొందినారు. తరువాత సోదరులిద్దరు మహామంత్రి గారిని కలిసి విషయాన్ని అడుగగా మంత్రిగారు ఈ వారము రోజులుగా రాజకుమారునిలో కొంత భౌతిక పరిస్థితిలోను నడవడికలోను మార్పు కలిగినదని సోదరులకు తెలిపినారు. మూడు వారాలు ఇలా ఏకాగ్రతతో ధ్యానము చేసిన తరువాత ఇద్దరికి ఇలా సందేశము చేరినది. మీరు చేస్తున్నది చేయబోతున్నది లోక కళ్యాణార్థము కనుక, ఇందులో మీ స్వార్థము ఏమియును లేదు కనుక మీకు ఈతోధికశక్తి కలిగి మీరు చేయుచున్న కార్యక్రమములో నాది మరియు శ్రీ మహావిష్ణువుది సంపూర్ణ సహకారము ఆశీర్వాదములు, దీవనలు ఉంటాయి. ఇంతటి బాధలో ఉన్నను రాజకుటుంబము మొత్తము సంతృప్తిగా లేకున్నను ప్రజ, రాజ్య, లోక కళ్యాణార్థము గణపతి యాగము చేసినారు. మహారాజుగారు కావాలని అనుకుంటే తమ కుమారుని ఆరోగ్యము నిమిత్తము ఏదైన పూజ గాని యాగము గాని క్రతువు కాని చేసి ఉండి ఉండవచ్చును కాని మరుత్తు మహారాజు గారు తమ కుటుంబము కన్న తమ రాజ్య ప్రజా సుభిక్షమే గొప్పదిగా భావించినారు. రాజుగారు చేసిన గణపతి మహాయజ్ఞము యధావిధిగా జరిగినది.

రాజకుమారుడు వారి కుటుంబ సభ్యులు కూడా రాజ్యప్రజలలో భాగమే కనుక నేడు శ్రీ మహావిష్ణువు గారును కూడా ఎంతో సంతుష్టిగా ఉన్నారు. మీ సోదరులిద్దరుకు మీ స్వంతము స్వార్థము కొరకు కాకుండా రాజకుమారుని స్వస్థతకు గూర్చి ఆలోచించినారు ఆచరణలో పెట్టున్నారు. రాజకుమారుని ఆరోగ్యము బాగుపడక పోయినట్లైతే రాజుగారి తరువాత రాజ్యభారమును మోసేవారు కరువు అవుతారు. రాజ్యము కొన్ని తరాల వరకు కూడ సుభిక్షముగా ఉండాలని మీ తపనకు మా సహాయ సహకారాలు తప్పక ఉంటవి. మూడవ ప్రయత్నము ఇక చేయగలరు. రాజకుమారుని పూర్వజన్మ పాపము తాంత్రికశక్తి ప్రభావము నశించి వానికి స్వస్థత చేకూరగలదు. స్వస్తి, అంటూ అమ్మవారు తన మరియు తన ద్వారా శ్రీ మహావిష్ణువు సందేశము పర్ణి సోదరులకు తెలిసినది. పర్ణి సోదరులిద్దరు ఎంతో సంతృప్తిపరులై ఇంకను మిగిలిన వారంరోజుల ధ్యాన కార్యక్రమములో నిమగ్నమైనారు.

రెండు మూడు రోజుల అనంతరము ఒక రోజు త్రివేణి సంగమములో స్నానమాచరించి సూర్య భగవానుని అర్ఘ్యము ఇచ్చినప్పుడు సూర్యకాంతి వారి దోసిటిలో ఉన్న నీటిపై పడి వక్రీభవనము చెంది ఆ కాంతులలో శ్రీవినాయకుడు స్పష్టముగా కనిపించిన ఆకారమును గమనించినారు. సోదరులిద్దరికి కూడ అదే అనుభవము కలుగగ అన్నదమ్ములిద్దరు ఒకరినొకరు చూసుకొని విషయము అర్థము చేసుకొని వినాయకునకు నమస్కారములు సమర్పించినారు. తరువాత గణపతికి కూడ అర్ఘ్యము ఇచ్చినారు అర్ఘ్యము పూజ అనంతరము అమ్మవారి ఆలయానికి వెళ్ళి అమ్మవారిని ఆరాధించి సుఖపర్ణి ముఖపర్ణి సోదరులు తమకు కల్గిన అనుభవమును వినాయకుని ప్రతిభింబము నీటిలో సూర్యకాంతులలో కనిపించడము గూర్చి చర్చించుకున్నారు. ఇద్దరు అమ్మవారి గుడి మండపములో కూర్చుని తమకు నలుగురు దేవతలైన



అమ్మవారు, శ్రీమహావిష్ణువు, గణపతి, సూర్యభగవానుడి అనుగ్రహము కలిగినది కనుక ఇక ఆలస్యము చేయకుండ మూడవసారి రాజకుమారుని చికిత్సను గూర్చి ఆలోచన చేసాగినారు. తమ నివాసానికి వెళ్ళి భోజనాదులు ముగించుకొని కొంత కాలము విశ్రాంతి తీసుకొని విష్ణుమూర్తి ధ్యానము ముగించుకొని ఇక మూడవసారి చికిత్సను గూర్చి నిర్ణయించుకున్నారు. మరుసటి రోజు ఉదయాన కార్యక్రమాలు ముగించుకొని ప్రధాన మంత్రిగారిని కలవడానికి వెళ్ళినారు. ప్రధానమంత్రిగారు వీరిని ఆహ్వానించి, అంతకుముందే రాజవైద్యుడు వచ్చివెళ్లినారని రాజకుమారునిలో మానసికముగానే కాకుండా శారీరకంగా కూడా చక్కని మార్పులు కనపడుతున్నాయని రాజవైద్యుల వారు తెలిపినారని అన్నారు. అంత సోదరులిద్దరు ఆ విషయమే తమతో మాట్లాడుదమని వచ్చినామని దైవాజ్ఞ అయినది కనుక రేపు ఉదయాన్నే రాజకుమారుని మూడవసారి అనగా చివరిసారి తమ శక్తి ప్రధానము చేయతలచినామని ఆ విషయము తమతో ప్రస్తావించ దలచినామని తెలుపగా మంత్రిగారు చాలా బాగున్నది, కొంత తడవ తరువాత నేను కొన్ని రాచకార్యాల నిమిత్తము మహారాజా వారిని కలవడానికి వెళ్తున్నాను. మీ ప్రస్తావన కూడా వారికి విన్నవించి రేపు ఉదయాన మీ చికిత్స నిమిత్తము ఏర్పాట్లకు అనుమతి కోరుతాను. అని ప్రధానమంత్రి ఆ విషయము మీకు రాజుగారి సమావేశము తరువాత పరిస్థితి తెలియపరుస్తాను అనగా సోదరులిద్దరు మంత్రిగారి అనుమతి తీసుకొని తమ నివాసానికి చేరుకున్నారు.

తమ నివాసానిక చేరిన తరువాత తాపీగా విశ్రాంతిగా కూర్చొని తాము అనుసరిస్తున్న అనుసరించవలసిన విధి విధానాన్ని మార్గాన్ని వివిధ కోణాలలో పరిశీలించి చర్చించుకొన సాగినారు. తాము ఇంతవరకు పాటించిన పద్ధతి ఆచరించిన విధానము సత్ఫలితాలను ఇచ్చుచున్నది

ఇది మూడవసారి కనుక ఇప్పుడు తమ సర్వశక్తులను ధారపోయడము కనుక కొంచము జాగ్రత్తగా ఎలాంటి పొరపాట్లు లేకుండా కార్యక్రమము చేయాలి అనుకొనగా తమ్ముడు ముఖపర్ణి, అన్నగారు మనము ఇంతగా వ్యాకులపడనవసరము లేదు. శ్రీ మహావిష్ణువు జగత్పాలకుడు, జగత్కర్తా జగత్ రక్షకుడు, గురువులకు గురువు సర్వలోక పాలకుడు ఆయనను ప్రార్థిస్తాము. ఆయనే మనకు ఏ విధమైన పొరపాట్లు లేని మార్గాన్ని తెలుపుతాడు. అనగ అన్నగారైన సుఖపర్ణి కూడా అందుకు సమ్మతమును తెలిపి, ఈ సాయంత్రము ధ్యానములో శ్రీ మహావిష్ణువుని పొరపాటు లేని మార్గదర్శనము జేయమని విన్నవించుకుందాము. అలా ప్రార్థన చేద్దాము, వేడుకుందాం అని నిశ్చయించుకొని సాయంకాలము వరకు కొంత వేదముల గూర్చి చర్చించుకొని సాయంకాలము సంధ్యావందనము ముగించుకొని శ్రీ మహావిష్ణువు ధ్యానములో కూర్చుని తమకు సరైన మార్గము. నిదర్శనము కలుగ చేయమని ధ్యానములో నిమగ్నమైనారు. మరుసటి రోజు ఉదయము రాజదర్శనము ఆశించి రాజ భవనమునకు వెళ్ళి రాజదర్శనమునకు వచ్చినామని రాజావారికి విన్నవించమని సేవకునికి వివరించినారు. ప్రధానమంత్రి ముందటి రోజే వీరు వచ్చే సమాచారము అందించినందున రాజుగారు వచ్చి వీరిని ఆహ్వానించి లోనిక తీసుకొని రమ్మని సేవలకులను వినియోగించినారు. అంత అన్నదమ్ములిద్దరు అంతఃపురమునకు చేరుకొనగా రాజావారు వీరు చెప్పనట్లుగా కావల్సిన ఏర్పాట్లు జరిగినవి వారు రాజకుమారుని కక్షలోని వెళ్ళ వచ్చని అన్నారు. అంత పర్ణిసోదరులిద్దరు అంతఃపురములోని రాజకుమారుని కక్షలో ప్రవేశించగా రాజకుమారుడు వీరిని గుర్తుపట్టి లేచి నిలుచుని వీరికి నమస్కారములు ఆచరించినాడు. అన్నదమ్ములిద్దరు రాజకుమారుని చర్యలకు ఆశ్చర్యపడి తమ శ్రమ సత్ఫలితాన్ని ఇస్తుందని సంతోషపడి మాత, శ్రీ మహావిష్ణువునకు తమ కృతజ్ఞత తెలుపుమన్నారు. తరువాత రాజకుమారుని సింహాసనముపై కూర్చోమని తాము ఎదురుగా



కూర్చుని దేవి మరి శ్రీ మహావిష్ణువును సంకల్పముతో ఆహ్వానించి తమ ప్రయత్నమునకు సహకరించమని విన్నవించుకున్నారు. తరువాత ఆచమనము చేసి తమ పేరు, గోత్రము సంవత్సరము, ఆయనము, తిథి, పక్షము మాసము, నక్షత్రము, వారము ఉచ్చరించి రాకుమారుని పేరు గోత్రము మొదలైనవి ఉచ్చరించి తమ చేతులలో దేవి మాతను శ్రీ మహావిష్ణువు శక్తులను క్రోడికరించడానికి అనుమతించమని ఆహ్వానించి ఏకాగ్రతతో తమ చేతుల ద్వారా రాజకుమారునికి శక్తి ప్రధానము చేసినారు. మరల మరల సంకల్పము చేసి మూడు సార్లు శక్తిని ప్రధానము చేసినారు. శక్తిని ప్రసరింప చేసినారు. ఈ కార్యక్రమమునకు ఒక అరజాము సమయము పట్టినది. తరువాత ముగింపు కార్యక్రమము పలికి దేవి మాతకు శ్రీ మహావిష్ణువుకు కృతజ్ఞతలు, ధన్యవాదములు తెలిపి దేవతలిద్దరిని యథాస్థానము గ్రహించమని వేడుకున్నారు. తరువాత తమను తాము మంత్రముతో శారీకముగా, మానసికముగా శుభ్రపరచుకొని రాకుమారుని తీసుకవెళ్ళమని భటులకు చెప్పినారు. రాజకుమారుడు వీరికి నమస్కరించి తన గదిలోనికి వెళ్ళినాడు తరువాత పర్ణిసోదరులు మహారాజును కలిసి ఈ రోజుతో మూడవసారి తాము శక్తిని తాము ధారపోసినామని అది తాము ఇది వరకు ఇచ్చిన శక్తి సత్‌పలితమును ఇచ్చినదని అది కనపడుతున్నదని, దైవాజ్ఞవలన ఈ మూడవసారి ఇచ్చిన శక్తి వారికి పూర్తి స్వస్థతను ఇవ్వగలదని విన్నవించినారు. అంతలో అక్కడకు రాజవైద్యులవారు వచ్చినారు. వారు తాను ఈ ఉదయమున రాకుమారుని కలిసి పరీక్ష చేసినామని మానసికంగా, శారీరకగా రాకుమారుల వారికి స్వస్థత కలిగిందని ఇది ఎంతో ఆనందించవలసిన విషయమని మరి ఈ రోజు మూడవసారి శక్తి ప్రధానము ద్వారా ఒకటి రెండు రోజులలో రాకుమారుల వారు పూర్తి ఆరోగ్యము చేకూర్చుకుంటారని ఆశా భావాన్ని వ్యక్తము చేసినారు. సోదరులిద్దరు రాజావారి వద్ద సెలవు తీసుకొని తమ

నివాసానికి బయలుదేరినారు. తమ నివాసానికి చేరి ఏకాగ్రతతో దేవి మాతకు మరియు శ్రీ మహావిష్ణువుకు తమకు కలిగించిన ఈ అవకాశానికి మరి తోడ్పాటుకు మరొకసారి కృతజ్ఞతలు తెలియపరచినారు.

మరుసటిరోజు ఉదయాన్నే త్రివేణి సంగమములో స్నాన పానాదులు ఆచరించి దేవి మాత ఆలయమునకు చేరుకొని దేవి విగ్రహము ముందు కూర్చొని ఇలా మాతను పొగడసాగినారు.

**మాత, శ్రీమాత, దేవి మాత**
**అఖండ కరుణామాయి, కారుణ్యమూర్తి**
**మంచిని పెంచే మమతా మూర్తి**
**కష్టాలు తీర్చే వరదప్రదాయిని**
**కోరినవరాలిచ్చే కొంగుబంగారానివి**
**త్రిమూర్తుల శక్తి ప్రదాయిని**
**త్రికాల జ్ఞానము కలిగినదానివి**
**మమ్ములను కరుణించి మాచే**
**రాచకార్యము సఫలము చేయించిన జగదేక మాత**
**నమస్తే, నమస్తే, నమోనమః**

అని జగన్మాతను వేనోళ్ళ పొగిడి తమకు స్వాంతనము, సంతృప్తి కలిగే వరకు దేవి మాతపై తదేకంగా చూపులు నిలిపి తమకు మానసికముగా, తృప్తి అందేవరకు అమ్మ ఎదుట కూర్చుని ధ్యానము చేసి తమకు కలిగించిన ఈ అవకాశానికి పలుపలు సార్లు ధన్యవాదములు తెలిపినారు. సాయంకాలము సంధ్యావందనాదులు ముగించుకొని తరువాత శ్రీ మహావిష్ణువును పూజించి ప్రార్థించసాగినారు.

**శంక చక్రగదా పద్మధర**
**కారుణ్యమూర్తి ప్రజారక్షణకు పాటుపడు వాడ నారాయణ**



**వారలకు భుక్తి భుక్తి అనుగ్రహతత్పరా**
**రాక్షసత్యభావ నియంతకా**
**రాక్షస స్వభావాంతక మంచిని పెంచువాడ**
**పాలకడలి నివాస, వైకుంఠపతి**
**లక్ష్మి హృదయ ప్రభు శ్రీ వత్సవక్ష**
**మకుట ధారణ, గరుడవాహన**
**ఆనందవదన ముదమున కనులలో**
**నవ్వు కురిపించువాడ కమల నాభ**
**కమలనయన, కమలవదన**
**పాహిమామ్ పాహిమామ్ పాహిమామ్**

అని పరిపరి విధముల శ్రీ మహావిష్ణువును ప్రార్థించి తమ అనుగుణాన్ని వ్యక్తము చేసినారు. తాము రెండు మూడు నెలల నుండి రాకుమారుని స్వస్థత చేకూర్చే నిమిత్తము సమయము గడిపినాము కనుక తరువాతి రోజు నుండి సాయంకాలములు రాజావారి ధర్మశాలలోకి వెళ్ళి సామాన్య ప్రజానిక సేవ చేసి వారి ఈతి బాధలను తీర్చే ప్రయత్నము చేయాలని నిర్ణయించుకున్నారు. ఇంకా తమలో శక్తిని క్రోడీకరించుకొని ఏకాగ్రత, ధ్యానము, ద్వారా శక్తి సాధించి లోకులకు ఉపయోగపడే విధముగా ప్రయత్నము చేద్దామని సంకల్పించుకున్నారు.

అంత ముఖపర్ణి అన్నగారు మనము ఇన్ని సంవత్సరాల నుండి సామాన్య ప్రజల ఇక్కట్లు, ఈతి బాధలు తీర్చే ప్రయత్నము చేసినాము కాని వాటిని గూర్చి మనము క్షుణ్ణముగా ఆలోచించలేదు. ప్రజల సమస్య ఆ సమస్యను గూర్చి ఆలోచించకుండ సమస్యకు అప్పటికప్పుడు సమాధానము మార్గము సూచిస్తున్నాము. ఒకసారి కూడా సమస్యను క్రోడీకరించి వాటి పూర్వ పరాలను గూర్చి మనము ఆలోచంచలేదు. మీరును నేనును కూడ ఏ సమస్యకు ఆ సమస్యకు విడిగానే

ఆలోచించినాము ఇన్ని రోజులుగా మనము ప్రయత్నలోపము చేయకుండ పరిష్కరించినాము. నాకు వాటన్నింటిని ఒక మూసలోవేసి ఆలోచించగా నాకు తోచుచున్నదేమంటే ఈ సమస్యలు ఎక్కువ కాలము దాని మూల కారణము వారి ఆర్థిక పరిస్థితులు, మిగిలిన భాగము దానికి పూసిన అలంకారము మాత్రమే. మనము లోతుగా వారిని ప్రశ్నించిన, అడిగినట్లైతే చివరకు తేలేది మరియు అకాల కారణము వారి ఆర్థిక సమస్య మాత్రమే దానిలోనే అన్ని సమస్యలు ముడిపడి ఉన్నాయి అని నాకు తోచుచున్నది. మీకు ఏమనిపించు చున్నది? ఒకసారి సింహావలోకనము చేసికొనగలరు. అంత సుఖర్ణి కొన్ని క్షణములు ఆలోచించి తమ్ముడు నేను ఈ కోణములో ఎప్పుడును అలోచించలేదు. నీవు చెప్పినట్లుగా ఎక్కువ శాతము దాని మూలము ఆర్థిక సమస్య ఆర్థిక లేమితో ముడిపడి ఉన్నది. ఇది మాత్రము నిజము. అనగా అయితే ఈ కోణములో మనము ప్రజాసమస్యలకు సులభమార్గముగా పరిష్కారము చెప్పాలంటే వారికి ప్రయోనము చేకూరె విధముగా చేయాలంటే ఏమి చేయాలి. అనగా తమ్ముడు ముఖపర్ణి అన్నగారు ఇన్ని రోజులు మనము మాతను శ్రీ మహావిష్ణువును ఆరాధించి, ధ్యానించి ప్రజల సమస్యలు తుదకు రాజకుమారుని శరీర ఆరోగ్యము బాగు చేసినాము. ఆరోగ్య సమస్యలు తీర్చే ప్రయత్నము చేసినాము. సామాన్య ప్రజల విషయములో ఆర్థిక సమస్యలు ఉన్నవి కాని రాకుమారుని విషయములో ఆర్థిక సమస్య ఏమియును లేదు కదా! గురువు ఉద్దీప్తుడు గారు ప్రవచించినట్లుగా అది పూర్వజన్మ సుకృతము, మరికొంత తాంత్రికుని ప్రభావము. కాని ఇతర ప్రజల సమస్యలు ఆర్థిక పరిస్థితులతో ఉన్నందున మనము మాత లక్ష్మీదేవిని గూర్చి కొంత ధ్యానము చేద్దాము, లక్ష్మిదేవి మాత గౌరిమాత కరుణించినట్లుగా కరుణించినట్లైన మనము ప్రజలకు ఎంతో సహాయము చేసిన వారమౌతాము. ఇలా సోదరులిద్దరు అనుకొని అందుకు కార్యోన్ముఖులైనారు. బాగా ఆలోచంచి సుఖపర్ణి తమ్మునితో



సోదరా రేపు శుక్రవారము లక్ష్మీదేవికి ప్రీతిపాత్రయైన వారము కనుక మనము ఉదయాన్నే కాలకృత్యములు సంధ్యావందనములు ముగించుకొని మాతను దర్శించుకొని ధ్యానించి రోజులాగానే మన కార్యక్రమములు ముగించుకొని అప్పుడు మనము మాతను లక్ష్మీదేవి అనుగ్రహము కొరకు ప్రార్థించే విధముగా ఆజ్ఞ ఇమ్మని మహాలక్ష్మి దేవిని ఆహ్వానించి మానసికంగా లక్ష్మీదేవి మాతను షోడోపచారాలు చేసి లక్ష్మీదేవిని ధ్యానించి కొంత సమయమును ఆ ధ్యానములో గడుపుదాము. లక్ష్మీకటాక్షానికి కొంత కాలము పట్టవచ్చును. దానికి ముందు దేవి మాత సహాయము కూడా కోరుదాము. తరువాత సాయంత్రము మహా విష్ణువును ధ్యానము చేసి శ్రీ మహావిష్ణువు సహాయము కూడ అర్థిస్తాము. ఈ విధముగా మనకు లక్ష్మికటాక్షము తొందరగా దొరికె అవకాశము ఉంటుంది.

**లక్ష్మీ క్షారసముద్రవాసిని**
**వైకుంఠ వాసిని**
**దేవ, దానవ రాక్షస, గరుడ**
**గంధర్వ, కిన్నెర, కింపురుష మానవ**
**పూజిత, పదునాల్గు భువనాల**
**మేలు కదలక నచేతనము**
**క్షణము క్షణము తప్పిన లోకాలు**
**స్తంభించేశక్తి కలదాన**
**కమలహస్త కమలనయన**
**కమల సింహాసిని**
**విష్ణుప్రియ విష్ణు వక్షస్థలవాసిని**
**వందనము వందనము నీకు వందనము**

ఇలా లక్ష్మీదేవిని ప్రార్థన చేసి లక్ష్మీదేవి ధ్యానములో ఏకాగ్రత చిత్తముతో లక్ష్మీదేవిని ధ్యానము చేస్తు కొంత సమయము గడప సాగినారు.

వారం రోజులు గడిచిన తరువాత రాజవైద్యుల వారు రాజకుమారుని క్షుణ్ణముగా పరీక్షించి రాకుమారుడు మానసికంగా శారీరకంగా స్వస్థుడైనట్లుగా మహారాజుగారి వద్ద ప్రకటించినారు. రాజకుమారుడు అన్ని విధముల స్వస్థుడైనాడు కనుక ఇక మామూలుగా అన్ని కార్యక్రమములను రాచకార్యములలోను ఇతోధికంగా పాల్గొనవచ్చునని అన్నారు. అందు మహారాజు గారు మరియు రాజకుటుంబము సంతోషముతో మునిగిపోయినారు. వారికి ఇంత కన్న ఆనంద దాయమైన విషయము ఏముంటుంది. రాజవైద్యులవారు రాజుగారితో అంతే కాదు మహారాజ ఇక నుండి రాకుమారులవారు యుద్ధవిద్యలు కూడా శిక్షణ పొందుటకు అర్హుడు. అంత మహారాజుగారు ప్రధానమంత్రి గారితో మంత్రిగారు రాకుమారుని స్వస్థతకు మార్పుకు కారణమైన పర్ణి సోదరులను మనము సత్కరించవలసి ఉంటుంది. నా ఉద్దేశము ప్రకారము ముందుగా రాచకుటుంబీకులు మరి కొందరు ముఖ్య బంధువులు అధికారులతో ఒక సమావేశము తరువాత సభలో సత్కారము ఏర్పాటు చేస్తే బాగుంటుంది. మహారాణి పరివారము వారిని కలవాలని ఎంతో కోరికతో ఉన్నారు. అనగా మంత్రిగారు అలాగే మహారాజ ఆ ఏర్పాట్లు చేసి నేను మీకు వివరాలు తెలుపగలను అని సెలవు తీసుకున్నారు.

మరి రెండు రోజుల తరువాత ప్రధానమంత్రిగారు పర్ణి సోదరులతో రాచకుటుంబీకుల సమావేశము ఏర్పర్చినారు. అందరు సమావేశమైన తరువాత పర్ణి సోదరులను రాచకుటుంబీకులతో ఇలా పరిచయము చేసినారు. వీరు పర్ణీ సోదరులు పెద్దాయన సుఖపర్ణి, చిన్నాయన ముఖపర్ణి నిజానికి వీరిద్దరు కవలలు జన్మరీత్యా ముందు పుట్టినవారు సుఖపర్ణి తరువాత జన్మించిన వారు ముఖపర్ణి, వీరు కాశీరాజు కొలవులో ఉన్న



శ్రీ ఏకపర్ణి కుమారులు, తమ చదువు పూర్తయిన తరువాత తల్లిదండ్రుల ఆజ్ఞతో తమ కాళ్ళమీద తాము నిలబడాలని కోరికతో మనరాజ్యాన్ని మహారాజావారు చేసే గణపతి మహాయజ్ఞములో పాల్గొన్నారు. తరువాత సభలో తమ చాతుర్యము కనబరచి రాజావారి మన్ననకు పాత్రులు అయి మన కొలువులో ఉంటున్నారు. ఆధ్యాత్మికంగా ఎంతో ఉన్నత శిఖరాలను అధిరోహించినారు. వీరికి శ్రీమాత, శ్రీ మహావిష్ణువులు ప్రసన్నులు, వీరు పిలిస్తే పలికే దైవాలు. ఇలా తమ సాధన ధ్యానము ద్వారా సాధించు కున్నారు. వీరు రోజు సాయంత్రము రాజధర్మ సత్రములో సామాన్య ప్రజల ఇక్కట్లను విని వాటికి పరిష్కారమార్గము తెలుపుతారు. క్రమముగా వీరికి రాజకుమారుని అస్వస్థత గూర్చి తెలిసినది. కొంత కాలానికి వీరికి నాతోను రాజవైద్యుల వారితోను పరిచయము ఏర్పడినది. కాలక్రమమున మాటల సందర్భముగా మేము రాకుమారుని అస్వస్థతను గూర్చి ఎరుక పరచడము జరిగినది. వీరు ధ్యానములో రాజకుమారుని అస్వస్థతకు వెదికి పరిష్కార మార్గము తెలిసికొని రాజవైద్యుల వారితో కలిసి నా వద్దకు వచ్చినారు. వారు చెప్పిన వివరాలను విని నేను వారికి రాజవైద్యుల వారిని రాకుమారునికి ఇది వరకు జరిగిన చికిత్స వివరాలు వాటి ఫలితాలను వారు పొందుపరచినవి ఇమ్మనగా వారు ఒకటి రెండు రోజులు ఆ వివరాలను నిశితము పరీక్షించి పఠించి తరువాత చికిత్స విధానమును ఆలోచించి ఒక ప్రణాళిక తయారు చేసుకొని నా వద్దకు వచ్చినారు. ఆ వివరాలు విన్న తరువాత వీరిని మహారాజా వారి వద్ద తీసుకొని వచ్చి పరిచయము చేసి వివరాలను రాజా వారికి చెప్దామని అనుకున్నాను, కాని రాజావారు మరల వీరి పరిచయము అవసరము లేకుండానే వీరు మన కొలువులో ఉంటున్నారు కదా వీరిని తీసుకొని రావడానికి కారణము వివరించండి నేను మహారాజా వారికి వీరు పాటించిన విధానమును వాటి వివరాలు తెలుపగా, రాజావారు వారి నుండి కొనిన వివరాలు అడిగి సంతృప్తి చెంది చికిత్సకు అనుమతించినారు. అంత వారు

కోరినదేమిటంటే ఇంతవరకు రాజకుమారుని ఆరోగ్య పరిస్థితి రుగ్మత, చికిత్స గోప్యముగా ఉంచబడినది. ముఖ్య కుటుంబ సభ్యులకు మాత్రమే తెలుసును, కాగా వీరు కోరినది ఏమంటే రాజావారి రాజవైద్యులను నాకు తప్ప ఇతరులకు మరి కుటుంబ సభ్యులకు కూడా ఈ విషయము తెలుపకూడదని వీరు నియమము పెట్టినారు. చికిత్స సమయములో నల్గురు దేహ దారుఢ్యము కల సైనికులు వంతులు వారిగా పగలు రాత్రి మరియు తమ చికిత్స సమయములో దగ్గరగా ఉండాలని అన్నారు. కనుక చికిత్స పూర్తయ్యే వరకు ఈ విషయము రహస్యముగా ఉంచబడినది. వీరు సాధన ద్వారా, ధ్యానము ద్వారా పొందిన భగవత్ శక్తిని రాజకుమారునికి ధారపోసి మధ్యన నెల నెల రోజులు విడిది ఇచ్చి మూడు సార్లు శక్తిని ధారపోసి చికిత్స చేసినారు. ఒకసారి చికిత్సకు సగము జాము పట్టేది. రాకుమారుల వారు శారీరకంగా, ధారుఢ్యము కలవారు మానసికంగానే పరివర్తన చెందినారు కనుక చికిత్స సమయములో తిరుగబడిన, సైనికులు రాజకుమారుని అదుపు చేయవలసి ఉంటుంది అని విన్నవించినారు. మొదటిసారి చికిత్స తరువాత అలాగే జరిగినది. రాజకుమారులు వారు పర్ణి సోదరులపై తిరుగబడే ప్రయత్నము చేసినారు. కాని వెంట ఉన్న సైనికులు రాజకుమారుని అదుపులో ఉంచినారు. మొదటి సారి చికిత్స తరువాత రాజకుమారుని మానసిక ప్రవర్తనలో మార్పును రాజవైద్యులవారు గమనించినారు. తరువాత మరి రెండు సార్లు చికిత్స అనంతరము రాజకుమారులవారు పూర్తిగా మానసికంగాను, శారీరకంగాను పరిపూర్ణ ఆరోగ్యవంతులైనారు. ఇది మనందరికి ఇప్పుడు తెలుసు, ఇప్పుడు అంత సవ్యముగా జరిగినది కనుక ఇక రహస్యముగా ఉంచే అవసరము లేదని వీరు నిర్ణయించినారు. అన్నదమ్ములిద్దరిని మీరు చూస్తున్నారు కదా వీరు శారీరకముగాను ముఖ వర్చస్సులోను దృఢ చిత్తము కలవారు గనుక చూపరులను తొందరగా ఆకర్శించును. శరీర నిర్మాణము కలవారు. ఇది వీరి పరిచయము, వీరి పరిచయములో ఇంకా ఒక భాగము మిగిలి



పోయినది. మన ఆస్థానములో ఉన్న ముగ్గురు కవులలో ఒకరు శాండిల్యుడు ఏక సంతాగ్రాహి సభలో కవులనెవరన్న వచ్చి తమ కవిత్వము స్వంతమైనది చదవినను ఏకసంతాగ్రాహి అయిన శాండిల్యుడు ఇది పాత కవిత్వమే నని తిరిగి అప్పచెప్పేవారు. ఇప్పటికి రెండు సార్లు విన్న ద్విసంతాగ్రాహి అయిన పిప్పిలాదులు గారు కూడా మరల వినిపించే వారు. ఇలా రాజాస్థానములో ఏ కవి కూడ రాజాదారణ పొందకుండా వీరు అడ్డు పడ్తుంటే వారు కాల క్రమేణ ఎవరన్న కవిగారు కవిత్వము వినిపిస్తే అది పాతదని వారిని రాజాదరణ పొందకుండ తమ పదవులకు ముప్పు రాకుండ తమను తాము కొన్ని సంవత్సరాలుగా కాపాడుకుంటు వచ్చినారు. పర్ణి సోదరులు సభకు వచ్చి సభలో జరుగుతున్న తతంగమును గమనించి ఇద్దరు ఆస్థాన కవులలోన ఉన్న లొసగులు గమనించినారు. మొదట శాండిల్యుడు గారికి ఉన్న లక్షణమును గమనించినారు. వీరికి ద్విత్వాక్షరములు పల్కడంలో కష్టము అవుతు ఉండేది. రెండు మూడు నెలల తరువాత రాజావారిని కలిసి తమ కవితను వినిపించ ఆజ్ఞను పొంది తమ కవితస్వములో కఠిన పదాలను ఉంచి వినిపించగా ఆ కూర్పును మొదటి కవి శాండిల్యుడు గారు వినిపించలేక పోయినారు. మొదటి కవి శాండిల్యుడు గారు తిరిగి వినిపించలేక పోవడం వలన రెండవ కవి కూడా వినిపించలేక ఊరుకుండి పోయినారు. ఇది వీరి స్వంత కవిత్వమని వారు ఒప్పుకొనక తప్పలేదు. రాజావారు వీరి కవిత్వాన్ని మెచ్చుకొని ఆస్థానములో స్థానము కల్పించినారు. తరువాత సోదరులిద్దరు మహారాజవారి వద్ద అభయము తీసుకొని ఆస్థాన కవుల భండారము బయట పెట్టినారు. రోజువారిగా వీరు శ్రీమాత దేవిని శ్రీ మహావిష్ణువును ఏకాగ్రతతో ధ్యానించి ఆ శక్తిద్వారా రాజధర్మశాలలో సామాన్య ప్రజల కష్టాలను తీరే ఉపాయములను మార్గాలను తెలుపసాగినారు. ఇది వీరి పూర్తి వివరములు.

రాజ కుటంబీకులు వీరి శక్తి సామర్థ్యాలను మెచ్చుకున్నారు. తరువాత ప్రధాన మంత్రిగారు రాజకుటుంబ సభ్యులను ఒకొరొకరుగా తిరిగి సోదరులకు పరిచయము చేసినారు. రాజావారి రెండవ కూతురుకు సంపంగి హాసిని అని మరొక పేరు కూడ ఉన్నది. చాలా రోజుల వరకు రెండవ కూతురు నామకరణము జరుగలేదు. మూడు సంవత్సరాలు వచ్చిన తరువాత ఆమె నవ్వు సంపంగి పువ్వు విచ్చుకున్నట్లు ఉంటుందని ఒక కవి చూసి సంపంగి హాసిని అని పేరు పెట్టమనగా ఆ పేరు కూడా స్థిరపడినది. ఇప్పటికి కూడా ఆమె నవ్వు ముగ్ధ మనోహరముగా అందముగా ఉంటుంది. సంపంగి పువ్వు విచ్చుకున్నట్లుగా భావన కలుగుతుంది. మహారాజ తమ్ములుగారు తరువాతి వారు. వారి ధర్మపత్ని సోదరులు, వీరు ఆర్థిక మంత్రిగా ఉంటున్నారు. కోషాధ్యక్షులు కూడాను. వారి ప్రక్కన ఉన్న ఆవిడ ఆర్థిక మంత్రిగారి ధర్మపత్ని ఇది రాజాగారి కుటుంబము. తరువాత రాజావారి అనుమతితో కాసుల పళ్ళెము తీసుకొని రాగా, రాజావారు సోదరులిద్దరికి చెరొక వజ్రాలహారాన్ని మెడలో వేసి శాలువ కప్పి కాసుల పళ్ళెమును మరికొన్ని బంగారు ఆభరణములను బహుకరించబోయినారు. అంత పర్ణి సోదరులు మహారాజ మీరు వజ్రాల హారాన్ని బహుకరించి గౌరవించినారు అదే మాకు గొప్ప గౌరవము, ఈ పళ్ళెములలోని కాసులను ఆభరణాలను మేము ఏమి చేసుకుంటాము మీరు కల్పించిన సౌకర్యాలే మాకు బాగున్నాయి. సరిపోతున్నాయి. ఒంటరి వాళ్ళము బ్రహ్మచారులము మాకు ఏమి కోరికలు అవసరాలు ఉంటాయి. కనుక ఈ పళ్ళాలను మేము స్వీకరించలేము. మమ్మల్ని మన్నించగలరు. వీరి నిరాడంబరత్వానికి రాచకుటుంబ సభ్యులు అందరును ఎంతో సంతోషించినారు. తరువాత విందు జరిగినది. విందు తరువాత ఇష్టాగోష్టులతో కొంత కాలము గడిచినది. అంత మహామంత్రిగారు రాజకుమార్తెలు తమకున్న కొన్ని సందేహాలను మీ ద్వారా తీర్చుకోవాలని ఆసక్తి చూపుతున్నారు అనగా అలాగే కాని ఇప్పుడు కాదు. విందు



భోజనములో కడుపు నిండిపోయి మనస్సు పని చేయనని మొరపెడ్తుంది. కనుక మరొక రోజు ఈ కార్యక్రమము పెట్టుకుందామని అన్నారు. అందుకు అందరు సరేననగా సోదరులిద్దరు తమ నివాసాలకు బయలుదేరినారు.

రోజులాగానే సాయంకాలము స్నానములు ముగించుకొని ముందు మాతను ధ్యానించి తరువాత శ్రీ మహావిష్ణువును, లక్ష్మీదేవి కటాక్షము కొరకు ముగ్గురిని ఏకాగ్రతతో ధ్యానము చేయసాగినారు. ఇలా ధ్యానము ముగించుకొని బృకుటి మధ్యలో ఆజ్ఞా చక్రములో ఏకాగ్రతను నిలిపి లక్ష్మీదేవి కటాక్షము కొరకు చివరగా ధ్యానము చేయసాగినారు.

సోదరులిద్దరు ఏకాగ్రతతో ధ్యానము చేయడంలో సిద్ధహస్తులు కనుక లక్ష్మీదేవిపై ఏకాగ్రతతో ధ్యానము చేయడం వారికి అంతగా కష్టముగా అనిపించలేదు. ముందే వారు కుండలినీ విద్యను సాధించినారు. కనుక ఆజ్ఞ చక్రములో ధ్యానమును నిలపడము సులభముగానే అనిపించింది. కాని లక్ష్మీకటాక్షమునకు వారు కొంత శ్రమించవలసి ఉంటుంది. రోజు తమ దినచర్యలో లక్ష్మీధ్యానము కూడా చేర్చి సాధన చేయడం మొదలు పెట్టినారు.

## రాకుమార్తెలతో పరిచయము

ఒకవారం గడిచిన తరువాత ప్రధానమంత్రి గారి పిలుపు వచ్చినది. వారు ప్రధానమంత్రిని దర్శించగా మంత్రిగారు మీ ప్రవర్తన మరి రాజకుటుంబానికి మీరు చేసిన మేలు కుటుంబ సభ్యులందరిలో ఒక రకమైన గౌరవ భావము కల్గినది. రాకుమార్తెలు ఇద్దరు కూడా బాగా చదువుకున్నవారు వారికి ఇంతకాలముగా కొన్ని సందేహాలు ఉన్నాయట ఇంతవరకు వారికి సరైన సమాధానము దొరకలేదని నాతో అన్నారు. మిమ్మల్ని కలసి తమ సందేహములను నివృత్తి చేసుకుందామని ఆలోచనలో ఉన్నారు. నాతో ఈ విషయము ప్రస్తావించగా నేను మీతో మాట్లాడి

వారికి కబురు చేస్తానని అన్నాను. మీరు మీ అభిప్రాయము తెలిపినట్లయితే నేను రాకుమార్తెలకు విషయము తెలుపుతామనగా సోదరులిద్దరు మాకు ఉదయము సాయంత్రము ధ్యానాన్ని, ప్రార్థనలు చేసుకొనవలసి ఉంటుంది అది కాక సాయంకాలము ధర్మశాలలో సామాన్య ప్రజల కష్టసుఖాలు విని తగిన సలహాలు ఇస్తుంటాము కనుక మధ్యాహ్నము భోజనము తరువాత వారికి వీలుంటే సమావేవము ఏర్పాటు చేయగలరు. అనగా మంత్రిగారు రాకుమార్తెలతో చర్చించి తమకు కబురు చేస్తానని అన్నారు. అంత వారు ప్రధానమంత్రి దగ్గర సెలవు తీసుకొని వెళ్ళిపోయినారు, రెండు రోజుల తరువాత మంత్రిగారు సోదరులకు కబురు చేసి రాకుమార్తెలు ఆ సమయానికి సిద్దముగా ఉంటామన్నారని రేపటి నుండి సమావేశాన్ని ఏర్పాటు చేసినారని వివరించగా పర్ణి సోదరులు సరే అన్నారు.

మరుసటి రోజు సోదరులిద్దరు రాకుమార్తెలతో సమావేశము కాగా ముందుగా పెద్ద కుమార్తె కలవకుంతల నాకు పెద్దగా సందేహాలు లేవు ఇవి చాలా చిన్నవే కాని సమాధానము నాకు సంతృప్తికరముగా ఉండడము లేదు అనగా సోదరులు వారి సందేహము అడుగుమనగా కలవకుంతల కవిత్వానికి సాహిత్యానికి గల నిర్వచనము ఏమి బేధము ఏమి?

ఒక కవి తన స్వంత భావాలతో చెప్పిన పదాల కలయికను కవిత్వము అంటారు. ఒకే సంఘటనను సమస్యను కవులందరు ఒకే కోణములో ఆలోచించరు. వారి వారి స్వభావాలను బట్టి తమ అనుభవాన్ని బట్టి తమ భావాలను వ్యక్తము చేస్తారు. ప్రతి కవి అభిప్రాయము పదాల కలయిక భావాల భేదము వేరు వేరుగా ఉంటుంది. దాన్నే కవిత్వము అంటారు ఉదాహరణకు ఒక రాజ్య సభలో సంధ్యను వర్ణించమని ఒక సమస్య ఇచ్చారని అనుకుందాము ఒక కవి సంధ్యను ఇలా వర్ణిస్తాడు సూర్యుడు పశ్చిమ కొండలలో మునిగి పోయే సమయమే సంధ్య అని ఇంకొక కవి గోవులు పశువులు ఇళ్ళకు చేరే సమయమే సంధ్య అని,



మరొకరు పక్షులు కిలకిలరావాలతో తమగూటికి చేరుకుంటాయని, మరొకరు సంధ్య కాగానే మన్మధుడు యువతి యువకుల హృదయాలలో ప్రవేశించడము మొదలు పెడ్తాడని ఇలా తమకు తోచిన విధముగా తమ ఆలోచనలకు అనుగుణంగా వర్ణిస్తారు. అదే కవిత్వము సాహిత్యము అనగా కొంత కాలముగా ఎన్నో విషయాల గూర్చి సంపుటము వ్రాసిన వివిధ కవుల కవిత్వమే సాహిత్యము. ఇది దేశ కాల పరిస్థితులను ఆర్థిక సామాజిక పరిస్థితులను చెప్పేదిగా ఉంటుంది ఇదే సాహిత్యము.

ఇక నా రెండవ ప్రశ్న హోమానికి యజ్ఞానికి తేడా ఏమిటి అనగా అన్నగారు అయిన సుఖపర్ణి హోమము అనగా చిన్న చిన్న కార్యక్రమములలో ఉద్వాసనకు, వివాహ సమయములో కొంత తక్కువ సమయములో కొన్ని మంత్రములతో నిర్వహించునది హోమము, యజ్ఞము అనగా ఒక దేవ దేవునికి కొలవడానికి 3,4 రోజులు వారం రోజుల వివిధ కార్యక్రమముల ద్వారా జరిపే క్రతువే యజ్ఞము. ఉదాహరణకు యజ్ఞములో ముందు అగ్ని ఉత్పన్నము చేయడంతో మొదలు అవుతుంది ఒక ప్రత్యేకమైన కర్రరోలు రోకలి తయారు చేసి తిప్పడము ద్వారా అగ్నిని ప్రజ్వలింప చేయడం అలా ప్రభవించిన అగ్నిని యజ్ఞ కుండములో వేసి ప్రజ్వలింప చేసి నేతితో ఆహుతినివ్వడం తరువాత ఆ దేవదేవుని గూర్చి యజ్ఞము చేస్తున్న వారిని సంతృప్తిపరచడం ఇలా ఒరోజు ఒక్కొక్క కార్యక్రమము ఒక నిర్దిష్టపద్ధతి ద్వారా చేయడము యజ్ఞము అంటారు. పెద్ద కుమార్తె తాను సమాధానములతో సంతుష్టి అయినట్లు చెప్పగానే రెండవ కుమార్తె సంపంగి హాసిని తనకు గల సందేమాలను ఇలా వ్యక్తము చేయసాగినది. స్త్రీలకు ఉపనయనము ఎందుకు చేయరు, స్త్రీలు ఓంకారము పలుకవద్దని ఎందుకు అంటారు స్త్రీలు గాయత్రి మంత్రము అనకూడదని ఎందుకు అంటారు, అనగా తమ్ముడైన ముఖపర్ణి ఇలా సమాధానము చెప్పసాగినాడు. వేదాలు శాస్త్రాలలోను బాలురకు బాలికలకు ఉపనయనము చేయమని నిర్దేశించబడినది. ఉపనయనములో

ముఖ్యముగా యజ్ఞోపవీత ధారణము ముఖ్యమైన ఘంట్టము. యజ్ఞోపవితానికి కొన్ని పరిమాణాలు ఉంటాయి యజ్ఞోపవీతము పొడువ 64 బెత్తెలు ఉండాలని కన్నె పిల్లలు నేసిన దారముతోనే యజ్ఞోపవీతము తయారు చేయాలని యజ్ఞోపవీతములు ముఖ్యముగా మూడు పోగులు ఉండాలని మరల ఒకపోగు తొమ్మిది చొప్పున సన్నని దారాలు ఉంటాయి. 3 పోగులలో మొత్తముగా తొమ్మిది దారాలు ఉంటాయి ఇవి 27 నక్షత్రాలకు సంకేతములు. మూడు పోగుల విషయములో 3 రకాల అభిప్రాయాలు ఉన్నాయి. ఒకటి మూడు పోగులు సాత్విక, రాజస తామస గుణాలకు నిర్వచనమని రెండవది అవి త్రిమూర్తులకు ప్రతీకయని వ్యక్తి మాతృఋణము, పితృఋణము గురు ఋణములను కలిగి ఉంటాడు ఇక రంగుల బేదము కూడా ఉండునని బ్రాహ్మణ శూద్రులు తెలుపురంగు దారాన్ని క్షత్రీయులు ఎరుపురంగు దారాన్ని వైశ్యులు పసుపు రంగు దారానితో తయారు చేసిన యజ్ఞోపవీతము ధరించాలని మలమూత్ర విసర్జన సమయములో యజ్ఞోపవీతము చెవికి చుట్టుకోవాలని ఎందుకనగా విసర్జన అంగాలకు సంబంధించిన నరాలు తలనుండి వెలుడి చెవి దగ్గర నుండి పోతాయి కనుక చెవికి చుట్టడము వలన విసర్జన సమయాన సంబంధించిన నరాలు ఉత్తేజపడి విసర్జన ప్రక్రియ సులభమవుతుందని, యజ్ఞోపవీతానికి బ్రహ్మముడి ఉంటుందని పూర్వము ఋషులు, మునులు బ్రహ్మ ముడిని ఇలా తయారు చేసారంటే ముడి వేసిన తరువాత దారాల కొనలు బయటకు కనపడవు. ఇదే బ్రహ్మముడిలో విశేషత. ఇకపోతే మరల అడిగిన ప్రశ్నలో రెండవ భాగము స్త్రీలు ఓంకారము మరియు గాయత్రి మంత్రము నిషేధము ఎందుకు మీరు తెలుసుకోవలసి ఉంది 'ఓం' కారము 'అ' 'ఉ' 'మ' అను మూడు అక్షరముల కలియు దాన్ని త్రికరం అని కూడ అంటారు. ఓంకారము ఒకటి రెండుసార్లు అన్నను అది శరీరముపైన మనస్సుపైన ప్రభావము చూపుతుంది. 'ఓం' కారాన్ని ప్రణవము అని కూడా 'ఓం' కారము ధ్వని మొదలు పెట్టినపుడు అది



ముందుగా బొడ్డు దగ్గరి నుండి మొదలై క్రమముగా పైకి వచ్చి పెదవుల వద్ద అంతము అవుతుంది. స్త్రీలకు 'ఓం'కారము ఎందుకు నిశిద్ధము అంటే బొడ్డు క్రింద భాగములో స్త్రీలకు గర్భాశయము అనగా గర్భసంచి ఉంటుంది. 'ఓం' కారము పలికి నపుడు గర్భాశయముపైన ఒత్తిడి కలుగుతుంది. అది ఒక్కొక్కసారి గర్భాశయములోన భౌతికమైన మార్పులు కలిగే అవకాశము ఉంటుందని, యుక్త వయస్సులో ఉన్న వారు గర్భధారణకు సరియైన వయస్సులో ఉన్నవారు గర్భధారణకు ఆటంకము ఏర్పడే అవకాశము ఉంటుంది. పెద్ద వయస్సు స్త్రీలు వారిలో సంతానము పొందే శక్తి కోల్పోయినను గర్భాశయము ఉంటుంది దాని ఆరోగ్య పరిస్థితిలో మార్పు కలిగే అవకాశము ఉంటుంది. కనుక స్త్రీలకు 'ఓం' కారము నిశిద్ధము అన్నారు. ఇది శారీరక ఆరోగ్య పరిస్థితి కారణమే కాని అంతకు మించి ఇతర కారణాలు ఏమియును లేవు గ్రహించవలెను. ఇక పోతే ప్రజలలో కొంత మంది గాయత్రిమంత్రము స్త్రీలకు ఎందుకు నిశిద్ధము అన్నారు గాయత్రిమాత కూడా స్త్రీ ఏ కదా? మరి ఈ నిశిద్ధము ఎందువలన? ఇందుకు కారణము చాలా సులభముగా చెప్పవచ్చును. గాయత్రి మంత్రము మూడురకాలుగా అనేవారు ఉన్నారు. 1 ముందు 'ఓం' కారముతో మొదలవుతుంది, 2. గాయత్రి మంత్రములో రెండు సార్లు 'ఓం' కారము పలుకబడుతుంది. 3. ఇక మూడు ఓంకారము ముందు మధ్యలో తరువాత చివరికి పలుకబడుతుంది. పైన చెప్పిన కారణములతోనే గర్భాశయ ఆరోగ్యరీత్యా గాయత్రి మంత్రము స్త్రీలు పలుకకూడదు సాధన చేయకూడదు అన్నారు. అంతకు తప్ప వేరే కారణములు లేవు. ఇలా చెప్పగానే సంపంగి హాసిని కూడా తనకు సరైన సమాధానము దొరికినదని అనుకున్నది. ఇక చర్చ ముగించుకొని తమ నివాసానికి వెళ్ళినారు. ఇలా రెండు మూడుసార్లు రాకుమర్తెలు సోదరులిద్దరితోను సమావేశమై తమ సందేహాలను తీర్చుకున్నారు.

సుఖపర్ణి ముఖపర్ణి సోదరులు కొంతకాలముగా శ్రీ మహాలక్ష్మీ దేవిని గూర్చి ధ్యానము చేసి లక్ష్మీదేవి కటాక్షమునకు పాత్రులైనారు. తరువాత ప్రతిరోజు సాయంకాలము యధావిధిగా రాజధర్మశాలలో ప్రజలను కలసి వారి ఇతర సమస్యలనే కాకుండా వారి కర్మ అనుసారము ఎంత వరకు వారిపై లక్ష్మీకటాక్షము ఉన్నది వాళ్ళకు చెప్పి అందుకు అనుసరించవలసిన విధానాలను మార్గాలను వారికి సూచించ సాగినారు. అనతి కాలములోనే వారి సలహాలను పాటించి ప్రజలు తమ తమ సమస్యలకు పరిష్కార మార్గాలు కనుకొని లాభపడసాగినారు. ఇది ప్రయాగ నగరములోనే కాకుండ చట్టుప్రక్కల ప్రదేశాలకు వారి రోజువారిగా వారిని దర్శించుకొనే జనుల సంఖ్య పెరగసాగినది. ఇది ఇటు ప్రధానమంత్రి కూడా ఈ విషయాన్ని గమనించి రాజుగారికిని అప్పుడు రాజకుటుంబానికి తెలియజేయ సాగినారు. ఇక రాజకుమారుడు కూడా పూర్తి స్వస్థత చేకూరి యుద్ధవిద్యలు, గుర్రపుస్వారి, కత్తియుద్ధము ముష్టిఘాత యుద్ధములో కూడా మెళుకువలు నేర్చుకున్నాడు. పాలన విధులను ఆర్థిక పద్ధతులను రాజ్యములో ఉన్న గురువుల ద్వారా తెలిసికొని తన తెలివితేటలతో అందరి పొగడ్తలకు పాత్రుడు అవుతున్నాడు. రాచకుటుంబములో ఒక మార్పు వచ్చినది, పర్ణిసోదరుల ప్రతిభ వ్యవహారాలను తాము వారితో చర్చగాని తమ సమస్యలకు సమాధానములు తెలుసుకున్న తరువాత రాజకుమార్తెలు, పర్ణి సోదరులతో ఉద్యావనములో వారిని కలుసుకొనే ఆలోచనను తమ చెలులు ద్వారా వారికి తెలిపినారు. రాచకన్యలు పర్ణి సోదరులను ఏదో ఒక విషయము మీద మరి కొన్నిసార్లు ఏ కారణము లేకుండానే వారిని కలుసుకొని కొంత సమయము వెచ్చించి వారితో గడిపేవారు. రాచకన్యలిద్దరు పర్ణిసోదరుల అంగసౌష్ఠవానికి వారి ముఖ వర్చస్సుకు, వారి వద్దగల విద్యను గమనించి తమలో గల ఆకర్షణను, ప్రేమను అక్కా చెల్లెళ్ళు ఒకరితో ఒకరు ముచ్చటించుకొన సాగినారు. వారి ప్రేమను ఎవరి ద్వారా పర్ణిసోదరులకు తెలియపరచాలో తెలియక సతమతపడ



సాగినారు. చివరకు తమ తల్లిగారి దగ్గర తమ ప్రేమ విషయాన్ని తెలియపరచి ఆమెనే తమకు సహాయము చేయమని కోరాలని నిర్ణయించుకున్నారు.

ఒకరోజు మధ్యాహ్న భోజనాది కార్యక్రమాలు ముగిసిన తరువాత మహారాణి వారిని కలిసే ఉద్దేశము ఉందని తెలిపరిచినారు. మహారాణిగారి అనుమతి పొంది రాజకన్యలిద్దరు అమ్మగారితో ఇలా చెప్పసాగినారు. అమ్మగారు మేము చాలా రోజుల నుండి మీతో మాకుగల ఒక సమస్యను గూర్చి తమకు విన్నవించి తమ సహాయముతో ఈ సమస్యకు పరిష్కార మార్గము పొందుదామనే ఆలోచనతో తమరిని కలువవలెనని వచ్చినాము. అనగా రాణివారు సరే మీ సమస్య చెప్పండి తరువాత పరిష్కార మార్గము గూర్చి ఆలోచిద్దాము. అవసరము అనుకుంటే శ్రీ మహారాజా వారి సలహాను కూడా పొందుదాము. అనగా రాచకన్యలిద్దరు ముందు మా సమస్యను వినండి ఆలోచించండి తరువాత సావకాశముగా తమ నిర్ణయాన్ని తెలుపండి, ఆ తరువాత శ్రీ మహారాజావారి సలహాను తీసుకుందాము అని అనగా మహారాణి వారు సరే ముందు మీ సమస్యను చెప్పండి అన్నారు. అప్పుడు సోదరీమణులిద్దరు ఇలా రాణిగారితో చెప్పసాగినారు. కొంత కాలముగా మేము పర్ణిసోదరులను కలిసి వారితో మా సందేహాలను వెలిబుచ్చి సమాధానములను పొందుతున్నాము. తరువాత మాకు ఏమి సందేహములు లేక పోయినను ఏదో ఒక మిషతో వారిని కలుసుకుంటున్నాము. మేము రాకుమార్తెలము కనుక మేము కబురు చేయగానే వారి వీలును బట్టి కలియుచున్నాము. ఈ కార్యక్రమము మేము మన ఉద్యానవనములో తరచుగా కలసి ప్రకృతి, పూలను చెట్లను, ఆకాశ సౌందర్యాన్ని గూర్చి వర్ణించమని కోరినాము. కోరుతు ఇలా అనేక సందర్భములలో వారితో గడిపినాము. ఈ విధి విధానములో మేము ఇద్దరము వారి పట్ల ఆకర్షితులమైనాము. వారిద్దరు అందముగా, దృఢముగా స్ఫురద్రపులుగా ఉంటారు ఏ విధమైన వికారాలకు లోను కారు లొంగరు

ఎంతో వినయముగా ఆప్యాయముగా మాట్లాడుతారు. ఈ విధముగా కాలము గడిచిన కొలది మా ఆకర్షణ ప్రేమగా మారింది. ఇది మా ఇద్దరి ఏక పక్ష ప్రేమ. వారు మా పట్ల రాకుమార్తెలమనే భావముతోనే ఉన్నారు. కాని ఒక్కసారి కూడా మావైపు ప్రేమతో గాని ఆప్యాయముతో కాని మమ్మల్ని చూడగానే వారి కళ్ళలోను ఏదైన మెరుపు గాని వారి ముఖములో, ముఖ హావభావములో ఏదైన సంతోషము కనిపిస్తుందేమోనని మేము తరచుగా వారి వైపు చూచేవారము. వారు సహజంగానే ఉంటున్నారు తప్ప ఏ విదమైన భావన వారిలో కనపడటము లేదు. అందువలన వారి పట్ల ఆకర్షణ ప్రేమ భావము రోజు రోజుకు ఎక్కువ అవుతున్నది. మా ప్రేమను ఎలా వ్యక్తము చేయాలో మాకు తెలియడం లేదు. దానితో మేమిద్దము కొంత చింతాక్రాంతులమై ఉంటున్నాము. మాసమస్య తీరే మార్గము తెలియక మిమ్మల్ని ఆశ్రయించినాము. అనగా రాణిగారు ముందు నాకు ఒక సందేహము ఉంది. అది మీరు ముందు తీర్చండి. తరువాత నేను మీ సమస్యను గూర్చి ఆలోచిస్తాను. నా సందేహము ఏమిటంటే వారు ఇద్దరు మీరు ఇద్దరు మీరు ఎవరు ఎవరిని ప్రేమిస్తున్నారు. అది మీరు మాకు సవిస్తారముగా తెలుపండి. అనగా రాకుమార్తెలు మీ సందేహము సహజం అని సంపంగి హాసినని ఇలా అనసాగింది. వారు ఇద్దరు కవలలు అయినను సహజముగా సుఖపర్ణి పెద్దవాడు గనుక ముఖపర్ణి చిన్నవాడుగను మొదటి రోజు పరిచయములోనే ప్రధానమంత్రిగారు తెలిపినారు. తసహజంగానే మా మనస్సులో కూడా అదే విధముగా స్పందించినాము. అక్కగారు పెద్దవాడైన సుఖపర్ణిని నేను చిన్నవాడైన రెండవ వాడైన ముఖపర్ణి పట్ల సహజముగానే ఆకర్షితులమైనాము. అక్కగారు కూడా ఎందుకిలా జరిగిందో తెలియదు కాని మాకు ఇద్దరి మనస్సులు సమాన్యముగానే సహజంగానే ఇలా స్పందించిన తరువాత మేమిద్దరము చర్చించుకొని మా నిర్ణియాలను దృఢపరచుకున్నాము. అక్కగారు సహజంగా సుఖపర్ణి గారి వాక్కు భాషా



నడవడి పట్ల ఆకర్షితులైనారు. నేను కూడా ముఖపర్ణి గారి పట్ల ఆకర్షితురాలని అయినాను. మేము ఇద్దరము వారితో జరిగిన సమావేశము తరువాత అక్కగారు సుఖపర్ణిని పొగిడేవారు ఆ సంగతి నాకు చెప్పారు. నేను మనస్సులోనే ముఖపర్ణిగారి వివరణలతో సంతృప్తి చెందేదాన్ని అది కాకతాళీయమో ఏమో తెలియదు కాని అక్కగారి సందేహాలను సుఖపర్ణిగారే తీర్చేవారు. నా సందేహాలను ప్రశ్నలను సమాధానాలుగా ముఖపర్ణిగారు తీర్చేవారు. ఇలా ఎన్నోసార్లు మా మధ్య జరిగిన కార్యక్రమాల ద్వారా రోజు రోజుకు మాలో ఈ విధమైన ఆకర్షణ పెరుగుతూ వచ్చినది. మేమిద్దరము కొన్నిసార్లు కార్యక్రమాల తరువాత మాలో మేము చర్చించుకొని మా ఆకర్షణను ఒకరినొకరు తెలుపుకున్నాము. మా సందేహాలను కూడా నివృత్తి చేసుకున్నాము. ఒకసారి మా ఆకర్షణ ఎవరి పట్ల ఉన్నది మాకు సహజ సిద్దముగా తెలిసిన తరువాత ఇక అది ప్రేమగా మారడానికి ఎక్కువ సమయము పట్టలేదు. ఇక మేము ఒక సంపూర్ణ నిర్ణయానికి వచ్చి ఇద్దరము చర్చించుకొని తమ సహాయము కోరాలని అనుకొని వచ్చినాము. అప్పుడు మహారాణి గారు ఇలా అన్నారు ఇద్దరు కొంత వరకు ఇది కొంత వరకు నయము ఇద్దరు కూడా ఒకరిపైన ప్రేమ కల్గి ఉంటే సమస్య జఠిలముగా అయ్యేది. ఇప్పుడు ఆ ఆలోచన అవసరము లేదు కాని ఇందులోను ఒక సమస్య లేకపోలేదు. ఇద్దరు అందగాళ్ళు, తెలివి పరులు సహజముగానే ఇతరులకు సహాయము చేద్దామనే మనఃస్తత్వము కలవారు అది కూడా ఎవరు అడుగకుండానే అర్థించకుండానే సహాయము చేసే బుద్ధికలవారు. అంతే కాకుండా వాళ్ళు ఇద్దరు బ్రాహ్మణులు మనము క్షత్రియులము. ఈ కాలములో కుల వ్యవస్థ అంతగా ప్రాతినిత్యము కలిగినది కాదు. కనుక ఇది అంతగా కష్టముగా లేదు. ముఖ్యముగా బ్రాహ్మణ యువకులు ఏక కాలములో ఏ కులకన్యలైన వివాహము చేసుకొనవచ్చును. అలాగే క్షత్రియరాజులు కూడా ఎవరో బ్రాహ్మణ కన్యలను వివాహమాడినారు కనుక ఇది సమస్యగా ఉండబోదు.

మీ సంగతి మహారాజవారికి విన్నవించుతాను. మనము నలుగురము తరువాత ప్రధానమంత్రి గారితో కలిసి ఏదన్న నిర్ణయము తీసుకుందాము. ఇందులో ముఖ్యముగా మహారాజావారి అభిప్రాయమే ఎక్కువ ప్రాధాన్యత కలిగి ఉంటుంది. కనుక ముందు నేను మహారాజా వారికి విన్నవించ వలసి ఉంటుంది. మహారాజా వారు వారి రాచకార్యాల నుండి తీరిక లేదు కాబట్టి తరువాత సమయము దొరికినప్పుడు వారితో మన సమావేశము ఏర్పాటు చేస్తాను ప్రధానమంత్రి గారిని కూడా ఆ సమయానికి రమ్మని చెప్తాను. అనగా రాకుమార్తెలు మేము మా సమస్యను గూర్చి సవిస్తరముగా తెలియచేసినాము తరువాత రాకుమార్తెలు తమ కక్షలోకి వెళ్ళి నారు. రాకుమార్తెలిద్దరు తమ కక్షలోనికి వెళ్ళిన తరువాత ఇద్దరు తమ ప్రేమను గూర్చి చర్చించుకొనసాగినారు. తాము పర్ణి సోదరుల పట్ల క్రమ క్రమముగా ఎలా ఆకర్షితులైనది. తమ హృదయాల నిండా తమ ప్రేమ ఎలా నిండిపోయినది, తాము తమకు తాముగా పర్ణి సోదరులకు తమ ప్రేమను వ్యక్తము చేస్తే ఎలా ఉంటుంది. వారు ఏ విధముగా స్పందిస్తారు ఈ ఆలోచనే చాలా ఆనందముగా సంతృప్తికరముగా ఉన్నది వారు తమపట్ల ఏ అభిప్రాయము ఉన్నది. ఒక్కసారి కూడా మాటలతోను, చేతలతోను, చూపులతోను, కొంచెము కూడా వ్యక్తము కాలేదు. అనగా కలవకుంతల నేను అనుకునేది ఏమంటే వారిని మనము రాజకుమార్తెలమనే ఒక బలమైన అభిప్రాయము ఉంది దానిని వారు దాటి బయటకు రాలేకపోతున్నారు. చదువు ధ్యానము, సాధన తప్ప ఇంతవరకు వారి జీవితములో ఇంకా ఇతరముల గూర్చి ఆలోచించలేదు. స్త్రీ పురుషుల ఆకర్షణ గూర్చి వారికి ఆలోచన ఉన్నట్లు లేదు. కనుక ఆ కారణములతో ఆలోచిస్తే తప్ప మనము మాటి మాటికి వారితో సమావేశము ఎందకు ఏర్పాటు చేసుకున్నాము అనే కోణములో వారు ఆలోచించనే లేదు. మన సందేహాలను తీర్చుకొనే వరకు వారి దృష్టిలో



ఉన్నారు. అవి సంపంగి హాసిని అక్కగారు మనము రేపు ఉద్యాన వనములో మరల ఒకసారి వారితో కలవడానికి ప్రయత్నిద్దాము. నేను వారికి కొన్ని సమస్యలు అడిగి వారికి ప్రేమ తత్వాన్ని గూర్చి ఆలోచించే విధముగా వారి మనస్సును త్రిప్పుతాను. తమరు నిశ్చింతగా ఉండండి. అనగా ఏం చేస్తావే అని అక్కగారు అడుగగా నా ప్రణాళికకు ఇంక తుది రూపము రాలేదు. ఇప్పుడే ఆలోచన వచ్చినది దానికి పూర్తి రూపము ఇచ్చి రేపు అమలుపరుస్తాను అనగా అక్కగారు అలాగే అన్నది.

రెండవ రోజు వారు ఉద్యానవనములో సమావేశము అయిన తరువాత సంపంగి హాసినని సుఖపర్ణి సోదరులతో ఇలా అనసాగినది ఈ మధ్య కాలములో మన సమావేశము ఉద్యానవనములో నేను ఏర్పాటు చేస్తున్నాను దాని గూర్చి మీరు ఎప్పుడైన ఆలోచించినారా అనగా ముఖపర్ణి ఈ విషయము మేము ఆలోచించలేదు. మన సమావేశానికి ఒక స్థలము కావాలి మీరు ఉద్యానవనాన్ని ఎంచుకున్నారని అనుకున్నాము అనగా సంపంగి హాసిని అన్నది మేము ఎప్పుడు రాజభవనములోనే ఉంటాము ఏ కార్యక్రమము జరిగిన రాజభవనములోనే జరుగుతాయి. అవే పరిసరాలు, అవే భవనాలు చూసి అందుకు భిన్నంగా ఉద్యానవనములో సహజ వాతావరణములో చర్చించుకుంటే బాగుంటుందని అనుకున్నాము. కనుక సమావేశములు ఈ మధ్య ఉద్యానవనములో సూచించినాము. అనగా పర్ణి సోదరులు మేము సామాన్యులము రకరకాల వాతావరణానికి పరిస్థితులకు అలవాటు పడి ఉంటాము. మీరు రాచకన్యలు రాచమర్యాదలు దాటి పోలేరు ఇది ఒకందుకు కొంత మార్పు ఉంటుంది కాబట్టి బాగుంటుందని నేను అనుకుంటున్నాను. అనగా కలవకుంతల మేము ఇన్నిసార్లు చర్చించినప్పుడల్లా మీరు మీ జ్ఞానవిజ్ఞానముతో జవాబులు ఇచ్చి మా సందేహాలు సంతృప్తికరముగా తీర్చినారు. మీరు మీ వృత్తము నుండి బయటపడి ఏ విధమైన చర్చగాని మామూలు విషయాల మీద కాని మాతో మాట్లాడలేదు. ఈ రోజు మేము మీతో ఇష్టాగోష్ఠిగా

మాట్లాడాలని అనుకుంటున్నాము. మా అభిప్రాయము ఏమంటే మీరు ప్రేమ ఆప్యాయత దగ్గరితనము గూర్చి పరస్పర ఆకర్షణ గూర్చి ఏమైన ఆలోచిస్తే మీ అభిప్రాయములను తెలుపగలరు. అప్పుడు ముఖపర్ణి ప్రేమ అనగా ఇది ఎన్నో రకాలు తల్లిదండ్రుల పట్ల ప్రేమ, సోదరసోదరీమణుల మీద ప్రేమ, అన్నదమ్ముల మధ్య ప్రేమ, బంధువుల మధ్య ప్రేమ, మనవారిపైన ప్రేమ, జంతువుల పట్ల ప్రేమ, భార్యాభర్తల మధ్య ప్రేమ. యువతి యువకుల మధ్య ప్రేమ, వారు చేస్తున్న పని పట్ల ప్రేమ, ఇరుగు పొరుగువారిపై ప్రేమ, గురుశిష్యుల మధ్య ప్రేమ, భగవంతునికి భక్తునికి మధ్య ప్రేమ ఇలా చెప్తు పోతుంటే ఇంకా పెద్ద చిట్ట అవుతంది వాటిని అవగాహన చేసుకోవడం చాలా కష్టము. కష్ట సాధ్యము ఇలా ఎన్ని చెప్పిన తీరదు. అనగా సంపంగి హాసిని అయితే ప్రేమ పట్ల ఇంత అవగాహన ఉంది మీరు చెప్పిన సంగతులు మాకే తెలియవు. అనగా సుఖపర్ణి ఇవన్నీ ఇన్ని రకాల ప్రేమలు కొన్ని సందర్భానుసారంగా కొన్ని పరిస్థితుల కారణంగా కొన్ని అవసరాల దృష్ట్యా, కొన్ని పరిస్థితుల దృష్ట్యా ఉత్పన్నమవుతాయి. సహజముగా ప్రేరణ లేకుండా పరిస్థితుల ప్రభావము లేకుండా కలిగేది ఆకర్షణ అది యువత మధ్య ప్రేమ, దీనికి కారణము కారణాలు అంటూ ఉండవు వయస్సు, ఆకర్షణ ముఖ్యకారణాలు దేశ కాలపరిస్థితులు మరే విధమైన కారణాలు వాటికి అతీతంగా కలిగేది యువతీ యువకుల మధ్య ఆకర్షణ అది క్రమముగా ప్రేమగా మారే అవకాశము ఉంది. కొన్నిసార్లు మొదటి చూపులోనే ప్రేమ కలిగే పరిస్థితి ఉత్పన్నము అయ్యే అవకాశము ఉంటుంది. ఇలా అనగానే సంపంగి హాసిని ఇంతవరకు మీరు రకరకాల శాస్త్రాల అధ్యయనాలు మొదలైన వాటి గూర్చే మాట్లాడేవారు. ఈ రోజు మీరు ప్రేమ గూర్చి అందులో రకాల గూర్చి మాట్లాడడము మమ్మల్ని ఆశ్చర్యచకితులను చేసింది. మీ మనస్సులో ప్రతి విషయమలోను ఎంతో అవగాహన ఉంది అందుకు మేము చాలా సంతోషిస్తున్నాము. ఇలా చర్చ కొనసాగుతుండాలని



అనుకున్నారు అంతలో ఒక దాసి వచ్చి మహారాణిగారు రాకుమార్తెలను జ్ఞాపకము చేస్తున్నారని తెలుపగా రాజకన్యలిద్దరు పర్ణి సోదరుల వద్ద సెలవు తీసుకొని రాణి గారిని కలువడానికి వెళ్ళినారు. తరువాత అక్కా చెల్లెళ్ళిద్దరు అంతకు ముందు రోజు జరిగిన ప్రేమ చర్చ గూర్చి సింహావలోకమనము చేసుకున్నారు వారిద్దరికి పర్ణి సోదరులపట్ల గల ప్రేమ మరి ఎక్కువ అయినది. సోదరీ మణులిద్దరు రోజురోజుకు తమ ప్రేమ పెరుగుతూ ఉండడము అనుభవించ సాగారు. వీరు మహారాణజ గారిని కలవడానికి వెళ్ళినప్పుడు మహారాణి గారు వేరొక కార్యక్రమము కొరకు పోయి ఉండడము వలన మహారాణి వారిని కలిసే అవకాశము కలుగలేదు. అక్కా చెల్లెలిద్దరు మరుసటిరోజు తమను ఉద్యానవనములో కలువ వలసినదని పర్ణి సోదరులకు సందేశము పంపినారు.

ఉద్యానవనములో సమావేశము మామూలుగా మొదలైన తరువాత సౌందర్య చర్చ మొదలు పెడ్తు క్రిందటి రోజు మీరు ప్రేమ గూర్చి ఎంతో అవగాహన తెలిపినారు దాని వలన అడుగకుండానే మా సందేహాలు పటాపంచలు అయినాయి. ఇక ఏ విధమైన ప్రశ్నలకు తావు లేదు, అయితే మేమిద్దరము మిమ్మల్ని ఎందుకు కలవాలనుకున్నామంటే మీ గూర్చి కొన్ని స్వంత అభిప్రాయాలను తెలుసుకుందామని తమ అనుమతి కోరుతున్నాము. అనగా సోదరులిద్దరు ముక్త కంఠముతో అడగండి ఇందుకు ఆజ్ఞ అవసరము లేదు. అనగా కలవకుంతల మీరు ఎవరినైన ప్రేమించినారా? అనగా ముఖపర్ణి మేము అన్నదమ్ములము ఎంతో ప్రేమతో ఆప్యాయముతో ఉంటున్నాము మా మధ్య ఇంత వరకు ఏ విధమైన రహస్యాలు లేవు. రాత్రి పడుకునేముందు ఆరోజు జరిగిన కార్యక్రమాల గూర్చి ఆలోచిస్తాము. ఇద్దరము నిర్భయముగా ఏ విధమైన దాపరికము లేకుండా మా స్వంత అభిప్రాయాలు కూడా చర్చించుకుంటాము. ఇంతవరకు జీవితములో జరిగిన విషయాలను చూడగా మేము ఎవరిని ప్రేమించలేదు. విషయము తెలిసిన ఇంతవరకు ఆ కోణములో

ఆలోచించలేదు. అటువంటి సంఘటనలు కూడా సందర్భాలు కూడా మా జీవితంలో జరుగలేదు. అనగా అక్కాచెల్లెళ్ళిద్దరు సంతోషముతో ఊపిరి పీల్చుకున్నారు. మరల చెల్లెలు సంపంగి హాసిని ఇలా అన్నది పోని మిమ్మలిన ఎవరైన ప్రేమించినారా మీకు ఏమైన అనుమానము కాని, అనుభవము కాని కల్గినదా! అనగా సుఖపర్ణి మనను ఎవరైన ప్రేమించినది ఎలా తెలుస్తుంది వారి మాటలు నాకు భాషా, హావభావాల ద్వారా వ్యక్తము చేస్తే తప్ప ఎదుటి వారికి విషయము ఎలా తెలుస్తుంది. ఇక పరస్పర ఆకర్షణ ఒక మార్గము. అది మొదటి చూపులోనే కలుగ వచ్చును లేదా కొంత సహవాసముతో ఒకరిపై నొకరు ఆకర్షించబడి ప్రేమ కలిగే అవకాశము కూడా ఉంది. ఇంత వరకు అలాంటి సంఘటన మా జీవితాలలో జరుగలేదు. ఇక ఈ వేళకు చర్చచాలు మేము రాజ ధర్మశాలకు వెళ్ళి సామాన్య ప్రజల సంగతులు వినే సమయము అయినది. మీరు మరొక రోజు అవకాశము తీసుకొనిన మిగతా విషయాలు చర్చించుకుందాము అని అన్నదమ్ములిద్దరు సెలవు తీసుకొని వెళ్ళిపోయినారు. రాచ కన్యలు కూడా తమ నివాసానికి వెళ్ళి సమావేశ పూర్వపరాల గూర్చి చర్చించుకున్నారు.

మరి రెండు రోజుల తరువాత వారికి రాణివారి ని కలవమని కబురు అందగా వారు రాణివాసము వారి కక్షకు చేరుకున్నారు అక్కడ వారికి రాణివారు, మహారాజావారు, ప్రధానమంత్రి గారు సమావేశమై కనిపించారు. వీరు ప్రవేశించిన తరువాత మహారాజావారు తమ కూతుళ్ళనుద్దేశించి ఇలా అన్నారు. మహారాణిగారు మీ ప్రస్తావన, ఆలోచన గూర్చి మాకు తెలియపరచినారు. మేము ముగ్గురము ఇంతకు ముందే విషయాన్ని చర్చించుకొని ఆ తరువాత ఒక నిర్ణయానికి వచ్చినాము. మీరు ప్రేమిస్తున్నది సామాన్య మానవులను కాదు. వారు ఇద్దరు ప్రత్యేక అర్హతలు కలవారు. రాణవారన్నట్లు వారు క్షత్రియులు కారు కాని వారిలో ఆచరణ చతురత ఉంది క్షత్రియ విద్యలు రాకపోవచ్చును కాని వారికి



ఉన్న పాండిత్యము అర్హతలు ఎంతో ఉదాత్తమైనవి. తలచుకుంటే జనాలందరిని ఒకే త్రాటిపై నడిపే నేర్పు వారిలో ఉన్నది. ప్రధానమంత్రి గారు కూడా ఇదే అభిప్రాయముతో ఉన్నారు. వారు రాచకుటుంబానికి చేసిన సేవ అమోఘము అందుకు సందేహము లేదు. కొన్ని సంవత్సరాలుగా ఇక కోలుకోడనుకున్న రాజకుమారుని మామూలు మనిషిగా చేయడము, ఎందరో ప్రయత్నించి విఫలురు అయిన సంగతి మనకందరికి తెలుసును ఈ విషయములో ఎవరికిని ఎటువంటి సందేహము లేదు. అదీ కాకుండా తీర్చే ప్రయత్నము కూడా చేస్తున్నారు. ఇది ఇంకా మహత్తర కార్యము కనుక మేమందరము మీ ప్రేమను ఆమోదించు చున్నాము. కాని రాణివారు చెప్పినదేమిటంటే వారికి మీ ప్రేమ విషయము తెలియదు ప్రేమంతా మీ వైపు నుండే కాని వారి నుండి ఎటువంటి స్పందన లేదని మీరు కూడ మీ ప్రేమను వారి ముందు వ్యక్తము చేయలేదని అన్నారు. అయితే ఈ విషయము వారికి తెలిసేది ఎట్లు? మరి వారి అభిప్రాయము మనకు కాని మీకు కాని తెలిసేది ఎలా? ఇదే మేము ఇంతకు ముందు చర్చించుకున్నాము. అనగా రాకుమార్తెలు మావైపునుండి మా ప్రేమను వ్యక్తము చేయడానికి కొన్ని రోజులుగా ప్రయత్నము చేస్తున్నాము కాని వారు ఈ విషయము పట్టించుకున్నట్లు కాని, పట్టునట్లు కాని లేదు. ఎన్నో విషయాలలో వారికి సముచిత అవగాహన ఉన్నది. కాని వారు మమ్మల్ని ఎలా అర్థము చేసుకున్నది లేనిది తెలియదు అనిపిస్తున్నది. అనగా ప్రధానమంత్రిగారు మహారాజా నేను ఈ విషయము వారికి తెలిపి వారి అభిప్రాయము తెలుసుకుంటాను, ఎందుకనగా రాకుమార్తెలు కొంత ప్రయత్నము చేసినామని అన్నారు కాని వారి నుండి స్పందన లేదని అన్నారు. మీరు కాని రాణివారు కాని వారిని స్వతఃగా అడగడము మంచిదికాదు. ఇక మిగిలింది. నేను ఒకటి రెండు రోజులలో వారిని కలిసి రాచకన్యల ప్రేమ సమాచారము వారికి తెలిపే అవకాశాన్ని కలిపిస్తాను. తరువాత

వారి అభిప్రాయము తెలిసికొనే ప్రయత్నము చేస్తాను. వారు కొంత సమయము అడుగవచ్చును రాకుమార్తెలతో సమావేశము కోరవచ్చును. ఈ విషయము మీకు విన్నవించుతాను. అయితే మన అందరి అభిప్రాయము ఏమంటే పర్ణిసోదరులతో రాచకన్యల వివాహనికి మన అభ్యంతరాలు లేనట్లే కదా! రాకుమారుల వారి అభిప్రాయము కూడా తెలుసుకొనే అవసరము ఏమైనా ఉన్నదా? అనగా రాజావారు వివాహము పట్ల అందరము సముఖముగానే ఉన్నాము. మరి ఏకాభిప్రాయముతో ఉన్నాము ఇందులో సందేహము లేదు. మరి పర్ణి సోదరుల అభిప్రాయమే ముఖ్యము అది తెలిసికోమనే నా సలహా అనగా మంత్రిగారు ఇది వారికి తెలపడములో రెండు అభిప్రాయాలు నాకు తోచుచున్నది. ఒకటి రాచకన్యలు వారిని ప్రేమిస్తున్నారు. కనుక రాచకన్యలతో రాజావారు వారి వివాహము జరిపే ఆలోచనలో ఉన్నారని రెండవది రాజకన్యలు వారిని ప్రేమిస్తున్నారు అది వారు వ్యక్తము చేసినను వీరి నుండి అనగా పర్ణిసోదరుల నుండి ఏ విధమైన స్పందన లేక పోయినది. రాచకన్యల ప్రేమపై వారు ఏ విధముగా ఆలోచన చేసేది తెలుపమని. ఇలా రెండు మార్గాల ద్వారా వారి అభిప్రాయము తెలిసికొనవలసి ఉంటుంది. మరి మహారాజవారు నాకు ఏ విధమైన మార్గాన్ని అనుసరించమని ఆజ్ఞ ఇస్తారు? అనగా అందరు ఆలోచనలలో మునిగి పోయారు. కొంత తడవు తరువాత మహారాజవారు మనము ఏ మార్గాన్ని అనుసరించినను చివరి మజిలి వివాహము. అయితే వారు కూడ రాజకన్యల ప్రేమను అంగీకరిస్తే అది మానసిక స్పందన అవుతుంది లేదా రాజావారు వివాహము జరుపాలనే ఆలోచనలో ఉన్నారంటే అది ఒక రకముగా నిరంకుశత్వము అవుతుంది. కనుక వారికి రాచకన్యల పట్ల ప్రేమ ఉన్నది తెలుసుకోవడమే. మంచిది ముఖ్యముగా ఇలా రాజావారు అభిప్రాయమును వ్యక్తపరచినారు. అప్పుడు ప్రధానమంత్రిగారు పర్ణిసోదరులను రాచకుమార్తెలు ఎన్నోసార్లు



సమావేశము అయినారు. రాజ మందిరములోను, ఉద్యానవనములోను, రకరకాల విషయాలను అడిగినారు. ఒక ప్రేమను గూర్చి తప్ప, ఇన్నిసార్లు సమావేశము అయిన తరువాత ప్రేమను గూర్చి కాకపోయినను రాకుమార్తెల పట్ల ఎంతో కొంత ఏదో ఒక అభిప్రాయము స్పందన వారికి కలిగి ఉంటుందని నేను భావిస్తున్నాను. అప్పుడు మంత్రిగారు రాచకన్యలనుద్దేశించి మీరు మరొక మారు పర్ణి సోదరులతో సమావేశమై ఆకర్షణకు ప్రేమకు గల నిర్వచనము ఏమి? భేదము ఏమి పరస్పర సంబంధము ఏమి? ఒకదానిపై మరొకటి ఏ విధముగానైన ఆధారపడి ఉన్నాయా అని అడగండి, మీరు మీకు తెలియకుండానే మీ ప్రేమను శారీరక స్పందనతో తెలియపరుస్తారు. మీకు తెలియ కుండానే జరుగుతుంది. ఈ విషయములో వారి అభిప్రాయము ఆలోచన వారు చెప్పినది తెలిసికొని నాకు చెప్పండి. తరువాత విషయము మీరు సానుకూలముగా అయ్యే విధముగా నేను చూస్తాను. అని మంత్రిగారు అనగా అలాగేనని అన్నారు అందరు సమావేశము ముగించినారు.

ప్రధానమంత్రిగారు చెప్పినట్లుగా రాకుమర్తెలు పర్ణిసోదరులకు కబురు పంపి వారితో సమావేశానికి సమయము కావాలని కోరగా రెండు రోజుల తరువాత కలుద్దామని జవాబు అందినది. రెండు రోజుల అనంతరము ఉద్యానవనములో నలుగురు సమావేశము కాగానే మొదలు సంపంగి హాసిని పర్ణి సోదరులతో మాటి మాటికి రమ్మని మిమ్మల్ని ఇబ్బంది పెట్టడము లేదు కదా! అలాంటిదేమి లేదు అని జవాబు వచ్చినది. మీ సమస్యలకు, సందేహాలకు సమాధానాలు ఇవ్వడములో మాకు కూడ కొంత సంతృప్తి కలుగుతుంది. రాజ్యసభలో ధర్మశాలలో, వారి సమస్యలు విని వాటికి పరిష్కార మార్గాలు చూపడంలోనే మాకు సరిపోతుంది. మీతో గడిపే సమయము అందుకు భిన్నముగా ఉంటుంది. మీకు సమాధానలు చెబుతుండడం వలన మా బుద్ధికి కూడా కొంత పదును

పెట్టినట్లుంటుంది. ఇందు వలన మాకు ఏ సమస్య లేదు. బాధయును లేదు. ఒక రకంగా మాకు కూడ కొంత ఆహ్లాదకరంగా అనిపిస్తున్నది. చెప్పండి ఈ రోజు మీకు ఎలా గడిచినది.వ మమ్మల్ని ఎందుకు జ్ఞాపకము చేసినారు. మాకు కబురు అందినది కాని నిన్న కొంచెము తీరిక లేక పోవడం వలన ఈ రోజు వస్తామని అన్నాము. ఇక చెప్పండి ఈ రోజు మీ సందేహాలు సమస్యలు ఏమిటి? అంత కలువకుంతల సమస్య గాని, సందేహాలు గాని ఏమి లేవు ఒక విషయములో కొంత వివరణ అవసరము అనిపించినది. అది ఏమిటంటే ఆకర్షణకు ప్రేమకు నిర్వచనము ఏమిటి? వారి సారూప్యము ఏమిటి? భేదము ఏమిటి? ఇవి రెండు ఆప్యాయతకు భిన్నముగా ఉంటాయా? సమానముగా ఉంటాయా? ఒకదాని కొకటి సంబంధము లేకుండ ఉంటాయా? ఇదే మాకు కలిగిన సందేహము మాకు మీరు తప్ప మా సమస్యలు తీర్చేవారు లేరు. కనుక మిమ్మల్ని ఆశ్రయించ వలసి వచ్చింది. అనగా సుఖపర్ణి ఇలా వివరణ ఇవ్వసాగినాడు ఆకర్షణ అనునది ఒకరిలో మరొకరిపట్ల ఏదో గుణములో కాని, సౌందర్యములో కాని, నడవడికలో కాని, ఒకరిలో నొకరు ఒకే అభిప్రాయము కల్గిన అది ఆకర్షణతో మొదలవుతుంది. ఆకర్షణ, ఆప్యాయత, ప్రేమ, అనేవి దగ్గర దగ్గర సంబంధాలు కల పదాలు, కొంత సంబంధ బాంధవ్యాల భేదములు మనస్సును స్పందించునవి. ఆకర్షణతో మొదలైన పరస్పర స్పందన ప్రేమతో కూడ కలిసి వచ్చిన ప్రేమలో పడవచ్చును. ఇది సామాన్యముగా యుక్త వయస్సులో ఉన్న ఆడ మొగ వ్యక్తుల మధ్య ఏర్పడడానికి ఎక్కువ అవకాశము ఉంటుంది. ఈ పరస్పర ఆకర్షణ ప్రేమ కొన్నిసార్లు ఒకవైపు నుండే ఉండే అవకాశము కూడ ఉంటుంది మరొక సంగతి ఏమంటే ప్రేమను వ్యక్తము చేయడం కూడ కొంచెం కష్టం అవుతుంది. ఎదుటి వ్యక్తి స్పందన ఎలా ఉంటుందో తెలియపోవచ్చును. అనుకొన్నట్లుగా స్పందన రాని ఎడల నిరాశ నిస్పృహలకు చోటు కలిగే అవకాశము కూడ ఉంటుంది. కనుక యువతి



యువకులు ప్రేమను వ్యక్తము చేయడానికి ఎంతో సంకోచిస్తారు. ప్రేమ సఫలమునకై కన్న కల విఫలము అవుతుందనే భయము ఎక్కువగా ఉంటుంది. ఒక అనురాగము ప్రేమ అనేవి రెండు పర్యాయ పదాలు. రెండు పదాలకు అంతగా భేదము లేదు. కాని ఆప్యాయత మాత్రము వేరు. ఇది ముఖ్యముగా తల్లిపిల్లల మధ్య ఉంటుంది. ఇదీ విషయము మీకు మా సమాధానాలు సంతృప్తి కలిగించినవో లేదో తెలియదు. కాని మాకు తెలిసిన వివరణ ఇదే. అనగా సంపంగి హాసిని మరియు కలువకుంతలు ఇలా అన్నారు మేము మాకు కలిగిన అన్ని విషయాలపై అడుగగానే ఆ విషయములపై మీకు కలిగిన అవగాహ ఎంతో గొప్పగా ఉంది. మేము ఎంతో సంతృప్తిని పొందుతాము. అది కాకుండా ఇన్ని విషయాలు ఇంతగా మాకు తెలిపేవారు ఎవరున్నారు? కనుకనే మిమ్మల్ని మాటి మాటికి పిలిచి చిన్న పెద్ద విషయాలనైన అడిగి తెలుసుకుంటున్నాము. మీకు మా ధన్యవాదములు, కృతజ్ఞతలు ఇంతకన్న ఏమనాలో తెలియదు. పర్ణిసోదరులు సమాధానాలు చెప్పే సమయములో కొంత మార్పును గమనించినారు. వారి కళ్ళలో ఇదివరకులా కాకుండా నిర్లిప్తముగా ఉండే చూపులలో ఒక రకమైన మార్పును అక్కాచెల్లెళ్ళు గమనించినారు.

రెండు రోజుల అనంతరము ప్రధానమంత్రికి విషయము వివరముగా వివరించినారు. అంత ప్రధానమంత్రి ఇక సంగతి నాకు వదలండి మీరు మాత్రము వారిద్దరిని ప్రేమిస్తున్నారు వారు కూడా మిమ్మల్ని ప్రేమిస్తున్నది లేనిది తెలియదు. కాని మీ పట్ల ఆకర్షితులవుతున్నారు. ఎందుకనగా మీరు పిలిచినంతనే వారు వస్తున్నారు. అదే మనకు సమస్యకు సరైన సమాధానము. రెండు రోజుల తరువాత మంత్రిగారు పర్ణిసోదరులకు కబురు చేయగా వారు రాగానే మనము కొంత ఏకాంతమున మాట్లాడుకుందాము అని సేవకులను పరివారమును పంపించి వేసినారు. ఇప్పుడు నేను మీకు చెప్తున్న విషయమును జాగ్రత్తగా వినండి.

రాజకుమార్తెలు ఇద్దరు మీ ప్రేమలో పడ్డారు ఆ విషయము నాతో అన్నారు. వారికి మీతో ఎలా వారి ప్రేమను గూర్చి తెలుపాలో తెలియడం లేదు. మీరు వారిని ఇన్నిసార్లు ఏదో మిషాపై కలుస్తున్నారు. వారి హావభావాలతో చూపులతో వారిని మీ పట్ల గల ప్రేమను వ్యక్తము చేసినను మీరు గమనించలేదు. మగవారైన మీవైపు నుండి ఏ విధమైన స్పందన లేకపోవడం వలన వారు నన్ను ఆశ్రయించి తమకు మీ పట్ల గల ప్రేమను నా వద్ద వ్యక్తము చేసినారు. మీరు కొంచెము కూడ వారిపట్ల ఆకర్షితులనైట్లు అనిపించలేదా! అనగా సుఖపర్ణి, ముఖపర్ణి సోదరులు మంత్రిగారు మేము కొన్ని రోజులుగా రాచకుమార్తెలు మాపై చూపుతున్న వ్యవహారము గమనిస్తున్నాము మావైపు నుండి స్పందన లేదని వారు మీకు చెప్పినట్లున్నారు. వారు ముందు మమ్మల్ని రాజమందిరములో కలిసేవారు. ఈ మధ్యన ఉద్యానవనములో కలుస్తున్నారు. అప్పుడే మాకు కూడ వారి పట్ల అనురాగము ప్రేమ ఉత్పన్నమైనది. అయితే మావైపు నుండి మేము ఏ ప్రస్తావన చేయకపోవడం కాని చూపుల ద్వారా, శారీరక కదలికల ద్వారా వ్యక్తము చేయకపోవడానికి రెండు కారణాలు ఉన్నాయి. ఒకటి ఇది మిథముగా వారు మమ్మల్ని ఇష్టపడుతున్నారని స్పష్టముగా తెలియదు. ఇక రెండవది కారణము వారు రాచకన్యలు మేము సామాన్య బ్రాహ్మణులము, రాజావారి కొలవులో పని చేస్తున్నవారము, ఒకవేళ మేము బయటపడితే వారు కాదనుకుంటే మేము దండనకు పాత్రులు అవుతాము. అందుకు మేము సిద్దముగా లేము ఇది విషయము. రాకుమార్తెలు చాలా అందగత్తెలు, తెలివిపరులు మా పట్ల ఇంత ప్రేమను పెంచుకున్నారంటే మేము ఎంతో అదృష్టవంతులము. మరొక కారణము ఏమంటే సామన్యముగా సంప్రదాయము ప్రకారము రాచకుటుంబీకులు మరొక రాజకుటుంబముతో వివాహము చేసుకుంటారు. మేము క్షత్రియులము కూడా కాదు రాచకుటుంబము నుండి కూడ వచ్చినవారము కాదు. అందువలన మేము మా భావాలను వ్యక్తము చేయలేక పోయినాము.



అనగా ప్రధానమంతిగారు నేను వారితో ఈ విషయము ప్రస్తావించినాను. ఇప్పుడు వ్యవస్థ అంత పటిష్ఠముగా లేదు. మామూలుగా బ్రాహ్మణులు ఏ కులము కన్యలనైన పెండ్లాడవచ్చును. మీరు ఎంతో దృఢముగా అందముగా ఉంటారు. యుద్ధ విద్యలు నేర్చినవారు వారికి అంతగా అవసరము లేదు. రాజకుమారునికి స్వస్థత చేకూర్చి రాజకుమారుడు అన్ని విధాలుగ ఆ రాజ్యాన్ని ఏలే క్షమతను అందించినారు. మీ సేవాభావము కూడా చాలా గొప్పది. అందువలననే రాచకన్యలు మీ పట్ల ఆకర్షితులై ప్రేమించినారు. ఇంకా నాకు కలిగిన సందేహమును కూడా వారు తీర్చినారు. కుమారి కలువకుంతల సుఖపర్ణిని, సంపంగి హాసిని ముఖపర్ణిని ప్రేమిస్తున్నారు. ఇందులోను ఏమి సమస్య కలగకుండ వారు సునాయాసముగా మీ పట్ల ఆకర్షితులై సహజ న్యాయము కూడా నష్టము కాకుండా చేసినారు. మీరు కూడా వారి పట్ల ప్రేమతో ఉన్నారు కనుక ఈ విషయము వారితో తెలిపిన తరువాత రాచకుటుంబముతో సమావేశమై విషయము తెలుపుతాను. మీరు ఒక విధముగా అదృష్టవంతులు. మీకు నా అభినందనలు. అని వారిని సాగనంపినారు. తరువాత ఆతృతతో ఉన్న రాచకన్యలను కలిసి విషయము వివరించి పర్ణిసోదరులు కూడ వారి పట్ల ప్రేమతో ఉన్నారని తెలిపి తొందరలో రాచకుటుంబముతో సమావేశము ఏర్పాటు చేసి ప్రస్తావన తెలుపుతారని చెప్పినారు. అక్కాచెలెళ్ళిద్దరు ఎంతో ఆనందపడి తమ ప్రియులను ఎప్పుడు ఏకాంతముగా కలుద్దామని ఎదురుచూడ సాగినారు.

మరి రెండు రోజుల తరువాత పర్ణిసోదరులు ఉద్యానవనమునకు విచ్చేసి అందముగా తమ ప్రియురాళ్లవైపు ప్రేమతో చూడసాగినారు. అంత సుఖపర్ణి తమ్మునితో ఇప్పుడు మనము ఇదివరకు లాగా రాచకన్యలను కలిసికొనలేము. మన ప్రియురాళ్ళతో ఏకాంతముగా మాట్లాడుకొన వలసి ఉంటుంది. అంత ముఖపర్ణి ముందు మన

ప్రియురాళ్ళ అభిప్రాయము తెలసికొని తరువాత నిర్ణయించుకుందాము. అని ఇద్దరు రాచకన్యల దగ్గరకు వెళ్ళినారు. అంత వరకు ముచ్చటిస్తున్న రాచకన్యలు వీరిని చూసి ఒక్కసారి నిశబ్దముగా అయిపోయినారు. తమ కండ్లలో ప్రేమ నింపుకొని వారివైపు చూడసాగినారు. కొన్ని క్షణాలు ఎవరు ఏమి మాట్లాడకుండా కండ్లలోకి చూస్తు మాత్రమే గడిపినారు. ఎవరు ముందు మాట్లాడాలో తెలియక తికమర పడసాగినారు. అంత ముఖపర్ణి రాచకన్యలు ఉద్దేశించి మీరు మా కొరకు చాలా సమయము నుండి వేచి చూస్తున్నారా? అనగా కలువకుంతల ఎక్కువ కాలము ఏమి గడవలేదు. ఎదురు చూడడములో ఇంత ఆనందము మేము ఎప్పుడు అనుభవించలేదు. అనగా ముఖపర్ణి ఇప్పుడు మనము గుంపుగా కాకుండా వేరు వేరుగా గడుపుదాము. ఇంత వరకు శాస్త్రార్థ చర్చలే కాని మనః స్పందన విషయాలు మాట్లాడుకొనలేదు. ఇప్పుడు మనము విడివిడిగా కలుసుకొని మన మనస్సులోని భావాలను తెలుపుకందాము. అనగా కలువకుంతల సుఖపర్ణి వద్దకు వచ్చి తరువాత వారిద్దరు కొంచెము దూరముగా నున్న ఒక మరుగు ప్రదేశానికి వెళ్ళినారు. అంత ముఖఫర్ణి సంపంగి హాసిని వద్దకు చేరి ప్రక్కన కూర్చుని తదేకముగా ఆమె కండ్లలోనికి చూడసాగినాడు. రాచకన్య కూడా తన ప్రియుని కండ్లలోనికి చూస్తూ తన ప్రేమను వ్యక్తపరచసాగినది. మీరు ఇన్ని రోజుల నుండి ఇన్నిసార్లు కలుసుకున్నారు కదా! ఒక్కసారి కూడా నా కండ్లలోకి చూసి నా ప్రేమను గ్రహించలేకపోయినారు అని నిష్ఠూరముగా పలికినది. రాజకుమారి గారు, నాకు తెలుసు మీరు నాపట్ల ఎంతో ప్రేమ కలిగి ఉన్నారని అది నేను మీకు వ్యక్తము చేయకపోవడానికి రకరకాల కారణాలు ఉన్నాయి ఇవ్వన్ని మీకు తెలియనిది కాదు. ఒకటి మేము క్షత్రియులము కాము. మాకు యుద్ధవిద్యలు తెలియవు రెండవది. మూడు మేము పరాయి కుటుంబము నుండి వచ్చినవారము సమాజ పరంగా మనకు చాలా వ్యత్యాసములు ఉన్నాయి. అందువలన సాహిసించలేక పోయినాము. అంత సంపంగి



హాసిని మీరు ఇన్ని చదువులు, శాస్త్రాలు చదివినారు కదా? ప్రేమలకు విలువుల అంతస్థులు ఉండవని దేవుళ్ళు దైత్యకుల కన్యలకు, మానవ కన్యలను పరస్పరము ప్రేమించుకున్నారు కదా! మరి మీరు అలా ఎందుకు ఆలోచించలేదు. ప్రధానమంత్రి మధ్యత్వము ద్వారా మన ప్రేమను వ్యక్తము చేసుకొనవలసి వచ్చినది. అదే స్వంతముగా తెలుపకుంటే ఆ ఆనందము వేరుగా ఉండేది. అది నిజమే కాని కొందరి జీవితాలు కొన్ని సందర్భాలలో, కొన్ని సంఘటనలు అవి వ్యక్తమవుతాయి. మన విషయములో కూడా అదే జరిగినది అని అనుకుందాము. ప్రధానమంత్రి చనువు వలన విషయము తెలిసినది కదా! అంత సంపంగి హాసిని ముందు మీ పాండిత్యము రెండు మీరు ప్రతి చిన్న విషయాన్ని కూడా స్పష్టముగా కూలంకషంగా తెలిసే విధంగా వివరిస్తారు. మూడు శారీరక నిర్మాణము, మీ హుందాతనము నాల్గవది ఇవన్ని ఒక్కటొకటిగా నన్ను మీ ప్రేమ ఆకర్షింప చేసినది. ప్రతిసారి మీరు చెప్పిన విషయాలనే ఇంటికి వెళ్ళిన తరువాత ఎన్నో సార్లు మననము చేసుకొనేదాన్ని. మీరు మాట్లాడిన ప్రతి పదము గుర్తు పెట్టుకొని మరల మరల అనుకొని మురిసిపోయే దాన్ని. ఇలా మీ వైపు నా ఆకర్షణ అనురాగంగా తరువాత ప్రేమగా మార్పు చెందినది. అది సరే నా పట్ల మీకు ప్రత్యేకముగా తోచినది అనగా ముఖపర్ణి రాకుమార్తెతో స్త్రీకి ముందు కావల్సినది అందము, తరువాత వర్తమాన విషయాల పట్ల అవగాహన ఇవన్ని నన్ను మీ వైపు లాక్కున్నవి. అని ముఖపర్ణి రాకుమారి సంపంగి హాసిని దగ్గరకు జరిగి ఆమె చేతిని తన చేతిలోనికి తీసుకున్నాడు. ఇద్దరు కూడా ఆ మొదట కల్గిన ఆ స్పర్ష సుఖాన్ని ఎంతో అనురాగంగా కల్గుతున్నట్లుగా అనుభవించసాగినారు. ఒకరి కండ్లలోకి ఒకరు చూస్తు తమ ప్రేమను వ్యక్తము చేసుకొన సాగినారు. ఇద్దరు కూడ లోకాన్ని మరచి పోయినారు. తమ తమ ఉద్వేగాలను అందులోని ఆనందాన్ని అనుభవించసాగినారు. అటు కలువకుంతల మరియు సుఖపర్ణి పరిస్థితి కూడ ఇలాగే ఉంది. నలుగురికి సమయము

తెలియడము లేదు నోట్లో నుంచి ఎలాంటి మాట రావడం లేదు. చూపులతోనే తమ ప్రేమను నిరంతరముగా వ్యక్తము చేయసాగినారు.

కొంత కాలము తరువాత మంత్రిగారు, మహారాజవారు, రాణిగారు రాకుమారునితో కలిసి రాచకన్యల ప్రేమ వ్యవహారము చర్చించి వారి వివాహానికి ప్రతిపాదనలు ఎలా ఉండాలో చర్చించాలని అనుకున్నారు. రాజకుటుంబములోని అందరు ఈ విషయాన్ని కులంకషంగా చర్చించి తమ అంగీకారాల సుముఖతను వ్యక్తము చేసినారు. మహారాజ వారు ప్రధానమంత్రి గారికి ఆ వ్యవహారాన్ని గూర్చి తగిన అధికారములను ఇచ్చినారు. అనతి కాలములోనే కలువ కుంతలకు సుఖపర్ణికి, సంపంగి హాసినికి, ముఖపర్ణి, కలువకుంతలకు వివాహము జరిగినది. కాశి రాజుగారిని వరుల తల్లిదండ్రడులను ఆహ్వానించి వారికి తగిన సౌకర్యములను ఏర్పర్చి వివాహము అట్టాహాసముగా నిర్వహించినారు. రాచకన్యలు ఇద్దరు వివాహానంతరము స్వర్గసుఖాలను అనుభవించసాగినారు.

పర్ణిసోదరులిద్దరు వివాహానంతరము కూడా తగినంత కాలము శ్రీ మహావిష్ణువు, లక్ష్మి దేవిని గూర్చి తపమాచరించసాగినారు.

**సుందర వదన, సౌందర్య నిలయా**
**పద్మహస్త, పద్మనయని, పద్మహాసిని పద్మప్రియ**
**చంద్రామృత సోదరి, శ్వేతాంబరధరీ**
**చంచూ, చంద్రవదని, చంద్ర సహోదరి**
**హేమధన అధిపతి పద్మ సింహాసిని**
**శ్రీహరికి విశ్రాంతి నొసగే గాన**
**విశ్వమాత, వివ్వచలన కారిణి**
**ప్రేమ సంసారము మొదలగు**



**కోరికలకు మూలకారిణి**
**జగానా క్షణ విశ్రాంతి లేని దానివి**
**మాతా లక్ష్మీదేవి పాహిమామ్ పాహిమామ్**
**రక్షమామ్, రక్షమామ్**

ఇలా లక్ష్మీదేవిని రకరకాలుగా స్తోత్రము చేసి లక్ష్మీదేవి కటాక్ష పాత్రులైరి.

ఇది ఇలా ఉండగా రాజవైద్యులు రాజ్యములోని ఇతర వైద్యులు సామంత పాలకులు మహారాజాగారికి ఇచ్చిన సమాచారము ఏమిటంటే గత కొన్ని నెలలుగా రాజ్యములోని మామూలు ప్రజలు జనాలు నిః సత్తువగా ఏదో తెలియని అనారోగ్యముతో బాద పడుచున్నారు. దానికి కారణము ఇంతవరకు అంతు పట్టడము లేదు. ప్రజలందరు శారీరకంగా ఏదో సన్నని తెలియని రుగ్మతలు బాధ పడుచున్నారు. ఎన్ని విధాలుగా, ఎన్ని రకాలుగా ఎన్నో విధానాల ద్వారా చికిత్సలు చేసిన ఫలితము కనపడడము లేదు. ఇది ఒక మహామ్మారిలా దేశమంతా వ్యాపించి పోయినది. ఇది ఒక సర్వవ్యాప్తమైన వ్యాధిలాగా కనపడుతుచున్నది, అని తెలియగా మహారాజా వారు సభను ఏర్పరిచి విషయము సభాసదులందరికి వివరించినారు. ఇది అంతరంగిక సమస్యకాదు. కనుక మేము దీన్ని సభాముఖముగా తెలిపి ఎవరైన ఏదైన నివారణ ఉపాయము తెలుప వీలు అవుతుందని ఈ రాజ్యసభ యొక్క ముఖ్య ఉద్దేశము. అప్పుడు సభలోని ప్రజలంతా ఇది నిజమే మహారాజా! ప్రజలందరు నిఃసత్తువగా అయిపోతున్నారు. మన రాజ్యములో పంటలకు గాని, తిండికి గాని ఏ విధమైన సమస్య లేదు. తమరు వినాయక మహాయజ్ఞము చేసిన తరువాత దేవమంత సుభిక్షముగానే ఉన్నది. కాని ఈ మధ్యనే ఏదో ఆవహించినది. దేశ ప్రజలంతా దేశమంత ఈ జాడ్యము ప్రబలిపోతున్నది. ఎవరిని అడిగిన తమకు ఏమి చేతకావడము లేదని తొందరగా అలసిపోతున్నామని ఏ

పని కూడా కుదురుగా చేయలేక పోతున్నామని అందరు ఇలా నీరసపడిపోతున్నారు. ఈ జాఢ్యము దేశమంతా దుప్పటి కప్పినట్లుగా అయిపోతున్నది. ఈ విషయములో ఏ విధమైన అవగాహన లేక ప్రజలకు సంగతి తెలియక వారు తమలో తాము చర్చించుకొనడం కూడా లేదు. తమకు ఏమి అవుతున్నది కూడా వారికి అవగాహన కల్గడము లేదు. సంగతులు విషయము తెలిస్తే, ఏదైన నివారణ, చికిత్స ఉపాయములు చేయ వీలవుతుంది. విషయమేమి అంతుపట్టనప్పుడు బాధ తేరే ఉపాయము మార్గము వెతకడము ఎలా వీలు అవుతుంది. సాధ్యము అవుతుంది అని అన్నారు. తరువాత ప్రజలు తమలో తామే సభలో చర్చించుకొనసాగినారు. అంతలో సభలో పాల్గొనిన ఒక వ్యక్తి లేచి నేను విన్న సంగతి మీకు మరియు ఈ సభలో వారందరికి తెలియజేయాలని భావిస్తున్నాను. అనగా మహారాజావారు మీరు చెప్పదలనిచ విషయము ధైర్యముగా చెప్పవచ్చును. సందేహించే అవసరము లేదు. అని మహారాజా వారు ఆశ్వాసన ఇవ్వగా ఆ వ్యక్తి మహారాజా మా తాతగారు చాలా చిన్న వయస్సులో ఉన్నప్పుడు మన రాజ్యములో ఇలాంటి సంఘటన ఒకటి జరిగినదని మా తండ్రిగారు నాకు చెప్పేవారు. అప్పుడు కూడా ఇలాగే ప్రజలందరు తెలియని రుగ్మతతో బాదపడేవారని దానికి పరిష్కార మార్గము తెలియక చాలా రోజులు ప్రజలందరు బాదపడినారని, అప్పుడు ఒక తపస్వి ఈ రాజ్యానికి అనుకోకుండా వచ్చినారని విషయము తెలిసికొని ఈ రాజ్యములో ఒక విపరీతమై శక్తి ఆవహించి ప్రజలకు నిఃసత్తువుగా చేస్తుందని రాజావారికి తెలుపగా రాజావారు దానికి తగిన ఉపాయము మార్గము తెలుపమనగా ఆ తపస్వి ఏదో కార్యక్రమాలు, కార్యకలాపాలు పూజలు పురస్కారాలు చేసి రాజుగారి తోను, రాజ్యములోని ప్రజలందరితోను చేయించి ఆక్రతువు పూర్తయిన రోజున ఈ రాజ్యముపైన ఒక కవచము లాంటిది ఏర్పర్చినాడని దాని వలన ప్రజలందరు పూర్వపు సుఖ సంతోషాలను శక్తిని పొందినారని మా తాతగారు చెప్పినారని మా తండ్రిగారు నాకు తెలిపినారు. అయితే



ఈ కవచనము శాశ్వతమైనది కాదని మరల ఎప్పుడు ఆ కవచము క్షీణించిన అప్పుడు మరల ఇలాంటి జాఢ్యము ఈ రాజ్యములో ప్రబలుతుందని మా తండ్రిగారు నాతో అన్నారు. మరి అది ఎంత వరకు నిజమో కాని ఇప్పుడు మన రాజ్యములోని ప్రజలు అలాంటి రుగ్మతనే అనుభవిస్తున్నారు. అని నేను భావిస్తున్నాను. అనగా మహారాజా వారు ఇంకా ఎవరికైన ఈ విషయము గాని వాటి వివరణలు కాని తెలసిన సభకు తెలపమని అనగా ప్రజలందరు మాకు తెలియదని అన్నారు. అంతలో ప్రధానమంత్రి గారు ఈ వ్యాధి వారి తాతగారి కాలములో జరిగిన విషయమును గూర్చి ఏ విధమైన సమాచారముగాని, వ్రాతకోతలు కాని కలవా?. కాని ఇతను చెబుతున్నది నిజమని నమ్మడానికి ఇప్పుడు మనము మన ప్రజలు అనుభవిస్తున్న విషయమే ప్రత్యక్ష సాక్షము నిదర్శనము. అది ఎంతవరకు నిజమో, నిజము కాదో అని నిజానిజాలను తెలిసికొని సమయము వృధా చేయడానికి అవకాశము లేదు. విరుగుడును గూర్చి ఆలోచించ వలసి ఉంటుంది. ప్రజలందరు నిఃసత్తువులుగా ఉన్నారని తెలసి ఇది మనందరిలోను కూడా వ్యాపించ వచ్చునని సైన్యము లోను కూడా వ్యాపించే అవకాశము ఉండి ఉండవచ్చని నాకు తోచుచున్నది. విషయము తెలిసికున్న శత్రురాజులు మనపై యుద్దానికి వచ్చే అవకాశాలు కూడా ఉన్నాయి మనము త్వరలో ఈ విషయములో చాలా నిక్కచ్చితాభిప్రాయము. కలిగి తగిన ప్రణాళిక చేయవలసి ఉంటుంది. అనగా మహారాజావారు తమ అంగీకారమును తెలిపినారు. అంత మహారాజావారు సభాసదులను, ప్రజలను ఉద్దేశించి, మనకు విషయము అవగాహన అయినది కదా కనుక, ఇప్పుడు మనము దీని నివారణ ఉపాయము సమయము వృధా కాకుండా ప్రయత్నము చేయవలెనని నా అభిప్రాయము. ఇది వరకు ఈ రాజ్యముపై నిర్మించిన కవచము పలుచబడినది అనుకొని మరెవరైన క్రొత్తది ధృఢమైనది అయిన కవచము ఏర్పర్చడము లేదా ఈ సమస్యకు శాశ్వత నివారణ ఉపాయమును

గూర్చి ఆలోచించాలని అన్వేషించాలి. ఇది చాలా గంభీరమైన సంగతి ప్రజలందరు ఏకధాటిగా ఈ విషయము గూర్చి ఆలోచించాలి తెలిసికొనే ప్రయత్నము చేయాలి ఇది రాజ్యప్రజలందరి సమస్య కనుక అందరు ఈ సమస్యను, ఈ విషయాన్ని గంభీరముగా తీసుకొని అదే పనిగా ఆలోచించవలసి ఉంటుంది. అందుకు ఎవరికి తోచిన మార్గము గూర్చివారు ఆలోచించవలసి ఉంటుంది అని రాజావారు అందరికి ఆజ్ఞ ఇచ్చి సభను ముగించినారు.

సభ ముగియగానే మహారాజా వారు ప్రధానమంత్రిని పిలిచి మంత్రిగారు మీరు ఒక అంతరంగిక సమావేశము ఏర్పాటు చేయండి. సభలో మామూలుగా పైకి రాని విషయాలు మనము అక్కడ చర్చించుకొనే వీలు అవుతుంది. అందుకుగాను పర్ణిసోదరులను కూడా ఆహ్వానించండి వారు కూడా చాలా కుశాగ్రబుద్ధి గలవారు. కొంత దైవిక శక్తుల గూర్చి అవగాహన ఉన్నవారు కనుక వారు కూడా ఈ అంతరంగీక సమావేశములో పాల్గొనడము చాలా అవసరము. ఈ సాయంత్రమే ఏర్పాట్లను చూడమని అనగా ప్రధానమంత్రిగారు అలాగే తమ ఆజ్ఞ అని సెలవు తీసుకున్నారు.

కొంత కాలముగా శ్రీ మహాలక్ష్మీదేవి కటాక్షము పొందిన సోదరులు జనబాహుళ్యానికి ఇతోధిక సేవలను అందించసాగినారు, లక్ష్మీపతి అయిన శ్రీ మహావిష్ణువును పూజించి ధ్యానము చేసి తమ ఏకాగ్రత ద్వారా శ్రీ మహావిష్ణువు కటాక్షము కొరకు ప్రయత్నము చేయసాగినారు.

**శాంత స్వరూప, పన్నగశాయి**
**ఉభయ పద్మధర, పద్మనేత్ర**
**యోగ నిద్రతో శక్తిగ్రాహక**
**రజోగుణనాయక, స్థిరత్వప్రసాద**
**శ్రీ వత్సవక్ష కౌస్తుభవక్ష**
**పక్షపాత రహిత లోకేశా**



**శక్తియుక్తులను ప్రసాదించువాడ**
**సూర్య చంద్ర నేత్ర నయన**
**కోరికలను సులభసాధ్యము చేయువాడ**
**పాహిమామ్ పాహిమామ్**
**రక్షమామ్ రక్షమామ్**

అని ఇలా పలుపలు విధములుగా శ్రీ మహావిష్ణువును ధ్యానించసాగారు. ఇలా ధ్యానము చేస్తున్న శ్రీ మహావిష్ణువు కటాక్షము లభించినది లేనిది తెలియక ఇద్దరు సోదరులు ఏకాగ్రతను ధ్యానమును ఇంకా తీవ్రతరము చేయాలని నిర్ణయించుకున్నారు.

## ప్రజల జాడ్య నివారణ

ప్రధానమంత్రి ఆహ్వానము మేరకు సోదరులిద్దరు ఆంతరంగీక సమావేశానికి బయలుదేరి రాజ ప్రసాదము చేరి తమ స్థానాలను గ్రహించినారు. కొంత తడవు తరువాత మహారాజవారు, రాణిగారు, ప్రధానమంత్రి గారు ఇతర ముఖ్యులు అందరు సమావేశమందిరములో ఆసీనులు అయిన తరువాత మహారాజావారి ఆజ్ఞ మేరకు ప్రధానమంత్రి గారు ఇలా విన్నవించసాగినారు. ప్రస్తుతము రాజ్యములో ప్రధానముగా ఒక జాఢ్యము ప్రబలంగా దాని ప్రభావము చూపుచున్నది. ప్రజలందరు నిఃసత్తువ గలవారుగా ఏ పని చేసిన త్వరలో అలసిపోవడము. శక్తి హీనులుగా కావడం, పనిలో ఏకాగ్రత కలుకగ పోవడం లాంటి అంతు తెలియని రుగ్మతతో బాధపడుచున్నారు. ఇది రాజావారి ప్రధాన వైద్యులు, రాజ్యములోని ఇతర వైద్యులు జన బాహుళ్యాన్ని పరిశీలించి ఎంతో సమాచారము సేకరించి రాజావారికి విన్నవించినారు. ఇది ఇంతకు ముందు సభలో ప్రస్తావనకు రాగా సభలో కూడ ప్రజలు కూడా ఇదే భావాన్ని భయాన్ని వ్యక్తము చేసినారు. చర్చ సందర్భముగా ఒక వ్యక్తి తెలియ చేసిన సమాచారాన్ని అందరికి తెలియజేసినారు. అప్పుడు ఒక

మహాత్ముడు ఇది ఒక ప్రబలశక్తి యొక్క ప్రభావమని దానికై యజ్ఞ యాగాదులు పూజలు చేసి రాజ్యముపై ఒక మంత్రకవచము లాంటిది ఏర్పాటు చేసినాడని ఆ కవచము ప్రభావము వలన ఆ ప్రబల దివ్యశక్తి ప్రభావము నుండి రాజ్యప్రజలు విముక్తులవుతారని, కాని ఆ కవచమునకు కాలపరిమితి ఉంటుందని అది ఎంత కాలము ఉంటుందని ఇది మిథముగా చెప్పడము సాధ్యము కాదని అనగా అప్పటి రాజావారు మహాత్ముని పర్యవేక్షణలో యజ్ఞయాగాదులు చేసి కవచ నిర్మాణము చేసినారని ఆదివ్య శక్తి ప్రభావము నిరంతరంగా ఆ కవచముపై ఉందునది. ప్రస్తుతము ఆ కవచ ప్రభావము శక్తి క్షీణించి మరల రాజ్యప్రజలు అదే రకమైన రుగ్మతలతోను వైద్యులకు అంతుపట్టని సమస్యగా చికిత్సకు సాధ్యము కాకుండా అవుతున్నది. విషయము ఎంతపురాతనమైనది అయినను ప్రభావము మొదలు అయినది కనుక ప్రజా సంక్షేమము కొరకు మనము కూడా ప్రయత్నము చేసి కవచాన్ని పునఃనిర్మాణము కావించే విధంగా మనము చేయవలసి ఉంటుంది.

ఇక్కడ ముఖ్యముగా చెప్పవలసిన విషయము ఏమిటంటే మన రాజ్యములో దైవదత్తమైన శక్తులు ఉన్న పర్ణిసోదరులు ఇందుకు ఉపాయము ఆలోచించాలని మహారాజావారి అభిప్రాయము. పర్ణిసోదరుల గూర్చి మీకందరికి తెలిసిన విషయమే. రాజకుమారుల వారి దీర్ఘకాల అస్వస్తతను తమవైదిక శక్తుల ద్వారా వారు స్వస్థత కూర్చిన విషయము మనకందరికి తెలిసినదే. వారు ఏ విధమైన సహాయము కోరుకున్న సామాన్య ప్రజలకు వారి విపత్తుల నుండి సలహాలు ఇవ్వడము రోజువారిగా రాజావారి ధర్మశాలలో వారు చేస్తున్న దినచర్య. వీరే మన ప్రజలను ఈ విపత్తునుండి రక్షించాలని మహారాజా వారే కాదు అందరి అభిప్రాయము అనుకుంటాను. అంతరంగీక సభలో ఉన్న సభాపతులందరు అదే అభిప్రాయమును వ్యక్తపరచినారు.



అంత మహారాజావారు పర్ణిసోదరులను ఉద్దేశించి పర్ణిసోదరులారా! ఈ సభలో నేను స్వయముగా రాజకుటుంబము తరపున రాజ్యప్రజల తరపున ఈ అంతరంగీక సభలో నా ఆహ్వానమును మన్నించి వచ్చినందుకు మీకు ధన్యవాదములు. మీరు ఇద్దరు ఈ రాజ్యానికి రాజకుటుంబానికి చేసిన సేవ అమోఘము మీ శక్తి యుక్తులు, సామర్థ్యము తెలిసి మాకన్న ముందే గ్రహించిన రాజకన్యలిద్దరు మీపై ప్రేమను పెంచుకొని వరించి మిమ్మల్ని వివాహమాడినారు. ఒక క్షణము వివాహానికి ముందు నేను, మీరు రాజవంశస్థులు, క్షత్రియులు కారు అని ఆలోచించినాను. రాచకన్యలు మీ శక్తి 'సామర్థ్యాలను మాకన్న ఎక్కువగా అవగాహన కలిగినవారై మిమ్మల్నే తప్ప వేరేవరినైన వివాహమాడమని లేకుంటే కన్యలుగానే ఉండిపోతామని ఒక రకంగా మాపై ప్రభావము కలిగించినారు. మీరు ఈ రాజ్యానికి జామాతలు అయినందుకు ఎంతో గర్వపడుతున్నాను. రోజు రోజుకు మీరు సామాన్య ప్రజల బాగోగులు చూడడము మా ప్రధానమంత్రిగారు సమయ సమయానికి మాకు విన్నవించుచున్నారు. మేము ఎంతో సంత్రప్తులైనాము.

ప్రజాక్షేమమే ధ్యేయముగా మీరు నిర్వహిస్తున్న మీ కార్యక్రమాలు ఎంతో శ్లాఘనీయం ప్రజలు, రాజ్యము రాచకుటుంబము ముఖ్యముగా రాజకుమారుల వారు మీకు ఎంతో ఋణపడి ఉన్నారు. రాచకన్యలు కూడా మీ పట్ల నీప్రేమతోను, అనురాగము తోను ఉంటున్న విషయము మహారాణి ద్వారా మాకు తెలుస్తూనే ఉన్నది. మిమ్మల్ని భర్తలుగా పొందినందుకు రాచకన్యలు కూడా ఎంతో సంతృప్తిని కలిగి ఉన్నారు. ఇక ప్రస్తుత సమస్య పరస్థితి మీకు కూడా కొంచెము, కొంచెముగా తెలిసే ఉంటుంది. రాచవ్యవహారాలలో మీరు అంతసూక్ష్మముగా, ఆసక్తి చూపపోవడము ఆ విషయాలను మాకే వదలివేయడములో మీ హుందాతనమునకు నిరద్శనము. ఎవరి బరువు భాద్యతలు వారే నిర్వర్తించాలని మీరు అనుకోవడం మీ పట్ల ఇంకా గౌరవము ఏర్పడినది.

ఈ సమావేశములో మిమ్మల్ని ఆహ్వానించడం మీరు విషయము కూలంకషంగా తెలిసికొని ఏదన్న మార్గము కనుగొనగలరని ఇక్కడ ఉన్న సదస్సులందరి ఏకాభిప్రాయము. ప్రధానమంత్రిగారు ఏ విధమైన అవసరసహాయ సహకారాలను పూర్తిగా ఇవ్వవలెనని మాకు విన్నవించి నారు. రాచకుటుంబము రాజ్యప్రజలు అందరు తమరివైపే చూస్తున్నారు. మీరే ఈ సమస్యకు సరైన సమాధానము ఇవ్వగలరని అందరి సాభిప్రాయము. అనగా సభలోని సభ్యులంతా అవునని ముక్త కంఠముతో తమ అభిప్రాయమును వ్యక్త పరచినారు. ఇంకా రాజకన్యలు తమ భర్తల పట్ల ఎంతో ప్రేమను వ్యక్తము చేయడం పర్ణిసోదరులు గమనించినారు.

అంత పర్ణిసోదరులు మహారాజా మాకు ఈ రాజ్యప్రజలు పడుతున్న ఈ రుగ్మత గూర్చి కొంత తెలుసును కాని ఇప్పుడు సరిగా పూర్తిగా తెలిసినది. మేము రాజావారి ధర్మశాలలో ప్రజలకు సేవ చేస్తున్న సంగతి తమరికి కూడా తెలుసును. మేము మా కంత మాకై ఎవరిని పిలిచి వారి విషయాలను కనుగొని వారికి తగిన సలహాలను ఇవ్వము. ప్రజలు ఎవరైన మా వద్దకు వచ్చి తమ కష్టము పరిస్థితి ఇది అని తెలిపితేనే మేము విషయము లోతుగా తెలిసికొని కనుగొని వారికి తగిన సలహాలను సూచనలను మార్గనిర్దేశనము చేస్తాము. ఇంతకు ముందు కూడా రాకుమారుని ఆరోగ్యము పట్ల తమరు సహాయము చేయమని అన్నారు. కాబట్టి మేము మా శక్తి యుక్తులను వారికి ధారపోసి వారు ఆరోగ్యవంతులు అయ్యే విధముగా ప్రయత్నము చేసినాము. ఇప్పుడు కూడా తమరు రాజ్యప్రజల కష్టాలను గూర్చి తెలిపి మమ్ము ఏదైన మార్గము చూడమని అన్నారు. కనుక మేము మా ప్రయత్నము చేస్తాము. మరొక విషయము మనకు ఈ విషయములో పూర్తి నిర్దిష్టమైన సమాచారము లేదు. ఒక వ్యక్తి తన తాతగారు చిన్నప్పుడు ఇలా జరిగినది అని చెప్పితేనే తప్ప మీ దగ్గర కాని ఎవరి దగ్గర కాని ఇంకే విధమైన సమాచారము లేదు. ఇది



ఒక వ్యక్తి చెప్పినదని మాత్రమే. రాజ్యములో ఇందరు ప్రజలున్నారు. ఎవరికి కూడా దీని విషయము తెలియకపోవడం పట్ల కొంత భిన్నాభిప్రాయము కలుగుతుంది. ముందు ఈ సమాచారము ఎంతవరకు నిజమో? అందులో నిజ నిజాలు ఏమిటో తెలిసికొనవలసి ఉంటుంది.. ఇది నిజమని తెలిపే సరైన సమాచారము దొరికితే మన ప్రయత్నము మనము చేయగలుగుతాము. అందుకు తమరు మమ్మల్ని రాజ్యపురాతన గ్రంథాలయము లోనికి ప్రవేశ అనుమతి ప్రసాదించగలరు. అక్కడ ఏదైన ఈ విషయము గూర్చి తెలిపనట్లయితేనే కొంత వివరణకై రాజ్యములో పెద్దవారిని కలిసి ఏదైన కొంత నానుడి ప్రకారము సమాచారము వివరణ దొరుకుతుందేమో ప్రయత్నము చేయవలసి ఉంటుంది. విషయము స్పష్టమైన పిదప నివారణ ఉపాయము గూర్చి ఆలోచించవలసి ఉంటుంది. అనగా మహారాజావారు ప్రధానమంత్రి వైపు చూచి వీరికి కావలసిన ఏర్పాట్లను చూడమని ఆజ్ఞాపించినారు. అంత మహారాజావారు పర్ణిసోదరుల నుద్దేశించి మీరు వీలైనంత త్వరగా సమస్యను పరిష్కరించగలరనని మా నమ్మకము, విశ్వాసము, అందుకు మీకు కావల్సిన సహాయ సహకారాలు ఎల్లప్పుడును తక్షణము అందుబాటులో ఉంటాయి. ఇది మీరు సాధించగలరని ఈ సభలోని వారందరి విశ్వాసము అని మహారాజావారు సభ ముగించినారు.

అంత పర్ణిసోదరులు తమ పత్నులతో కలసి తమ నివాసమునకు బయలు దేరినారు. రాచకన్యలు తమ భర్తలతో మహారాజా వారికి మీ పట్ల ఉన్న విశ్వాసానాకి మాకు మీ పట్ల ఇంకా ఎంతో ప్రేమ ఎక్కువ అయినది మీ శక్తులపై మీ విద్యత్తుపై మాకు కూడ మీపై ప్రేమ అనురాగము, గౌరవము ఎంతో ఎక్కువ అయినది. అని వారు భర్తలవైపు ప్రేమాభిమానాలతో చూడసాగినారు. పర్ణిసో దరులు కూడ తమ భార్యల అనురాగానికి ఎంతో ముగ్దులైనారు.

మరుసటి రోజు పర్ణి సోదరులు రాజ్యముఖ్య గ్రంథాలయమునకు వెళ్ళి గ్రంథాలయ అధికారిని కలిసి తమరాకను గూర్చి వివరించినారు. అంత గ్రంథాలయ ముఖ్య అధికారి వారిని పురాతన గ్రంథ విభాగానికి తీసుకొని వెళ్ళి అక్కడ ఆ విభాగ అధికారికి పరిచయము చేసి వారికి ఇతోధిక సహాయము చేయమని అన్నారు. అంత వారు విభాగ అధికారితో తమకు రాజ్య చరిత్రను గూర్చి తెలిపే గ్రంథాలను చూడాలని ఉందని వాటివైపు తీసుకవెళ్ళమని అనగా, అధికారి పర్ణిసోదరులతో రాజ్య చరిత్రను గూర్చి వ్రాసిన పుస్తకాలు రెండు విభాగములుగా ఉన్నాయని ఒక విభాగములో 50 సంవత్సరాల నుండి ఇప్పటి వరకు జరిగిన వివరాలు విశేషాలు మరియు సంఘటనలను గూర్చి వ్రాసి ఉన్నాయని రెండవ విభాగములో 50 సంవత్సరాలకు పూర్వము పలు విశేషాలు వివరించబడినాయని అయితే అవి దాదాపుగా 100 పుస్తకాలు ఉంటాయని, కాగితాలు కూడ కొంత క్షీణ దశలో ఉన్నాయని చాలా జాగ్రత్తగా వాటిని చూడవలసి ఉంటుందన్నారు. అంత పర్ణిసోదరులు తమకు 50 సంవత్సరాల పూర్వపు గ్రంథాలు కావాలని కొంత శ్రమ అయినాసరే తాము సిద్ధముగా ఉన్నామని అన్నారు. అంత గ్రంథాలయ అధికారి ఒక సేవకుని పిలిచి వీరికి కావల్సిన సహాయము చేయవలసినదని ఆజ్ఞాపించినారు. తాను కూడ వారితో ఉండి ఇతోధిక సహాయము చేయగలనని వివరించినారు. ప్రధానమంత్రి గారు స్వయముగా గ్రంథాలయమునకు విచ్చేసి గ్రంథాలయ సిబ్బందితో తమరు వస్తారని తగిన సహాయము చేయమని ఆదేశించినారని, తమరు నిఃసంకోచముగా తమ పని చేసుకోగలరని చెప్పగా పర్ణి సోదరులు మాకు ఈ విభాగములో కొంత కాలముగా పని చేయుచున్న వ్యక్తి సహాయము అవసరమని అలాంటి వ్యక్తిని తమకు సహాయపడటానికి వినియోగించుమనగా గ్రంథాలయ విభాగ అధికారి ఇప్పుడు మీతో ఉన్న సేవకుడు చాలా కాలంగా ఈ



విభాగములో పని చేస్తున్నాడని పుస్తకాల విషయములో వాటి వివరాలు విషయములో కొంత జ్ఞానము కలిగి ఉన్నాడని అన్నాడు. అంత పర్ణి సోదరులు ఇది చాలా సంతోషము. అని అక్కడ ఉన్న పుస్తకాలను శ్రద్ధగా ఒక్కొకటిగా పరిశీలించసాగారు. రాజ్యములో జరిగిన వివిధ సంఘటనల గూర్చి యుద్ధముల గూర్చి సామాజిక వ్యవస్థను గూర్చి వాటి వివరాలను ఎంతో విస్తారముగా ఆ గ్రంథాలలో నిక్షిప్తము చేయబడినది. అంత పర్ణిసోదరులు ఇలా ఈ వంద పుస్తకాలను సవిస్తరముగా చదవడానికి మనకు చాలా సమయము పడుతుంది కనుక వారు భటుని వైపు తిరిగి రాజావారి తాతగారి హయాములో వ్రాసిన పుస్తకాలను గూర్చి ఆయనకు ఏదైన అవగాహన ఉందా? వాటిని చూపమని అన్నారు. అంత సేవకుడు రెండు సార్లు గ్రంథాలయ అమరికవైపు జాగ్రత్తగా పరిశీలించి ఒక 20 పుస్తకాలను వారి వద్ద బల్లపై ఉంచినాడు. ఇవి ఇప్పటి రాజావారి తాతగారి కాలంలో జరిగిన సంఘటనల గూర్చి వివరాలు ఇందులో పొందుపరచి ఉన్నాయి. ఆ కాలములో కలిగిన సంఘటనలు తెలిసి నేను కొంత శ్రమపడి వాటిని వేరు వేరు భాగాలలో ఉంచినాను. కాని అందులో ఏమి వ్రాసి ఉన్నది మాత్రము నాకు తెలియదు. అనగా అదే ఎంతో సంతోషించతగ్గ విషయము ఈ మాత్రము శ్రమపడి, శ్రద్ధగా పని చేస్తున్న నిన్ను అభినందించక తప్పదు. పర్ణిసోదరులిద్దరు ఆ పుస్తకాల వైపు చూడగా ఒక్కొక్క గ్రంథములో 100కు పైగా కాగితములున్నవి. ఇలా చూడగా ఈ 20 పుస్తకాలను చదివి విషయము గ్రహించడానికి చాలా సమయము పడుతుంది. అనగా సుఖపర్ణి తమ్మునితో అలా కాదు. ప్రతి గ్రంథము మొదట్లో విషయ 'సూచిక తరువాత ఉపోద్ఘాతము చూద్దాము అందులో స్థూలముగా గ్రంథములోని విషయములు పొందుపరచి ఉంటాయి. ఇలా చేస్తే మన పని సులభము యిపోతుంది. మనకు కావల్సిన విషయము ఒకటి రెండు పుస్తకాలలో నిక్షిప్తము అయిందంటే మనకు ఎక్కువ

సమయము పట్టదు అనగా తమకు ఏకాంతము కావలెనని అన్నారు. అంత సేవకుడు అక్కడి నుండి విరమించి తాను దరిదాపులలోనే ఉంటానని అవసరము కలిగినచో కేక వేస్తే వస్తానని అన్నాడు. అంత పర్ణిసోదరులు ఆ 20 గ్రంథాలను వాటి విషయ సూచికలను, ఉపోద్ఘాతములను చదివిసరికే చాలా సమయము గడిచినది. ఏ పుస్తకములోను కూడ స్పష్టీకరణ లేక పోవడం వలన ఏది నిర్ణయించుకొనలేక ఇక ఆరోజుకు పని చాలించి మరుసటి రోజు రావాలని నిర్ణయించుకొని తరువాత తమ నివాసానికి వెళ్ళి నల్గురు కలసి ఆ రోజు జరిగిన సంఘటనల గూర్చి చర్చించుకొనసాగినారు. అంత సంపంగి హాసిని ఇలా అన్నది. మీరు ఈ 20 గ్రంథాలను విషయసూచికలను, ఉపోద్ఘాతాలను సరాసరిగా చూసి ఉంటారు. వివరంగా చదవలేదు అది నా అభిప్రాయము, రేపు మీరు గ్రంథాలయమునకు వెళ్ళినప్పుడు మమ్మల్ని కూడ తీసుకొని వెళితే మీరు ఇద్దరికి బదులుగా నలుగురము శ్రమించగలము దాని వలన కొంత సమయము కలసి వస్తుంది. ఉపోద్ఘాతాలతోను ఏమి వివరించకపోయినను ప్రతి గ్రంథములోను కనీసము మొదటి పేజి చదివితే ఆ గ్రంథములో ఉన్న విషయములో కొంత అవగాహన కలుగుతుంది. ఇలా మొదటి పేజి చదివితే మనకు కావల్సిన సమాచారము ఏ పుస్తకములో ఉన్నది తెలుస్తుంది. అలా కాని ఎడల ప్రతి గ్రంథములోను పద్యాలు ఉంటాయి, ఆ పద్యాలను మొదట్లో సరాసరిగా చూచినను మనకు కావలసిన సమాచారము ఏ పుస్తకములో ఉన్నది అవగతమవుతుంది. అంత పర్ణిసోదరులు తమ భార్యల తెలివికి వారు తెలిపిన విధానాన్ని మెచ్చుకొని ఇద్దరికన్న నలుగురితో పని ఎక్కువ అవుతుంది, సులభము అవుతుంది. మీరు అందములోనే కాదు తెలివి తేటలలో కూడ మాకు ధీటైన వారని గ్రహించుకున్నాము. రేపటి నుండి ఇదే విధముగా పని చేసిన విషయము తెలిసికొనడానికి ఎక్కువ సమయము పట్టదు. విషయము



తెలిస్తే మిగిలిన ప్రయాణము సులభ సాధ్యమవుతుంది అని ఆ రోజుకు విశ్రాంతి తీసుకున్నారు.

మరుసటిరోజు పర్ణిసోదరులు వారి భార్యలతో కలిసి నలుగురు గ్రంథాలయమునకు చేరుకొని గ్రంథాలయ విభాగ అధికారిని కలిసి నిన్నటి పని ఇంకా ముందుకు సాగే విధముగా ప్రయత్నము చేస్తామని తెలుపగా ఆయన వారికి కావల్సిన విభాగానికి తీసుకొని వెళ్ళి ముందురోజు సహాయము చేసిన భటుడినే అప్పగించగా వారు తాము ఎక్కడికక్కడ వదిలి వేసిన పుస్తకాలను సొరుగులలో శుభ్రముగా పేర్చబడినవి చూసి చాలా సంతోషముగా గ్రంథాలయ కార్యకర్తల పనికి ఎంతో ముచ్చటపడినారు. భటుడు వారికి కావలసిన గ్రంథాలను బల్లపై ఏర్పాటు చేసినాడు. నాలుగు కూర్చీలను కూడ అమర్చినాడు. నలుగురు కర్చీలలో కూర్చుని ముందువరసగా ఉన్న వంద పస్తకాలను పరిశీలించ సాగినారు. త్వరత్వరగా చదివి అందులోంచి మరల 20 పుస్తకాలను వేరు చేసి మనకు కావల్సిన సమాచారము ఈ 20 గ్రంథాలలో మాత్రమే ఉండి ఉంటుంది. ఇవి ఆ కాలానికి సంబంధించినవి అన్నట్లుగా తెలుస్తున్నది మనము ఈ 20 పుస్తకాలను సావధానముగా, సావకాశముగా పరిశీలించవలసి ఉంటుంది. మనకు కావల్సిన సమాచారము వీటిలోనే ఉండి ఉంటుంది అని అనుకొని నల్గురు తలా ఒక పుస్తకమును పరిశీలించడంలో నిమగ్నమైనారు. 20 గ్రంథములు సవిస్తరముగా ఒకటి తరువాత ఒకటి పరిశీలించగా ఒక మాటికి నల్గురు నాలుగు గ్రంథములను పరిశీలించ ప్రారంభించినారు. రెండు విడతలు అనగా ఎనిమిది పుస్తకములలో అలాంటి వివరాలు దొరకలేదు. మూడవ విడతగా మరి నాలుగు గ్రంథాలు పరిశీలించగా ఒక పుస్తకములో ఆ కాలము రాజు అయిన సైన్యనందుడు ఆయన కాలములో ఒక విపరీత పరిస్థితి ఏర్పడినదని ఇప్పటిలాగే ప్రజలు నిఃసత్తుపగా చేతకాని వారిలాగా త్వరగా

అలసిపోయే జీవితమును గడపడం ప్రారంభించినారు. ఇలా కొంత కాలము గడిచిన తరువాత ప్రజల శక్తియుక్తాలు అడుగంట సాగాయి. రాజావారు ఎన్ని ఉపాయములు చేసిన అవి ఫలించలేదని కాలము గడుస్తున్న కొలది పరిష్కార మార్గము దొరకలేదని, కొంత కాలమునకు దక్షిణదేశము నుండి గిరివరద స్వామి అనే పండితుడు తన యాత్ర నిమిత్తము కాశీ విశ్వేశ్వరుని దర్శనము చేసుకొని తరువాత ప్రయాగలో త్రివేణి సంగమములో స్నానమాచరించి మాత దర్శనము చేసుకున్నాడు. ఆయన ఎంత నిష్ఠాపరుడంటే మాత దేవి ఈ రాజ్య ప్రజల పరిస్థితి గూర్చి వివరించి దానిని నివారణ చేయుమని ఆదేశించినది. పండితులవారు రాజు సైన్యనందుని, కలసి విషయము విన్నవించి మాత ఆజ్ఞను తెలిపినారు. మహారాజా వారు ఇంత వరకు ఎన్ని ప్రయత్నములు చేసినను ఏదియును సఫలము కాని స్థితిలో మాతనే తాను తనకుగా ఈ స్వామిని పంపినదని భావించి శ్రీ గిరవరద స్వామి వారికి వారి రాకకు ఎంతో ప్రసన్నత వ్యక్తము చేసి ఈ విపత్తును కావల్సిన మార్గము ప్రయత్నము చేయమని విన్నవించినారు. అందుకు గిరవరదస్వామి మహారాజా వారితో ఇది దైవ సంఘటన. అందుకు మనము యజ్ఞము చేయవలసి ఉంటుందని అది దాదాపు 10 రోజులు పడుతుందని తాను కాశీకి వెళ్ళి అక్కడ ఉన్న కొందరు పండితులను విద్వాంసులను కలిసి విషయము వివరించి అందుకు తగిన కొందరిని తీసుకొని వచ్చి యజ్ఞ కార్యక్రమము చేస్తానని అనగా మహారాజా వారు ప్రధానమంత్రితో అందుకు కావల్సిన సౌకర్యాలను శ్రీ గిరివరదస్వామికి కల్పించమని ఆజ్ఞాపించినారు. అంత శ్రీ గిరివరదస్వామి వారు కాశీకి వెళ్ళి కొందరు పండితులను విద్వాంసులను యజ్ఞ క్రతువును తెలిసిన బ్రాహ్మణులను తీసుకొని వచ్చి యజ్ఞానికి కావల్సిన ఏర్పాట్లను చేయసాగినారు. రెండు రోజులు గడిచిన తరువాత ఆయన మహారాజు గారిని కలసి యాగానికి



కావల్సిన అన్ని ఏర్పాట్లు పూర్తి అయినాయని తరువాతి రోజు యాగము ప్రారంభించగలమని అనగా రాజావారు నాకు గల సందేహము ఏమంటే ఇది ఇలా ఎందుకు జరిగింది. కారణాలు ఏమి? ఇది నా రాజ్యములోనే రావడం ఏమిటి? అనగా శ్రీ గిరివరదస్వామి వారు మహారాజా ఇది ఒక ప్రకృతి సంబంధము కావడము వలన జరిగినది. మీ రాజ్యములో త్రివేణి సంగమము ఉండడము వలన ఇక్కడ గాలి వెలుతురు సూర్యరష్మి ఇతర ప్రకృతి శక్తులు చాలా ఉన్నతమైనవి ఉన్నవి. కనుక వాటి సంతులనము చెదిరి ఉండడము దానిని మరల సరి చేస్తే తప్ప ఈ పరిస్థితి కుదుటపడదు అని వివరించినారు. ఈ యాగము శ్రీ మహావిష్ణువు ప్రిత్యర్థము చేయవలసి ఉంటుంది. శ్రీ మహావిష్ణువులే సర్వజగత్తును పాలనము చేయుచున్నాడు అతని ప్రీతికి ఈ యాగము చేసి సమర్పించిన శ్రీ మహావిష్ణువు ప్రీతి చెంది ప్రకృతి అసంతులనమును సరి దిద్దుతాడు. అని వివరాలు వ్రాసి ఉన్నాయి. చివర ఒక వివరణ కూడా వ్రాసి ఉన్నది ఈ యాగము పూర్తి అయిన తరువాత ప్రజలు పూర్వము లాగా సర్వశక్తులను పొందుతారు. ఇది ఒక కవచము లాగా మీ రాజ్యముపై నిలిచి ఉంటుంది ఈ పలితానికి కాల పరిమితి చెప్పలేము మరల కూడా ఇలాంటి విపత్తు సంభవించే అవకాశము ఉన్నది కాని ఎప్పుడు అన్నది తెలియదు కాలమే దానికి సమాధానము.

ఈ వివరాలు తెలిసికొనిన తరువాత రాచకన్యలు ఇద్దరు తమ భర్తలతో ఇలా అన్నారు. ఈ మధ్య కాలములో మీరు శ్రీ మహావిష్ణువును గూర్చి, ధ్యానము ఏకాగ్రత ఒకరకంగా తపస్సు చేస్తున్నారు కదా! మీరు కొన్ని వివరాలు సేకరించి శ్రీ మహావిష్ణువు యాగాన్ని మన మహారాజా వారితో చేయించండి. మీరు వచ్చిన కొత్తలో మహారాజావారు శ్రీ మహా గణపతి యజ్ఞమును చేసినారు. ఆ సంగతి మీకు తెలుసును. మనరాజ్యములో శ్రీ మహావిష్ణువు యాగమును చేసే పండితులు

విద్వాంసులు, బ్రాహ్మణులు ఉండవచ్చును. శ్రీ మహావిష్ణువు సృష్టి స్థితికి కారకుడు త్వరగా ప్రసన్నము అవుతాడు. కనుక మీరు ఈ కార్యమును నెరవేర్చి ఈ రాజ్య జన బాహుల్యానికి సేవ చేయగలరు. మీరు ఈ విషయము మన ప్రధానమంత్రిగారికి వివరించినట్లైతే వారు అందుకు తగిన ఏర్పాట్లు చేయగలరు. ఇంతకు ముందు కూడ శ్రీ మహాగణపతి యాగానికి వారే పూనుకొని ఏర్పాట్లు చేసినారు. అంత నలుగురు గ్రంథాలయము బయటకు వచ్చి తమ నివాసమునకు బయలుదేరినారు. విషయము మరియు దానికి తిరుగుడు చేసే విధము తెలిసినది కాబట్టి నలుగురి మనస్సులలో ఎంతో సంతృప్తి ఉత్సాహము నిండిపోయినది. మరుసటి రోజు తమ స్నాన సంధ్య విధులను నిర్వహించుకొని దేవి మాత దర్శనము చేసుకొని గుడి ఆవరణలో తాము రోజు ధ్యానము చేసుకొనే స్థలమునకు వచ్చి కూర్చుని శ్రీ మహావిష్ణువు ధ్యానములో ఉండి పోయినారు.

**క్షీరసాగర శయన వైకుంఠ వాస**
**సదా చక్రధారి పాంచజన్యము పలికించేవాడ**
**పీతాంబర వస్త్రధారి, విశ్వత్వం విశ్వసంభువం**
**శ్రీ వత్సవక్ష అని విష్ణువును ప్రార్థించి**

ఇంత వరకు ఎందరో భక్తులు, కవులు, పండితులు, నీ శీర్షము గూర్చి, నీ బాహులను గూర్చి, నీ ఆయుధాలను గూర్చి నీ శక్తులను గూర్చి, ఎంతో పొగడినారు వర్ణించినారు. కాని ఇన్ని భుజాలు, శీర్షాలు, ఆయుధాలను కొంత కూడ అసంతులనము లేకుండ అనంతశక్తులు కల్గిన నీ కాళ్ళను, పాదాలను వాటికి గల అనంత బలాన్ని ఎవరును ఇంత వరకు ప్రస్తావించలేదు. పైన భాగములో ఉన్న ఇంత శక్తికి ఆధారభూతమైన నీ పాదాల శక్తి ఆమోఘము. చాతుర్యములలో శూద్రులను కాళ్ళు పాదాలుగా వర్ణించినారు. అంటే సంఘములో వారికి గల శక్తిని



ప్రపంచానికి తెలియజేయటే వైకుంఠధామని ఇదే పరమ ఉద్దేశ్యము అన్ని వర్ణాల కన్న శూద్రులే సంఘములో అతి బలవంతమైన భాగము. అనేక వృత్తులు చేస్తు జనబాహుళ్యానికి ఇతోధిక సేవ చేస్తున్నారు వారిని ఎప్పుడును ఎవరును తక్కువగా అంచన వేయవద్దు. తక్కువగా చూడవద్దు, మేము ఈ రాజ్యానికి మేలు చేయ తలపెట్టిన ఈ యజ్ఞములో మాకు తగిన సహాయ సహకారాలు అందించమని మిమ్మల్ని అర్థించుచున్నాము ధ్యానించు చున్నాము. మా మొర ఆలకించమని విజ్ఞప్తి చేస్తున్నాము, ప్రార్థిస్తున్నాము. ఇలా పరి పరి విధములుగా శ్రీ మహావిష్ణువును కొలవ సాగినారు. ఇలా వారంరోజులు దీక్షగా శ్రీ మహావిష్ణువును రోజు ధ్యానించడములో మునిగి పోయినారు. వారం తరువాత ఒక రోజు ధ్యానము ముగించుకొని చుట్టు ప్రదక్షిణము చేస్తున్నారు. అంత ఒక యువకుడు నేను వారం రోజులుగా మిమ్మల్ని గమనిస్తున్నాను. మీరు ఎవరు? ఎవరి కార్యమును భుజాలపైన వేసుకొని ఉన్నారు. మీరు మీ ప్రయత్నము చేయండి. అంత సానుకూలమవుతుంది అన్నాడు. నేను కూడ మీతో పాటు దేవి ప్రదక్షిణములు చేస్తానన్నాడు. రెండు ప్రదక్షిణములు చేసిన తరువాత మూడవ ప్రదక్షిణ సమయములో తమతో పాటు వస్తున్న యువకుడు కానరాలేదు. సోదరులిద్దరు అటు ఇటు చూడగ తరువాత కూడ అతను కనిపించలేదు. సోదరులిద్దరు మూడవ ప్రదక్షిణము ముగించుకొని అమ్మవారి ముందు కూర్చుని శ్రీ మహావిష్ణువే స్వయముగా ఆజ్ఞ ఇచ్చినాడని గ్రహించి దేవి మాతకు నమస్కరించి నివాసానికి వెళ్ళినారు.

సాయంకాలము ప్రధానమంత్రి గారిని కలిసి తాము శ్రీ మహావిష్ణువు యాగమును జరపడానికి నిశ్చయించుకున్నామని, ఇది వరకు శ్రీ మహాగణపతి యజ్ఞములో పాల్గొన్న పండితులందరిని సమావేశ పరచాలని విషయము వారితో చర్చించి కార్యప్రణాకను స్థిర పరచుదామని అనగా

ప్రధానమంత్రి గారు మరుసటి రోజే సమావేశము ఏర్పాటు చేస్తానని అందుకు రాజ పురోహితుని తనను కలవమని సమాచారము అందించమని భటుని పంపినారు. మరుసటిరోజు మహారాజావారు, ప్రధానమంత్రి గారు, రాజ పురోహితుడు రాజపరివారము, పర్ణిసోదరులు, మరి కొందరు ముఖ్యులు సమావేశమై శ్రీ మహావిష్ణువు యాగమును గూర్చి చర్చించుదామని ప్రధానమంత్రి గారు అనగా పర్ణి సోదరులు తాముగ మరియు రాజకుమార్తెలు నలుగురు కలిసి ప్రధాన గ్రంథాలయములో పురాతన విభాగములో ఉన్న రాజ్య చరిత్రకు సంబంధించిన గ్రంథాలను, గ్రంథాలయ అధికారి సహాయముతో చూడగ అక్కడ రాజ్య చరిత్రను గూర్చి దాదాపుగా వంద పుస్తకాలు ఉన్నాయని, ఒక సొరుగులో 50 సంవత్సరాల నుండి ఇప్పటి వరకు, రాజ్యములో జరిగిన అన్ని ముఖ్య సంఘటనల గూర్చి వ్రాయబడి ఉన్నాయి. మరొక సొరుగులో అంతకు ముందు కాలములో జరిగిన విషయాల గూర్చి వ్రాయబడి ఉన్నవి. రెండవ సొరగులో ఉన్న పుస్తకాలలో ఒక 20 పుస్తకాలు మరీ పాతవని అందులో వివిధ అంశాల వ్రాయబడి ఉన్నాయి. ఈ 20 పుస్తకాలను అక్కడి భటుడు మాకు అందించి సహాయము చేసినాడని మొదటి రోజు ఏమియును తెలిసే విషయము గుర్తించకపోవడం వలన అది సాధ్యము అవుతుందో కాదో నని మా నివాసానికి వచ్చి మేము చర్చించుకొనగ మా భార్యలు కూడ తమ సహాయ సహకారాలను అందించడానికి సంసిద్ధత వ్యక్త పరచినారు. మేము నలుగురము ఆ గ్రంథాలను తిరిగి వేయగా ఒక గ్రంథములో ఆ కాలములో పట్టిన రుగ్మత గూర్చి వివరంగా వ్రాసి ఉన్నది. దక్షిణ దేశము నుండి గిరివదరుడనే స్వామి తీర్థ యాత్రల నిమిత్తము ప్రయాగకు వచ్చి అమ్మవారి దర్శనము చేసుకున్న తరువాత ఆయనకున్న ఆధ్యాత్మిక శక్తుల ద్వారా ఈ రాజ్యములో ప్రస్తుత పరిస్థితి అవగాహన అయినది. ఆయన శ్రీ మహారాజవారి దర్శనము చేసుకొని సంగతి



వివరించి అందుకు తరుణోపాయముగా శ్రీ మహావిష్ణువు యాగాన్ని రాజాజ్ఞతో జరిపించినాడు. ఈ యాగ ఫలితము వలన ఈ రాజ్యముపై ఒక శక్తి కవచము ఏర్పడినది. దాని వలన ప్రజలు ఇకపై మామూలు జీవితాన్ని గడపగలరు. కాన ఈ కవచము యొక్క కాలపరిమితిని శ్రీ మహావిష్ణువు స్ఫురించనీయలేదు. కనుక కొంతకాలము తరువాత ఇలాంటి పరిస్థితి కలిగే అవకాశము ఉన్నది అని ఈ గ్రంథములో వ్రాసి ఉన్నది. ప్రస్తుతము రాజ్యములో అలాంటి పరిస్థితియే కలిగి ఉన్నది కనుక ఇప్పుడు మహారాజావారు శ్రీ మహావిష్ణువు యాగాన్ని ఆచరించవలసి ఉంటుంది. ఇది ఇంతకు ముందే రావలసినది. కాని శ్రీ మహారాజావారు శ్రీ మమహా గణపతి యాగము చేయడం వలన అది కొంత కాలము ఆగినది.

అంత మహారాజావారు మీరు నలుగురు చదివి చూసిన విషయాలు మాకు అవగతమైనాయి. అయితే ఇప్పుడు మనము శ్రీ మహావిష్ణువు యాగము చేయడం తప్ప వేరే మార్గము లేదు. అంత రాజపురోహితుడు మహారాజా! శ్రీ మహావిష్ణువు యజ్ఞమునకు ముఖ్యముగా నలుగురు పండితులు అవసరము ఉంటుంది. ఆ నలుగురు ఉద్దండ పండితులై ఉండవలసిన అవసరము ఉన్నది. యజ్ఞములో చేయడంలోను చేయించడంలోను తగిన అనుభవము కలిగిన వారై ఉండాలి ఆ నలుగురిలో మొదటి పండితుని హోత్రి అంటారు. ఇతను ఋగ్వేదములో ఉన్న మంత్రాలను ఉచ్చరిస్తాడు. ఇక రెండవ పండితుని అధ్వారము అంటారు ఇతను ప్రధాన పండితునికి సహాయకుడిగా ఉంటాడు. క్రతువుకు కావల్సిన వస్తువులను భూమి కొలతలు యజ్ఞకుండ నిర్మాణము యజుర్వేదములో చెప్పిన విధముగా నిర్మాణము చేస్తాడు. ఇక మూడవ పండితుడు ఆయనను ఉధ్వగత్రి అంటారు ఈయన మంత్రములను చదువువారి మరియు సంగీతము మొదలైన కళలను సామవేదములో చెప్పినట్లు పాటిస్తాడు. యజ్ఞానికి ముందును తరువాత పూర్ణాహుతి

సమయములో వల్లవేయవలసిన మంత్రాలను అంటారు. ఇక నాలుగవ పండితుని బ్రహ్మన్, అంటారు. ఆయన యజ్ఞానికి ముఖ్యకర్తగా వ్యవహరిస్తారు. ఈయన యజ్ఞకాలములో జరుగు ప్రతి సంఘటనకును మరియు సందర్భోచితముగా అనవలసిన మంత్రాలను పలుకుతాడు. శ్రీ మహావిష్ణువు యాగానికి మనకు మూడు యజ్ఞకుండములు కావల్సి ఉంటుంది. చిన్న యజ్ఞములో ఒక కుండముతోనే పూర్తి చేస్తారు. ఈ కుండములో మంత్రాలు చదువుతు నెయ్యి, పాలు, ధ్యానము, తీపి పదార్థాలు, రొట్టెలు, సోమరసము, సమర్పించబడుతుంది. యజ్ఞము దాని అవసరాన్ని బట్టి ఉద్దేశాన్ని బట్టి కొన్ని నిమిషములు, గంటలు, రోజులు, నెలలు కూడా చేస్తారు. కాని ఈ శ్రీ మహావిష్ణువు యాగమునకు వారం రోజులు సమయము పడుతుంది. కొన్ని రకాల యజ్ఞాలలో పాలు, పాల పదార్థాలు, పండ్లు, పూలు, ధ్యానము, బట్టలు కూడ సమర్పిస్తారు. ఇలా యజ్ఞమును గూర్చి విస్తారముగా చర్చించిన తరువాత అందరు కలసి ఒక నిర్ణయానికి వచ్చినారు. ఇది శ్రీ మహావిష్ణువును ప్రసన్నము చేసుకొనడానికి చేస్తున్న యజ్ఞము. కనుక మూడు కుండములతోనే సరిపోతుంది. ఇక మిగిలిన విషయాలను గూర్చి ప్రధానమంత్రి గారు వివరాలు, సౌకర్యాలు సరంజామ అంత సమకూర్చవలసి ఉంటుంది. పోయినసారి యజ్ఞములో పాల్గొని నిర్వహించిన పండితులనే ఆహ్వానించిన సరిపోతుంది. అనగా మహారాజావారు అన్ని ఏర్పాట్లను ప్రధానమంత్రిగారు ఏర్పాటు చేస్తారు. కాని మీరిద్దరు శ్రీ మహావిష్ణువు ఉపాసకులు కనుక మీ పర్య వేక్షణలోనే ఈ యజ్ఞము జరుగవలసి ఉంటుంది. అనగా పర్ణి సోదరులిద్దరు సరేనని అన్నారు. ఇలా మొత్తము నిర్ణయము జరిగిన తరువాత పురోహితుల వారిని దినము ముహూర్తము నిర్ణయించమని రాజావారు ఆజ్ఞాపించినారు. మంచి ముహూర్తము చూసి రెండు రోజులలో వివరములు చెప్తానని పురోహితులు అన్నారు. అంత సభ ముగియగా అందరు తమ నివాసములకు వెళ్ళినారు.



పర్ణి సోదరులు భార్యలతో కలసి తమ నివాసానికి వచ్చినారు. వారి భార్యలు భర్తలతో ఎంతో ప్రేమగా మీరు ఎంత గురుతరమైన బాధ్యతను ఒప్పుకున్నారు. అనగా పర్ణిసోదరులు మీపై ఉన్న ప్రేమ మమ్మల్ని నడిపిస్తున్నది. అనగా రాకుమార్తెలు ఎంతో ప్రసన్నమైనారు. అనుకున్న రోజుకు అనుకున్న ముహూర్తమునకు శ్రీ మహావిష్ణువు యాగము ప్రారంభము అయినది. అరణిలో అగ్ని ప్రజ్వలము చేసి యజ్ఞ కుండములో అగ్నిని వేసి శ్రీ మహావిష్ణువు ప్రీత్యర్థము యాగము ప్రారంభించబడినది. విష్ణువు స్తోత్రాలు, విష్ణుసహస్రనామాలు, విష్ణుమంత్రస్తుతితో యజ్ఞశాల మొత్తము దద్దరిల్లసాగినది. ఈ యజ్ఞ కార్యక్రమము వారం రోజుల పని కనుక మొదటి రోజు యజ్ఞము మొత్తము నిర్విఘ్నముగా పరిసమాప్తి కావడానికి శ్రీ మహాగణపతి ఆహ్వానము స్థాపనము, శోడశోపచారాలు పూర్తి చేసి శ్రీ వినాయకుని ఆజ్ఞ తీసుకొని శ్రీ మహావిష్ణువు యాగాన్ని ప్రారంభించడం జరిగినది. అందులో భాగముగా ధ్వజారోహణము కూడ కావించబడినది. రెండవరోజు శ్రీ మహావిష్ణువును ఆహ్వానించి శోడశోపచారాలు చేసి శ్రీ మహావిష్ణువు ప్రిత్యర్థము యజ్ఞము నిర్వహించడం ప్రారంభించబడినది. ప్రతిరోజు సాయంకాలము పురాణ శ్రవణము కూడ నిర్వహించబడడం కూడా జరిగినది. ముఖ్యముగా యజ్ఞకుండములో నెయ్యి, రకరకాల ధాన్యములు, నవధాన్యములను అర్పించడం జరుగుతుంది. ప్రతిరాత్రి దినము తప్ప దినము నృత్యగాన విశేషాలు ప్రదర్శించబడతాయి. పర్ణి సోదరులు విష్ణుమూర్తి ఇలా ప్రార్తించ సాగినారు.

**రావయ్యా దిగి రావయ్యా విష్ణుమూర్తి**
**రాజ్యాన్ని ప్రజలను కాపాడవయ్య విష్ణుమూర్తి**
**దుష్టశక్తులను పారద్రోలవయ్య విష్ణుమూర్తి**
**రాజ్యాన్ని రాజును రక్షించవయ్య విష్ణుమూర్తి**

**పాడి పంటలను సమృద్ధి చేయవయ్య విష్ణుమూర్తి**
**నెలకు నాలుగు వానలు కురిపించవయ్య విష్ణుమూర్తి**
**పశువులను పక్షులను సంరక్షించువయ్య విష్ణుమూర్తి**
**జనులకు మంచినడవిడినిచ్చి రక్షించువయ్య విష్ణుమూర్తి**
**రాజ్యములో ప్రజల కొచ్చిన ఆపదమాన్పవయ్య విష్ణుమూర్తి**
**మా మొరనాలకించవయ్య విష్ణుమూర్తి**
**మా మొరనాలకించవయ్యా విష్ణుమూర్తి**

అని పరిపరి విధములుగా శ్రీ మహావిష్ణువును వేనోళ్ళ పొగడసాగినారు. వారం రోజులు యాగశాలనంత రోజుకొక రకము పూలతో అలంకరించి వాటినే యజ్ఞములో సమర్పించడం జరిగినది. మొదటి రోజు అంత రకరకాల కలువపూలతో అలంకరించి యజ్ఞములో కలువపూలను సమర్పించడం జరిగినది. కలువలు చంద్రోదయముతో విచ్చుకుంటాయి. సూర్యోదయానికి ముడుచుకుపోతాయి. కనుక రాత్రి మాత్రమే వాటిని సేకరించి చాలా చల్లని ప్రదేశములో సూర్యరశ్మి తగలని ప్రదేశములో ఉంచి మరుసటి రోజున యాగశాలకు తెచ్చి వినియోగించడం జరిగినది. యాగశాల అంత కలువపూల వాసనతో ఘుమఘుమలాడ సాగినది. యాగానికి వచ్చిన ప్రజలందరికి ఎంతో ఆనందపరచ సాగినది. ఇలా ప్రజలు ఎంతో ఆహ్లాదకరమైన అనుభూతి పొందసాగారు. రెండవ రోజున మందార పువ్వులతో అలంకారము అర్పణ జరిగినది. మందారములు అంతగా వాసన వెదజల్లక పోయినను వాటి అందము అందరిని ఎంతోగానే ఆకర్షించిడంచే వాతావరణము తేలిక పడినది. మూడవ రోజు చేమంతుల వంతు వచ్చినది. రకరకాల చేమంతులు ఎరుపు పసుపు తెలుపు, గులాబి రంగు ఇలా ఎన్నో రకాల చేమంతులు వినియోగించబడినవి. చేమంతుల వాసన మధురంగా అందరి



మనస్సులను చూరగొన్నది. ఇక నాల్గవ రోజు కనకాంబరాలు అలంకరణకు గురి అయినవి. కనకాంబరాలు వాటితో అలంకరణలు యాగశాల అంత కనకాంబరాల చీర కట్టినట్లు రంగుల నిలయముల కనిపించసాగినది. కనకాంబరాలతో యాగశాలను అలంకరించడమే కాకుండ అక్కడకు వచ్చిన ముత్తయిదువులకు కన్యలకు జడలోకి అలంకరించడానికి మాలలు ఇవ్వడం వలన చూపరులకు ఎంతో ఆనందాన్ని ఇవ్వసాగినది. ఇక అయిదవ రోజున అలంకారము నందివర్ధనము పూలతో చేయబడినది. యాగశాల అంత తెలుపుమయమై తెల్లచీర కట్టినట్లు కనిపించ సాగినది. ఇక ఆరవరోజున సంపంగి పూలవంతు వచ్చినది. తెల్ల సంపంగీలు బంగారు వెన్నెలు కల సంపంగీలు అందమే కాకుండ యాగశాల అంత చక్కని ఘుమఘుమ వాసనతో అక్కడకు వచ్చిన ప్రజల మనస్సులను శరీరాలను తెలియని లోకాలకు తీసుకొని వెళ్ళినది. ఇక ఏడవరోజున అనగా ఆఖరి రోజున పద్మాలతో పూజ చేసే ఏర్పాటు చేయబడినది. ఎరుపు, తెలుపు, గులాబి, నీలము ఇలా రకరకాల రంగుల పద్మాలతో యాగశాల అలంకరించబడినది. వచ్చిన ప్రజలకు చేతి అలంకారము కొరకు ఒక్కొక్క పద్మము ఇవ్వబడినది. యాగశాల మొత్తము పద్మావాసనతో పరిసరాలు కూడ గుబాళించినవి. యాగములో పూర్ణాహుతికి ముందుగా అక్కడకు వచ్చిన ప్రజలందరికి నవధాన్యాలు చేతికి ఇచ్చి యజ్ఞములో వేయడానికి అవకాశము కల్పించబడినది. నవధాన్యములు ఇతర ధాన్యాలు, గోధములు, జొన్నలు, రాగులు, తైదలు, జవ్వలు, కందులు, పెసలు, సెనగలు, ఇలా అన్ని రకముల ధాన్యములు కొంచెము నెయ్యి వేసి కలిపి అందరికి ఇవ్వగా ప్రజలు ఒక్కరు ఒక్కరుగా బారులు తీరి వరుసగా యాగకుండమును దర్శించి శ్రీ మహావిష్ణువును ధ్యానించి ధాన్యాలను యజ్ఞ కుండములో సమర్పించినారు. ఈ కార్యక్రమము పూర్తి అయిన తరువాత ఋత్వికులు

శ్రీమహావిష్ణువును స్తుతిస్తు మంత్రాలు చదువుతు పూర్ణాహుతితో భాగముగా పళ్ళు, పాలు, నెయ్యి కొబ్బరికాయలు, తేనె శక్కర, పంచగవ్యాలను సమర్పించారు. ముఖ్యబ్రాహ్మణుడు అందరిని ఉద్దేశించి పూర్ణాహుతి పూర్తి కావస్తున్నది కనుక ప్రజలందరు నిఃశబ్దముగా చేతులు జోడించి శ్రీ మహావిష్ణువును ధ్యానించాలని అనగా యజ్ఞశాల అంత కొన్ని క్షణాలపాటు నిశ్శబ్దము ఆవహించినది. అందరు తమ తమ హృదయాలలో మనస్సులలో శ్రీ మహావిష్ణువును ప్రార్థించి తమ బాధలను తీర్చుమని ప్రార్థన జరిపినారు. అనంతరము బ్రాహ్మణుడు పంచామృతాలను యజ్ఞకుండములో సమర్పించినారు. అంత యజ్ఞశాల అంత దివ్యమైన వెలుగుతో ప్రకాశవంతమైనది. యజ్ఞ కుండము మధ్యలో నుండి అగ్నిదేవుడు ఒక కలషముతో ప్రత్యక్షమైనాడు ధగధగమని మండుచున్న యజ్ఞకుండములోని జ్వాలల మధ్య అగ్నిదేవుడు స్వయంప్రకాశముతో కనపడి మహారాజును ఉద్దేశించి మహారాజా మీరు జరిపిన ఈ శ్రీ మహావిష్ణువు ప్రీతికరమైన యజ్ఞమునకు శ్రీ మహావిష్ణువు ఎంతో సంతృప్తి చెందినారు. ఈ కలషాన్ని నాకిచ్చి మీకందజేయమని నాకు ఆదేశించినాడు. ఈ కలషములో పవిత్ర జలము ఉన్నది. ఇందులోంచి ఒక్కొక్కబొట్టు మాత్రము ఒక్కొక కడపలో వేసి రాజ్యము మొత్తముగా చల్లమని ఆదేశించబడినది. ముఖ్యముగా పంట పొలాలు, గ్రామాలు, పట్టణాలు, నగరాలు ప్రజావాసాలు, అడవులు, కొండలు రాజ్యములోని అన్ని ప్రాంతాలలో చల్లవలసి ఉంటుంది. రాజ్యములో ఎంత ఎక్కువ భూభాగము విస్తరించి చల్లగలిగితే అంతమంచిది. వారం తరువాత ఈ పవిత్ర జలములో నుంచి ఒక పవిత్రశక్తి బయటకు వచ్చి మీ రాజ్యము మొత్తము ఆవహించి వేస్తుంది. ఆ పైన రాజ్యములోని ఉన్న సంక్షోభము మొత్తము ఏమి సందేహము లేకుండుట పోతుంది. ఇది శ్రీ మహావిష్ణువు ఆజ్ఞ ఇప్పుడు శ్రీ మహావిష్ణువు చెప్పమన్నది ఏమంటే పర్ణిసోదరులు ఈ



ద్వారములో ఉండటము ఈ రాజ్యము రాజ్యప్రజలు చేసుకున్న సుకృతము వారికి శ్రీ మహావిష్ణువు పట్ల ఉన్న దీక్ష వలననే ఇది సాధ్యము అయినది అని మహారాజా వారికి కలషాన్ని అందించి నిష్క్రమించినారు. అంత ప్రజలందరు శ్రీ మహావిష్ణువుకు మరియు అగ్నిదేవునికి జయ జయ నినాదాలు పలికినారు. చివర పర్ణి సోదరులకు కూడ జయ జయ కారాలు పలికినారు. అంత మహారాజావారు ప్రజలందరిని ఉద్దేశించి మాట్లాడుతు నారాజ్య ప్రజలారా! మీ రందరకు ఈ సందర్భముగా యజ్ఞము పూర్తయినందున శుభాకాంక్షలు తెలుపుతున్నాను. ఈ యజ్ఞము యొక్క విశేషము ఏమిటంటే ఇది వరకులా ఏర్పడిన కవచములా కాకుండ ఇది శాశ్వత కవచముగా ఉంటుందని అగ్నిదేవుడు మీ సమక్షములో అందరికి తెలిపినారు. అందువలన ఈ రాజ్యములో భావితరాల పౌరులు ఇక చింతించవలసిన అవసరము లేదు. మరో సంగతి ఏమిటంటే మీకు ఈ సంగతి తెలిసినదే. ఈ రాజ్య అళ్ళుళ్ళు అయిన పర్ణి సోదరుల వలననే ఇది సాధ్యము అయినది. వారు కూడ వారి భార్యలతో కలిసి ఎంతో శ్రమించి ఈ రుగ్మతకు కారణము వెతకడమే కాకుండ శాశ్వత నివారణ ఉపాయము చేసినారు. వారిద్దరికి ఈ రాజ్య ప్రజలు ఋణపడి ఉంటారు. మరో సంగతి రాజకుమారుల వారు ఇంతకు ముందు ఏదో తెలియని అనారోగ్యముతో బాదపడేవారు.

ఇది చాల రహస్యముగా ఉంచబడినది. అది తెలిసిఉన్న రాజ్య ప్రజలలోనే కాకుండ ఇతర ఇరుగు పొరుగు రాజులను సామంత రాజులలోను ఎంతో అసంతృప్తికి దారి తీసేది. శత్రురాజులు కూడ దీన్ని ఒక లాభాపేక్షగా చూసే అవకాశము ఉండేది. కనుకనే రాజకుమారుల వారి అనారోగ్యము సంగతి గోప్యముగా ఉంచబడినది. పర్ణిసోదరులు రోజు ధర్మశాలలో ప్రజాసేవ చేయుచు ఎలా తెలిసికున్నారో తెలియదు. కాని వారు ఈ విషయాన్ని ప్రధానమంత్రి గారితో ప్రస్తావించగా వారు

నాతో చర్చించిన తరువాత పర్ణి సోదరులను అడుగగ వారు రాజకుమారుల వారి అనారోగ్యము గురించి నిజమైన సంగతి వారికి తెలిపినాము. వారు రాజకుమారుల వారి ఆరోగ్యనివేదిక మొత్తము చదివి అందుకు కూడ తరుణోపాయము ఆలోచించి తమ చికిత్స అందించి రాజకుమారుల వారి ఆరోగ్యమును, కుదుటు పరచినారు. వారి శక్తి సామర్ధ్యాలకు, జ్ఞానానికి విద్యత్తుకు ఆకర్షింపబడి రాజకన్యలు వారిని ప్రేమించి వివాహమాడినారు. అందువలన పర్ణి సోదరులకు రాజకుటుంబమే కాకుండ రాజ్యప్రజలు కూడ ఋణపడి ఉన్నారు. అయిన వారు ఎంతో నిరాడంబరత్వము ప్రదర్శిస్తారు. వారికి వారే సాటి. నేను రాజకుటుంబము తరపున, రాజ్య ప్రజల తరపున వారికి ఎంతో కృతజ్ఞతలు తెలుపుకోకుండా ఉండలేక పోతున్నాను. ఇక మిగిలిన కార్యక్రమము ప్రధానమంత్రిగారు ఇతర మంత్రులు, వారి బలగము శ్రీ అగ్నిదేవుని ఆజ్ఞాను సారము ఈ మంత్రజలమును రాజ్యములోని మొత్తము క్షేత్రములలో చల్లించే ఏర్పాట్లు చేయమని ఆజ్ఞాపిస్తున్నాము. ఊళ్లలలోను పంట పొలములలోను చల్లడము అంత కష్టము కాదు. కాని కొన్ని అటవి ప్రాంతములలో చల్లడము కష్టము. కనుక అటవి ప్రాంతములలో ఉండే ప్రజలకు విషయము తెలియపరచి వారి సహాయమును తీసుకోవడం ఎంతైన అవసరము. అందుకు నేను ఒక ప్రత్యేక బృందమును ఏర్పాటు చేయవలసినదిగా ప్రధానమంత్రిని ఆజ్ఞాపిస్తున్నాను. సమయము ఒక వారం రోజులు మాత్రమే ఉంది కనుక మనము ఏర్పాట్లు విషయములో అశ్రద్ధ చేయక తగిన జాగ్రత్తలు తీసుకొనవలసి ఉంటుంది.. ఇక పర్ణి సోదరులను ఎలా సత్కరించాలో నిర్ణయించడానికి ఒక సభ సంఘాన్ని ఏర్పాటు చేయవలసినదిగా ప్రధానమంత్రికి చెప్తున్నాను. మీరందరు తమ తమ బాధ్యతగా తమ బంధువులు, స్నేహితులు, తెలిసిన వారికి ఈ సమాచారము అందించి ఇతోధికముగా ఈ కార్యక్రమములో పాల్గొనే విధముగా పాటు పడగలరు.



ఈ రోజు పూర్ణాహుతి అయినది. కనుక సాయంకాలము సాంస్కృతిక కార్యక్రమము ఉంటుంది. అందులో అందరు పాల్గొనాలని విజ్ఞప్తి అని మహారాజావారు సభ ముగించి తమ పసాదము వైపుబయలుదేరినారు. పర్ణి సోదరులు కూడా వారి భార్యలతో పాటు వారి నివాసానికి వెళ్ళినారు. రాజకన్యలు తమ భర్తల విజయానికి వారు సాధించిన విశేషమైన కార్యక్రమము వలన వారిపై మరింత ప్రేమ పెరుగసాగినది.

వారం రోజులలో దేశ ప్రజలు అంత ఎంతో కష్టముగా శ్రమపడి మంత్రపలము దేశమంత చల్లడము వలన అగ్నిదేవుడు చెప్పినట్లుగా అందులోంచి శక్తి బయలుదేరి వాతావరణములో ప్రవేశించ సాగినది. మెల్ల మెల్లగా ప్రజలలో ఆవహించిన నిఃసత్తువ తోచక పోవడము శక్తి లేక పోవడము తొందరగా అలసిపోవడం లాంటి రుగ్మతలు మెల్ల మెల్లగా దూరము కాసాగినాయి. ప్రజలలో మునుపటి ఉత్సాహము కలుగ సాగినది. అన్ని శక్తులు తిరిగి వస్తున్నట్లుగా అనుభూతి, అనుభవము కలగ సాగినది. అస్తవ్యస్తుమైన జన జీవనము తిరిగి మునుపటి దారిలో పడడముతో ప్రజలందరు ఎంతో ఆనందపడిపో సాగినారు. అందరు పర్ణి సోదరులకు ఎంతో ఋణపడి ఉన్నామని అనుకోసాగినారు. అందరు వారిని పరి పరి విధములుగా పొగడసాగినారు కృతజ్ఞతలు వ్యక్తము చేయసాగినారు. పర్ణి సోదరులు మాత్రము ఇది రాజ్యము పట్ల తమ కర్తవ్యమని మాత్రమే అని భావించసాగినారు., రాజ్యమంత తిరిగి పూర్వపు వైభవాన్ని మామూలు జీవితము ప్రజలు గడుప సాగినారు. పర్ణి సోదరులు మాత్రము తమ దినచర్యలో ఏ మాత్రము మార్పు లేకుండ మామూలుగా తమ కార్యక్రమాలను నిర్వహించ సాగినారు. రాజకుమార్తెలు ఇద్దరు తమ భర్తలు సాధించిన కార్యాలతో ఎంతో ఆనందపడసాగినారు. తమ భర్తల ఔన్నత్యానికి ఎంతగానో మురసిపోయినారు. తాము ఏ రాజకుమారులతో వివాహము చేసుకొన్న ఎడల ఇంతటి ప్రతిభాశాలలు

అయిన భర్తలను పొందేవారము కాదు. పర్ణి సోదరులు తమ జీవిత భాగస్వాములుగా దొరకడము ఈ రాజ్యములోని ప్రజలు, రాచకుటుంబము మరియు తమ పూర్వజన్మ సుకృతముగా భావించసాగినారు. కాల క్రమమున పర్ణి సోదరులు తమ భార్యలకు ఇద్దరేసి కుమారులను ఒక్కొక్క కుమార్తెను పొందినారు. నిండైన జీవితము గడుపుతు నలుగురు కూడ ఎంతో సంతృప్తిగా గడపసాగినారు. కాలము గడిచిన కొలది పర్ణి సోదరుల కుమారులు నలుగురు పెరిగి పెద్ద కాసాగినారు. వారు తండ్రులు వలే విద్యా, జ్ఞానము, ధ్యానము, ఏకాగ్రతలందు అంతగా ఆకర్షించబడక యుద్ధవిద్యలందు ఆసక్తిని కనపరచ సాగినారు. చిన్నతనము నుండే వారు నలుగురికి పరుగు పందెములలో ఎంతో ఆసక్తి ఉండేది. రోజువారిగ వారు కొంతదూరము పరిగెత్తే విధముగా తమకు తాముగా తర్ఫీదు ఇచ్చుకొన సాగినారు. వ్యాయామ శిక్షణలో పాల్గొనే వారు రాజ్యములో ప్రతి పరుగు పందెములో వారిదే పై చేయి. ఎవరు కూడ వారిని ఓడించలేక పోయినారు. వయస్సు పది సంవత్సరములు రాగానే కుస్తి పట్లు, కత్తి సాము, గుర్రపు స్వారీ, మొదలగు వాటిని నేర్చుకొన సాగినారు. పర్ణి సోదరులు తమ పిల్లల తీరుపై కొంత అనాసక్తిని కనపరచిన వారిలో రాచరికపు రక్తము ప్రవహిస్తున్నది. కనుక ఆపైనే ఆకర్షితులు అవుతున్నారని అనుకోసాగినారు. భార్య భర్తల మధ్య చర్చ వచ్చినప్పుడు కూడ తమ కుమారులు మామూలు పండిత విద్య పట్ల కాకుండా యుద్ధ విద్యల పట్ల ఆకర్షితులై అందులోనే శ్రద్ధ ఆసక్తులు కనపరుస్తున్నారన్న సంగతి చర్చించుకొని వారికి పూర్తి స్వాతంత్ర్యము ఇచ్చి వారికి ఆసక్తి ఉన్న విషయములలోనే తగు విధమైన శిక్షణలకు ప్రధానమంత్రిని సైన్యాధ్యక్షుడని సహాయము కోరవల్సినదిగా నిర్ణయించుకున్నారు. తమ ధ్యానము. ఏకాగ్రత తపస్సు లాంటి విద్యలు తమతోనే ఆగిపోతాయని భయపడ సాగినారు.



## గురుకుల స్థాపన

ఒక రోజు సాయంకాలము వ్యవహారాలు ముగిసిన తరువాత నలుగురు కూర్చుని తమ కుమారుల విషయము చర్చించుకొనసాగినారు. అంత రాజకన్యలు మేము మీ విద్యత్తుమీద మీ గుణగణాలపై ఆకర్షించబడి ఒకరకముగా మేమే మిమ్మల్ని వివాహమాడినాము. మీ శక్తులు మమ్మల్ని ఎంతగానో ప్రభావితము చేసినాయి. ఆకర్షింపచేసినాయి. మా మనస్సులపై జీవితాలపై మీ ప్రభావము చాలా ఎక్కువగా ఉన్నది. అందుకు సందేహము లేదు. కాని వంశపార్యంపర్యంగా మాలో ప్రవహిస్తున్నది రాచరికపు రక్తము. మరియు అణువులు నాటి స్వశక్తిని కోల్పోలేక పోయినాయి. మానసికంగా మీరు మమ్మల్ని ఎంతగానో ప్రభావితము చేసినారు. అయిన అందుకు మాపై మాత్రమే ప్రభావము ఉన్నది. శాస్త్రములో చెప్పిన విధముగా అటు ఇటు ఏడేడు తరాల గుణగణాల పిల్లకు వస్తవి అన్నట్లు మాలో ప్రవహిస్తున్న రాచరికపు విద్యలపైనే ఆసక్తి కలిగినది మేము కాని మీరు కాని వారికి ఏ విధమైన శిక్షణ గాని జీవన ప్రభావము కాని మరొక విషయమేమిటంటే వారు పుట్టినప్పటి నుండి రాచరికపు వాతావరణము లోనే పెరిగినారు. మీలా వారు పండిత వాతావరణములో పెరగలేదు. ఒకవేళ మీరు అందుకు ఏమైన చింతిస్తున్నారేమో తెలియదు. మీరు కూడ మావద్ద అలాంటి ఆలోచనలను వ్యక్తము చేయలేదు. మీరు మీ కుమారుల ఆసక్తి లేనిదాని పైన సంతృప్తి ఉన్నది తెలియడము లేదు. ఒకవేళ మీ మనస్సులో ఏ విధమైన భావము ఉన్నట్లైతే మనము నలుగురము మనస్సు విప్పి చర్చించుకోవడము బాగుంటుంది. ఒక వేళ వారి ఆసక్తి కాకుండ విద్యలపైన పాండిత్యము పైన శ్రద్ధ కలిగించాలని అనుకుంటే వారి ప్రవాహానికి అడ్డుకట్ట వేసి దారి మళ్ళించినట్లు అవుతుంది. కనుక ముందు మనము మనలో మనము చర్చించుకొందాము అని వారి భార్యలు అన్నారు. అంత పర్ణి సోదరులు మీరు ఈ విధముగా మాకు మా స్వంత

అభిప్రాయాలను మీరు తెలిసికొన్నట్లే, మీరు భార్యలుగా మాకు ఎంతో సంతోషాన్ని సుఖాలను, సౌకర్యాలను సమకూర్చినారు. మీరు మా జీవితాలపై ఇంతగా పెనవేసుకున్నట్లు ఇప్పుడు మీరు అన్నవిషయాలు, స్పష్టముగా తెలియచేస్తున్నాయి. మనము ఒకరినొకరు గాఢముగా అర్థము చేసుకున్నాము. కానీ మన ఆలోచనలు ఇంతవరకు మాటల రూపములో వ్యక్తము చేయలేదు. ఇలా మీరు మాటల రూపములో మీ మనస్సులోని విషయాలు వ్యక్తము చేసి మాకు మీ మీద ఉన్న ప్రేమ నమ్మకము, గౌరవము ఇంకా పెంపొందించుకున్నారు. ఇంతవరకు మీ పట్ల ఉన్న భావనలే కాకుండా ప్రేమ కూడ ఇంకా ఎంతో పెరిగిపోయినవి. ఇప్పుడు మేము ఎంతో సంతృప్తిని అనుభవిస్తున్నాము. మీరన్నది నిజమే. మేము కొంత కాలముగా మా విజ్ఞానము విద్యా, ధ్యానము, తపస్సు మన పిల్లలకు ఆసక్తి లేకపోవడానికి గూర్చి ఒక్కొక్కసారి ఎంతో చింతించే వారము. కాని ఇంత వరకు ఈ కోణములో మేము ఆలోచించలేదు. వారిలో రాచరికపు రక్తము కూడ ప్రవహిస్నుది అందువలన గుణగణాలే పై చేయి చూపిస్తున్నవి. మరియు మీరన్నట్లుగా వారు పుట్టినప్పటి నుండి రాచరికపు వాతావరణములో పెరిగి నందువలన అందుకు తగినట్లుగానే వారి ఆసక్తి ఉత్సాహము ఈ విధమైన రాచరికపు విద్యల పట్ల ఆసక్తిని కలుగచేసినవి. మరొక సంగతి ఏమిటంటే వారి అంగసౌష్ఠవము కూడ ఎంతో దృఢముగా దారుఢ్యముగా తయారు అవుతున్నది. రాచరికపు విద్యలకు సరిపోయే విధముగానే వారి శరీరాలు పెరుగుచున్నవి. మీరు అన్నట్లుగానే వారి పోకడలకు ఆలోచనలకు నడవడికకు అడ్డుకట్ట వేయకుండ ఆ లక్షణాలు అభివృద్ధి అయ్యే విధముగా మనము ఆవైపుగా శ్రద్ధ చూపించవలసిన అవసరము ఉన్నది. ఏది ఏమైన సవిస్తారముగా మనస్సువిప్పి మాట్లాడకుంటే మనము ఒక పరిష్కారానికి ముందు చూపుకు పద్ధతులకు నిర్ణయము ఎలాంటి భేదాలకు తావు లేకుండ



తీసుకొనవచ్చును. అని పర్ణిసోదరులు ఇప్పుడు మా మనస్సులు ఎంతో కుదుట పడినవి. మేమిద్దరము ఎప్పుడు అనుకోకపోయినను మేము ఒకరకముగా మదనపడేవారము, ఎప్పుడు కూడ మేము చర్చించుకొనలేదు. ఇప్పుడు విషయము తేటతెల్లమైనది. కనుక మాకు ఎంతో సంతృప్తి కల్గుతున్నది. మీరు మా జీవితభాగస్వాములైనందుకు మాకు ఎంతో గర్వముగా ఉన్నది. జీవితము పట్ల మీకు ఉన్న అవగాహన ఉన్నందున మాకు ఎంతో ఆనందము కల్గుతున్నది. అనగా రాచకన్యలు మీవ్యథ మాకు అర్థము అయినది మేము కొన్నాళ్ళుగా మీతో పంచు కోవాలనుకున్నాము. ఆలోచనలు, ఇలా ఈ విధముగా ఈ రోజు బయటకు వచ్చినాయి. అయినను మీలో ఇంకా కొంత నిరాశ పొడచూపుచున్నది. మీ వద్ద ఉన్న విద్యకు సార్థకము ఎలా కల్గుతుందని మీకు అంతగా ఏమియును ఆలోచనలు రావడము లేదు. మనము మన ప్రధానమంత్రి గారితో భేటి ఏర్పర్చుకొని సమస్యను వారికి తెలుపుదాము. వారు ఏదైన మార్గము చూపించక పోరు. అనగా అందరు అలాగే చేద్దామని సమావేశమును చాలించినారు.

తరువాత పర్ణిసోదరులిద్దరును ప్రధానమంత్రితో సమావేశానికి ప్రయత్నము చేద్దామని అనుకున్నారు. ప్రధానమంత్రిగారు రాచకార్యములలో విరామము లేకుండ ఉండడము వలన రెండు రోజుల అనంతరము వారికి సమయము ఇవ్వబడినది. సమావేశానికి ప్రధానమంత్రితో పాటు ఆయన ఇద్దరు సలహాదారులు, పర్ణిసోదరులు, సమావేశ భవనమునకు వచ్చినారు. రాచకన్యలు కలువకుంతల, సంపంగి హాసిని తాము కూడ భర్తలతో తాము కూడ సమావేశానికి అనుజ్ఞ ఇమ్మని అనగా పర్ణిసోదరులు సరే అన్నారు. రాచకన్యలు మేము ఈ సమస్యను విషయాన్ని ప్రధానమంత్రి గారికి వివరిస్తాము. ఎక్కడైన సరైన వివరణ లేకపోతే మీరు సరి చేయగలరు. అనగా పర్ణి సోదరులు సరేనని అన్నారు.

అంతకు ముందు రోజు వారి భార్యలతో విషయము సవివరముగా చర్చించిన తరువాత పర్ణిసోదరులకు తమ భార్యలపై ఇంకా ఎక్కువ అవగాహన కల్గినది. విషయము ప్రారంభిస్తు రాచకన్యలు ప్రధానమంత్రితో మంత్రివర్యా మీరు మమ్ములను చిన్నప్పటి నుండి ఎరుగుదురు. మీరు వివాహానికి కూడ సరైన నిర్ణయము మహారాజావారితో అంగీకరింప చేసినారు. కనుక మా జీవితములో మీకు తెలియని విశేషాలు విషయాలు లేవు. అలాగే మా భర్తల గుణగణాలపైన వారి శక్తి సామర్థ్యాల గూర్చి కూడ మీకు తెలియనిది లేదు. ఇప్పుడు మావాళ్ళ సమస్య కొంత భిన్నముగా ఉన్నది. కొంత స్వాంతనము మేము చేకూర్చినప్పటికిని వారికి పూర్తి సంతృప్తి కలుగలేదు. విషయము ఏమిటంటే మానల్గురు కుమారులు కూడా విద్యా, విజ్ఞానము ఆధ్యాత్మిక పురాణ ఇతిహాసాలపైన ఆసక్తి లేకుండా రాచవిద్యలు యుద్ధ విద్యలు, వ్యాయామ విద్యలపై ఆసక్తి చూపిస్తున్నారు. అందుకు తగిన కృషి చేసి కొంతవరకు ముందుకు సాగుతున్నారు. వారు వ్యాయామశాలలోను, సైన్యాధ్యక్షుడితోను సరైన సంబంధాలు పెట్టుకొని అందుకు తగిన శిక్షణను పొందుచున్నారు. మా భర్తలు, పిల్లల ఇష్టాలను కాదనడము లేదు. కాని వారిలో ఉన్న విద్యను, శక్తిని పిల్లలు గ్రహించలేకపోతున్నారని, ఒకటి రెండు సార్లు వీరు ప్రయత్నము చేసినను పిల్లలు అంతగా శ్రద్ధ తీసుకొనలేదు. ఆవైపు ఆసక్తిని కూడ కనపర్చలేదు. ఇప్పుడు పర్ణిసోదరులు సమస్య ఏమిటంటే తమవద్ద ఉన్న అపారవిద్యను ఎలా సార్థకము చేయించడము అని వీరు కొంత విచారములో ఉన్నారు. అప్పుడు మేము మీరు పెద్దలు అపార అనుభవము కలవారు. కనుక మీరు ఈ సమస్యకు ఏదైన ఉపాయము చెప్పగలరని వారికి విన్నవించినాము. అందుకే వారు మీతో సమావేశానికి త్వరపడినారు. తమరు తమ అనుభవముతో వీరి సమస్యకు సమాధానము చెప్పగలరని మా నలుగురి నమ్మకము. అంత ప్రధానమంత్రి మీరు అన్నమాట నిజమే.



నేను నేనుగా గమనించి మీ నలుగురు కుమారుల ఆసక్తిని గూర్చి నిర్ధారణముకు వచ్చినాను. వ్యాయామశాల అధికారితోను, సైన్యాధ్యక్షుడితోను పిల్లలకు తగిన శిక్షణ ఇవ్వవలసినదిగా, అన్నాను. ఇక సందేహము లేకుండ వారికి తగిన శిక్షణ ఇచ్చే ఏర్పాటు చేసినారు. ఈ పరీక్ష విషయము మీకు నేను చెప్పలేదు. కొన్ని విషయాలు గోప్యముగా ఉంచడమే మంచిది. కుమారులు నలుగురు ఎంతో శ్రద్ధగా ఈ విద్యలలో తీవ్రకృషి చేస్తున్నారు. ఈ విషయము అప్పుడప్పుడు నేను కనుకొంటూనే ఉన్నాను. కాని ఈ విషయములో మీరు సంతృప్తిగా లేరన్న విషయము నాకు తెలియదు. పిల్లలు ఏ విషయములో శ్రద్ధ ఆసక్తులు కనబరిస్తే వారిని ఆ త్రోవలోనే వెళ్ళనివ్వడమే శ్రేయస్కరము. ఈ విషయము మీకు తెలియనిది కాదు. ఇంత వరకు మీ నుండి ఏ విధమైన ఆలోచన రాలేదు. స్పందన కూడ రాలేదు. కాబట్టి మీరు కూడా ఇందుకు సమర్థిస్తున్నారనే నేను భావిస్తువచ్చినా. అంత పర్ణిసోదరులు మా సమస్య పిల్లలకు గూర్చి కాదు. మాకు ఎంతోకొంత భేదాభిప్రాయాలు ఉన్నను రెండు రోజుల క్రింద రాచకన్యలు మా సమస్యకు పూర్తి సమాధానము ఇచ్చి మా సమస్యను పూర్తిగా తీర్చివేసినారు. మా పిల్లలు ఏ విషయములపై ఆసక్తి చూపిన అదే విషయము నేర్చుకోవాలనేదే మేము అంగీకారమునకు వచ్చినాము. అందుకు మేము ఏ విధమైన అడ్డంకులు పెట్టదలచలేదు. మా సమస్య ఏమిటంటే ఇంతవరకు మేము జీవితములో సాధించిన ధ్యానము, ఏకాగ్రత, తపస్సు, జ్ఞానము, ఇది మాతోనే ఉండి పోవలసిదేనా! పిల్లలు నలుగురు ఈ విషయములో ఏ విధమైన ఆసక్తిని చూపించడం లేదు. ఇది మా సమస్య అన్నారు. మీ పిల్లలు నలుగురు మీ విద్యలపై ఆసక్తి చూపక యుద్ధవిద్యల పట్ల రాచవిద్యల పట్ల శ్రద్ధ ఆసక్తి చూపిస్తున్నారు. ఇక ఏకాగ్రత వారికి చాలా ఎక్కువగా ఉన్నది. ప్రతి విషయమును ఎంతో తొందరగా గ్రహిస్తారు మరచిపోరు. ఏకాగ్రత అనునది ప్రతి విషయము

లోను అవసరము. ఇక మీ వద్ద ఉన్న సకలశాస్త్ర పారంగత్యము దైవిక శక్తులు ఎలా ఉపయోగించాలో, ఎలా ముందుతరాలకు పంచాలి ఇది మీ సమస్య. నేను విషయము కూలంకషంగా ఆలోచించి మహారాజా వారి తోను చర్చించి ఒక వారంరోజులో మీకు సంతృప్తి కరమైన మార్గమును తెలుపుతాను. నాకు వారం రోజులు గడువు ఇవ్వవలసినదని ప్రధానమంత్రిగారు అన్నారు. పర్ణిసోదరులు అలాగే ఇందులో తొందరపడే విషయము ఏమియును లేదు కదా! అనగా సమావేశము ముగించుకొని అందరు బయలుదేరినారు.

వారం రోజుల తరువాత ప్రధానమంత్రి గారి నుండి సమావేశము ఏర్పాటు చేయబడినదని రావల్సినదిగా సమాచారము అందినది. అంత సుఖపర్ణి ముఖపర్ణి సోదరులు వారి భార్యలు కలువకుంతల, సంపంగి హాసిని లతో సమావేశ మందిరమునకు చేరుకున్నారు. అప్పటికే మహారాజావారు, మహారాణివారు, ప్రధానమంత్రి గారు ఇతర సలహాదారులు సమావేశ మందిరములో ఆసీనులైఉన్నారు. పర్ణి దంపతులు కూడ రాగానే ప్రధానమంత్రి గారు వారిని ఉద్దేశించి మనము వారము రోజుల క్రింద సమావేశమై మీ సమస్యను గూర్చి చర్చించినాము. దాన్ని నేను మహారాజావారికి విన్నవించినాను. తరువాత మహారాజావారు రాణిగారు ముఖ్య సలహాదారులు అందరు కలసికొంత తీవ్రముగా చర్చించినాము. సమస్య చాలా గంభీర్యమైనదిగా తోచడము వలన కొంత సమయానికి కూడ ఎవరికైన సరైన సమాధానము స్ఫురించినట్లుగా తోచలేదు. కొంత తడువుకు మహారాణివారు ఒక ప్రస్తావనను ప్రతి పాదించినారు. దాని పట్ల మేము అందరము సుదీర్ఘముగా చర్చించినాము. మహారాణి వారి ప్రస్తావన చాలా బాగుగా ఉన్నదని అనిపించినది. మేము అందరము అందుకు సమ్మతము తెలిపి మీకు కూడ తెలిపి ఒకవేళ మీరు కూడ ఆమోదయోగ్యమైనట్లు అనిపిస్తే దానిని త్వరగానే ప్రణాళిక బద్దము



చేసి కార్యముకొనసాగిద్దామనే నిర్ణయానికి వచ్చినాము ఒకటి రెండు సార్లు సమావేశమై మీరు సరేనంటే గాని లేదా మీకేదన్న ప్రత్యామ్నాయ మార్గము ఉన్నదని కూడ ఆలోచించినాము. చివరకు మా కందరకు తోచినది ఇదే. అన్నిటికన్న ఉత్తమమైన మార్గముగా గోచరించగా తెలపాలని నిర్ణయించుకున్నాము.

ఈ ప్రణాళిక వివరణ సవిస్తారముగా ఏమంటే ఇది చాలా సులభమైనది. సాధ్యమైనది. ఆచరించయోగ్యమైనది. మహారాణి వారి ప్రస్తావన ఏమంటే మన రాజ్యములో ఆధ్యాత్మిక విద్యలోను ఏకాగ్రత విషయములోను, ధ్యానములోను తపస్సులోను ఎందరో పండితులు విద్వాంసులు అధ్యాపక వృత్తి చేస్తు పిల్లకు శిక్షణ ఇస్తున్నారు. అది ఎంతవరకు సమగ్రమైనది అనే విషయము ఎవరికిని అంతగా తెలియదు. గురువులు వారి వారి ఇండ్లలో తమ తమ శిష్యులకు బోధన చేస్తువారికి శిక్షణ ఇస్తున్నారు. అంతేకాని సమగ్ర శిక్షణ సంస్థలు కాని విద్యవ్యవస్థ కాని లేదు. దాని విషయములో ఇంతవరకు ఎవరి దృష్టి పోలేదు. అందువలన మహారాణి వారు ఒక ప్రస్తావన తెచ్చినారు. ఇప్పుడు మీ కుమారులు రాచరికపు విద్యల పట్ల ఆసక్తిని చూపించడము పట్లను, మీ వద్ద గల మరి మీరు పొందిన అపార విద్యాశక్తులు ఇకపై ఉపయోగము లేకుండ పోతాయని, మీరు పడుతున్న వ్యధ అందరికి అర్ధము అయినది. అందుకుగాను మహారాణి వారు ప్రతిపాధించినారంటే ఒక తాటిమీద లేని ఈ విద్యను విద్యా ప్రణాళికను ఒక విధముగా ప్రణాళిక బద్దముగా చేసి రాజ్యములో ఒక పెద్ద విద్యాసంస్థను స్థాపించి మిమ్మల్నిద్దర్ని ప్రధాన అధ్యక్షులుగా అధ్యాపకులుగా, నియమించి ఇంకా కొందరు సరైన అర్హత కలిగిన పండితులను, అధ్యాపకులుగా నియమించినచో ప్రతి సంవత్సరము కొందరు విద్యార్థులను చేర్చుకొని వారికి అన్ని విషయములలలో బోధన, శిక్షణ ఇచ్చినట్లైన, అది మీ పర్యవేక్షణలో జరిగిన రాజ్యములో విద్యావ్యవస్థ

ఒక పద్ధతి ప్రకారము జరిగే అవకాశము ఉన్నది. అందుకు తగిన వనరులు భూసేకరణ ఆర్థిక విషయాలు ఆశ్రమ పాఠశాలకు అవసరమైన అన్ని హంగులకొరకు రాజ్యకోషాగారము నుండి సహాయము లభ్యమవుతుంది. ఎందరో విద్యార్థులు మంచి యువకులగ మీ అంత ధీటుగా తయారయ్యే అవకాశము కల్గుతుంది. అరకొరగా అక్కడ పండితుల ఇండ్లలో జరిగే విద్యాదానము కన్న ఇవి ఎన్నో రెట్లు మెరుగుగా ఉంటుంది. ఇతర రాజ్యముల నుండి కూడ సమయానుకూలముగా పండితులను విద్యావేత్తలను ఆహ్వానించి ఇక్కడికి అధ్యాపకులకు విద్యార్థులకు శిక్షణ ఇవ్వగలిగే అవకాశము కూడ ఉంటుంది. మీరు మీ నలుగురు కుమారుల విషయము కాకుండా విశాల హృధయముతో దృక్పధముతో ఈ కార్యక్రమము చేపట్టినట్లైతే మన రాజ్యము ఒక గొప్ప విద్యానిలయము అవుతుంది. ఇది మహారాణివారు ప్రస్తావించగా మేమందరము చర్చించి ఇదే గొప్ప మార్గమని అభిప్రాయానికి వచ్చినాము. మీరు కూడ ఈ విషయము సవిస్తారముగా ఆలోచించి చర్చించి నిర్ణయము తీసుకున్నట్లైతే తదుపరి ప్రణాళికలు సిద్ధము చేసుకొన వచ్చును. అస్తవ్యస్తముగా ఉన్న విద్యాశిక్షణ ఒక ప్రణాళిక బద్ధముగా తయారు కావడానికి అవకాశము ఉంటుంది. మీరు ఆలోచించి మీ నిర్ణయము తెలియచేసిన నేను నా సహాయకులను మహారాజావారి అనుమతితో మిగిలిన విషయాలు భౌతికముగా, అనుసరించవలసిన వివిధ కార్యక్రమాలు తయారు చేసి మనమందరము కలసి దీనికి తుదినిర్ణయము ఇచ్చిన పనులను మొదలుపెట్ట వచ్చును. అనగా పర్ణిసోదరులు మాకు ఒక రెండు రోజుల వ్యవధి అవసరము. మీరు ఇచ్చిన ఈ పద్ధతి కొంత వరకు ఆమోద యోగ్యము అయినను మీరు చెప్పిన ప్రస్తావనను మేము నలుగురము చర్చించుకొని తుది నిర్ణయము మీకు తెలియపరుస్తాము అనగా అందరు సరేనని సమావేశము ముగించినారు.



ఉన్నత విద్యా ఉన్నత ప్రణాళికలతో భావి తరాలకు అందించడము శ్రీ మహావిష్ణువు మీకు ఇచ్చిన అవకాశమని మీలో ఉన్న శక్తి సామర్థ్యములు, విద్యా మీ కుమారులకు అందలేదని విచారించకుండ విశాల దృక్పథముతో ఇంత వరకు మీరు ఈ రాజ్యానికి రకరకాలుగా సేవలందించినారు. మీరు రోజు వారిగా ధర్మశాలలో ప్రజల సమస్యలకు పరిష్కారము చూపిస్తున్నారు. మీ వద్ద ఉన్న ఈ శక్తిని భావితరాలకు ఉపయోగపడే విధముగా ప్రయత్నించండి, సాధించండి. ఇందులోనే మీ జీవితాలకు సార్థకత ఏర్పడుతుంది. అంతే కాకుండ తరతరాలకు కూడ మీ ప్రఖ్యాతి ప్రవహిస్తూనే ఉంటుంది. ఇందుకు సందేహము లేదని పర్ణిసోదరులకు వారి భార్యలు చెప్పగా వారికి కూడ మనస్సు సమాధానపడి ఎంతో సంతృప్తి కల్గినది. ఈ కార్యక్రమము నిర్వహణలో తగిన ప్రణాళికలను సిద్ధము చేయడానికి పూనుకున్నారు. వారిద్దరు కూడ తమ భార్యలను తమకు తెలిపినంతలో ఇతోధిక సహాయము చేయవలసినది అడిగినాము. ప్రధానమంత్రిగారు పర్ణిసోదరుల దంపతులు సమావేశము కాగానే మీరు ఇక వేరే విషయాలపై ఎక్కువ శ్రద్ధ చూపకుండ గురుకుల ఉన్నత పాఠశాల వ్యవస్థను గూర్చి మీ ఆలోచనలు ప్రణాళికలు ఒక కార్యరూపము దాల్చే విధముగా పథకాలను సిద్ధము చేయగలరు. మనము ఎంత తొందర పడిన అన్నిరకాల వసతి సౌకర్యాలు వనాలు కావల్సిన భావ పరిసరాలు అందరికి కావల్సిన ముఖ్య అవసరాలు అన్నిటిని సిద్ధము చేయండి. మీకు ఏవిధమైన సహాయ సహాకారాలు కావాలన్నా రాజకీయ యంత్రాంగము ఎప్పుడును సిద్ధముగా ఉంటుంది. అనగా రాచకన్యలు ఈ కార్యక్రమమునకు ఒక చిన్న సంఘము నియమించినచో బాగుంటుంది. మేము నలుగురము స్థూలముగా విషయ నిర్ణయము చేసినను ప్రతి విషయములోను చిన్న చిన్న అడ్డంకులను గూర్చి వాటిని భౌతికముగా అమలు చేయడాన్ని గూర్చి వాటిని సిద్ధపరచడము గూర్చి సాధించడము

గూర్చి అంతయును కాక భావితరాల అవసరాల గూర్చి ప్రణాళికను చేయుట చాలా బృహత్కరమైన కార్యము ఇందుకు ఎంతో శ్రమశక్తి అవసరము ఉంటుంది. పర్ణి సోదరులకు అందగా ఈ సంఘము పని చేసినట్లైతే వారి పని సులభసాధ్యము అయ్యే అవకాశము ఉంటుంది. అనగా ప్రధానమంత్రిగారు నేనును ఈ రాజ్యములో కల ప్రణాళిక సంఘ సభ్యులు మరి ఆర్థిక నిపుణులు, ఇతరత్ర వ్యవహార నిపుణులతో నేను రెండు రోజులలో వారి పేర్ల చిట్టా తయారు చేసి ఇస్తాను. మీరు వారిని కలసి వారితో మాట్లాడి వారితో మాట్లాడి మీకు అనుకూలముగా అనిపించిన వారిని సభ్యులుగా నియమించగలరు. మరి ఎక్కువ మంది సభ్యులు కాకుండ అవసరము మేరకే సభ్యుల సంఖ్యను నిర్ణయించినట్లైతే మీరు ఉద్దేశించిన దారిలో వారు తమ తమ వివరాలు వాటికి సంబంధించిన ప్రగతి సమయానికి మీకు తెలియచేస్తారు. మీరు మీ అంగీకారము తెలిపిన పిదప వారు మిగిలిన పనిని చేస్తుంటారు. సమయానుకూలముగా మీకు నివేదికలను, జరిగిన పనులు పెరుగుదలను గూర్చి విన్నవించుతారు. అందువలన మీరు ఈ కార్యక్రమము తొందరగా పూర్తి చేసే అవకాశము ఎక్కువగా ఉంటుంది. అనగా పర్ణిసోదరులు ఇది చాలా దివ్యమైన ఆలోచన అందుకు మేము సమ్మతిస్తున్నాము. మీరు ఆ కార్యక్రమములో ఉండండి. మరి రెండు రోజుల తరువాత మనము మరల కలుద్దాము.

పర్ణిసోదరులు వారి భార్యలు రెండు రోజులు పని పూర్తి అయిన తరువాత ఇక భౌతిక వనరుల భూసేకరణ స్థలము ఆర్థిక వనరులు ఇతరత్రా కావలసిన విధి విధానాలు ఈ ఉపసంఘము సూచిస్తుంది. మనము ముఖ్యముగా అధ్యాపకుల నియామకము వారికి కావల్సిన ఉండవలసిన ప్రాథమిక విద్యా గుణ గణముల గూర్చి ఒక విషయసూచిక తయారు చేయాలి. నియమించిన అధ్యాపకులకు మనకు కావల్సిన



విధముగా విద్యాబోధన చేసే విధముగా వారికి ప్రాథమిక శిక్షణ వాటి ప్రణాళికలను మనము నిర్ణయించవలసి ఉంటుంది. మన గురుకులములో ఏ ఏ విషయాలపై విద్యాబోధన జరగాలి వాటికవసరమైన హంగులు నిర్ణయించాలి. అధ్యాపకుల ఎన్నిక తరువాత ఇక విద్యార్థుల ఎన్నిక ఎలా చేయాలి అవేవిషయ నిర్ధారణకు రావాలి. మన గురుకులములో మొదటి నుండి కాకుండా కొంత స్థాయి నుండి, విద్యాబోధన చేస్తే బాగుంటుంది. అందుకు మనము ఏమి చేయాలి పిల్లలకు కొంత చదువు వచ్చి ఉండాలి. వారు మన గురుకులములో ప్రవేశానికి ఒక ప్రవేశ పరీక్షను మనము సిద్ధపరచవలసి ఉంటుంది. ప్రవేశపరీక్షల ఉత్తీర్ణులైనవారు తరగతులలో ప్రవేశాలు పొంది విద్యాభ్యాసము మొదలు పెడతారు. అంతవరకు బాగున్నది. కాని ప్రవేశ పరీక్షలలో ఉత్తీర్ణులు కాని వారి సంగతి సమస్య ఏమిటి? వారు ప్రవేశ పరీక్షలో ఉత్తీర్ణులు కాకపోవడానికి తక్కువ అయిన వారి వద్ద లేని మానసిక స్థితిగాని గ్రహించగలిగే శక్తిగాని తెలిసినది తిరిగి వ్రాసే సామర్థ్యము గాని లేదా! దాని విశ్లేషణము చేయవలసి ఉన్నది. ఒకవేళ ఎంతో కొంత మంది అర్హత సంపాదించుకోలేక పోయిన అందుకు కారణాలు ఏమి? అవి సరిదిద్దగల మార్గాలు ఏమైన ఉన్నాయా వాటిని గూర్చి ఆలోచించవలసి ఉంటుంది. పిల్లలు పరీక్షలో ఉత్తీర్ణులు కాకపోవడానికి రకరకాల కారణాలు ఉంటాయి. ఒకటి సామాజిక కారణాలు, రెండు కుటుంబ కారణాలు, మూడు ఆర్థిక పరమైన కారణాలు, నాలుగు పిల్లల వ్యక్తిగత కారణాలు, వీటికి మనము విశ్లేషణ చేసిన వాటిని సరి చేసిన మరికొంత మంది పిల్లలు చదువుకొనే అవకాశము కల్పించిన వారమవుతాము. ఇక చాలా కొద్దిమంది పిల్లలు ఏ విధమైన సంస్కారానికి నోచుకోని విధముగా ఉంటారు. వారిని వారి తల్లిదండ్రులకు అప్పగించి వారిని సరిదిద్దే అవకాశాలను తల్లిదండ్రులకు వివరించి పంపించాలి. ఇది స్థూలముగా మన ప్రవేశ విధానాలపై మనము తీసుకొనవలసిన చర్య అనగా అందరు అందుకు సమ్మతించినారు.

ఇంతవరకు రాజ్యములో ఇంత పెద్ద విద్యాసంస్థ లేదు. చిన్న చిన్న గురుకులాలు, కొందరు గురువులు స్వయంగా విద్యాభ్యాసములను పంచుతున్నారు. కాని ఈ విధముగా తగిన స్థాయికి రాని విద్యార్థుల గూర్చి ఎవరును ఆలోచించలేదు. స్థాయికి రాని పిల్లల గతి ఏమి? వారి భవిష్యత్తు ఏమి అని ఎవరును ఆలోచించలేదు. వారు జీవితములో కూలీలుగానే లేదా ఎవరి కన్న ఏదో సేవ చేస్తూ వెళ్ళభుచ్చుతున్నారు. తప్ప వారి స్థాయిని మెరుగు పరచే విధముగా ఎవరును ఆలోచించలేదు. ఇది వారి భవిష్యత్తుకు ఒక పూలబాట అవుతుంది. తమస్థాయికి రాని పిల్లలలో కొందరన్న తమ స్థాయిని పెంచుకోవడానికి ఇది చక్కటి పథకము. ఇది దేశ భవిష్యత్తుకు మంచి పునాదిరాయి అవుతుంది. ఇలా రాజ్య గురుకుల వ్యవస్థాపన నిర్ణయము జరిగిన తరువాత మహారాజావారు గురుకుల నిర్మాణానికి వసతులు సౌకర్యాలు, విద్యావిషయములో పథకాలు, ప్రణాళికలు, తయారు చేసి గురుకుల ప్రారంభానికి ఆరు నెలల వ్యవధి గుడువు ఇచ్చినారు. ముఖ్య భాద్యత పర్ణి సోదరులకు అప్పగించినందున ప్రతి విషయానికి చిన్న చిన్న సహాయ బృంధాలను ఏర్పర్చి పని సులభముగా అయ్యే విధముగా వ్యవహరించడానికి ప్రధానమంత్రి గారికి అన్ని అధికారాలను ఇచ్చినారు. యమున నది ఒడ్డున ఒక పది ఎకరాల స్థలమును సేకరించి పనులను మొదలు పెట్టినారు. గురుకులములో వివిధ శాఖలకు సంబంధించిన భవనాలను పరిపాలనపరంగా విడిగా ఒక భవనమును, అధ్యాపకుల నివాసాలు, విద్యార్థుల వసతి గృహాలు, సభలు సమావేశాలు నిర్వహించడానికి తగిన గృహాలు, వంట గదులు, పదార్థాల నిలువలకు తగిన వసతి, స్నానాల గదులు, మలవిసర్జన గదులు, ఇలా అన్ని సౌకర్యాల కొరకును తరువాత పనివారల కొరకు నివాస గృహ్వాలు అలాగే వైద్యుల వారి వసతి సౌకర్యాలు ఇలా అన్ని విషయాలకు ప్రాధాన్యత ఇస్తు తగిన గ్రహాల నిర్మాణము చేపట్టబడినది. పరిసరాలను



అందముగా, సుందరముగా ఉంచడానికి పూల మొక్కులు ఇతర అలంకారాల విషయములో కూడ శ్రద్ధ తీసుకొనబడినది. గురుకుల ఆర్థిక వ్యవస్థ సక్రమముగా నిర్వహించుట కొరకు ఒక ప్రత్యేక ఆర్థిక నిపుణుడైన అధికారిని కూడ నియమించడము జరిగినది. పుష్ప వాటికలకు పూల వాటికలకు స్థలము నిర్దేశించడము జరిగినది. గురుకుల స్థలము చుట్టు రెండు వరుసలలో పూలు, పండ్ల వృక్షాలు, చెట్లు ప్రతిపాదించబడినవి. ఆ విధముగా మొక్కలు నాటే ఏర్పాట్లు చేయబడినవి. యమున నది నుండి నీటిని గురుకులములోని అన్ని అవసరాలకు వాడుకొనే విధముగా సౌకర్యము కల్పించబడినది. అధ్యాపకులు, ఆచార్యుల నియామకముల గూర్చి పర్ణి సోదరులిద్దరు ప్రయత్నించి మంచి విద్యా అర్హత కల్గిన వ్యక్తులను ఎంపిక చేయడము జరిగినది. ప్రధానమంత్రి అధ్యక్షతన ఒక ఉన్నతాధికారిని పరిపాలనా వ్యవహారములను మరొక ఉన్నత అధికారిని ఆర్థిక సాంఘీక వ్యవహారాలను చూడడానికి నియమించడము జరిగినది. ఇది ఇలా ఉండగా పర్ణి దంపతులు ఒక ఆలోచన చేసినారు. రాజ్యము నుండి రాజకోషాగారము నుండి కావల్సిన ఆర్థిక వనరులు సమకూర్చబడినను తరువాతి కాలములో గురుకులము ఆర్థికముగా స్వయం ప్రతిపత్తికల వ్యవస్థను తయారు చేసుకొనవలసిన అవసరము గూర్చి ఆలోచన చేసి మహారాజావారు రాజకుటుంబము ప్రధానమంత్రి మరి ఆర్థిక సలహాదారులతో సమావేశము ఏర్పర్చి తమ ఆలోచనను వారి ముందుంచి అందుకు తగిన ప్రణాళికలను సిద్దము చేస్తే, బాగుంటుందని అనగా అందరు ఇది చాలా బాగున్నది ఈ విషయము గూర్చి తొందర లేక పోయినను ఆలోచించవలసిన అవసరము ఉన్నది. ముందు చెట్టుపుట్టలు తొలగించి దాన్ని చదును చేసి ఆ తరువాత ఏఏ గృహాలు ఎక్కడ వచ్చేది నిర్ణయించి అందుకు తగిన పటాలను తయారు చేసి పనులు మొదలు పెట్టడము జరిగినది. ఒక వందమంది వడ్రంగులను

నియమించి గురుకులానికి కావల్సిన బల్లలు, మేజాలు, బేంచీలు, కుర్చీలు నల్ల బల్లలు సమావేశ గృహానికి, సభగృహానికి కావల్సిన కుర్చీలు వసతి గృహాలకు కావల్సిన మంచాలు మొదలగు పరికరాలను తయారు చేయించడానికి యుద్ధ ప్రాతిపదికన పనులు మొదలు అయినాయి. పని సమయములో కూలీలకు పర్యవేక్షకులకు మొదలగు వారికి సమయానికి ఆహారము ఇవ్వడానికి తాత్కాలికముగా వంటశాలను సరుకులు నిలువ ఉంచడానికి గృహము నిర్మించడం జరిగినది. వచ్చే కార్తీక పూర్ణిమ రోజు గురుకులము స్థాపించి ప్రారంభోత్సవము చేయడానికి నిర్ణయము జరిగినది.

భాషా, గణితము, వ్యాకరణము, జ్యోతిష్యము, భౌతిక, రసాయన శాస్త్రములు, వ్యాయమము, ధ్యానము, ఏకాగ్రత, మొదలగు విషయాలను బోధించుటకు దేశములోనే కాకుండ ఇతర రాజ్యముల నుండి కూడ అర్హులైన వారిని ఆచార్యులుగా నియమించడం జరిగినది. కార్తీక పౌర్ణమి రోజు చిన్న యజ్ఞము చేసి అధికారకముగా గురుకుల పాఠశాలను ప్రారంభించినట్లు మహారాజా వారు ప్రకటించినారు. పర్ణి సోదరులు వివిధ శాఖల అధ్యాపకులను ఆచార్యులను, మహారాజావారికి పరిచయము చేయడము జరిగినది. మహారాజావారు అక్కడ చేరిన అందరిని ఉద్దేశించి గురుకుల పాఠశాల ప్రారంభోత్సవము ఇక మీరందరు సమావేశము అయి విద్యార్థుల ప్రవేశానికి నియమాలు ఏర్పాట్లు చేయవలసినదిగా ఉన్నది. ప్రవేశ పరీక్షలలో ఉత్తీర్ణులు కాని వారి విషయము గూర్చి పర్ణి సోదరులు చక్కని ప్రతి పాదనలు చేసినారు. మీరందరు ఆ విషయము శ్రద్దగా చర్చించి భావితరాల పౌరుల భవిష్యత్తును గూర్చి ఆలోచించి కార్యక్రమాలను నిర్ణయించవలసిన అవసరము ఎంతైన ఉన్నది. అంత ప్రధానమంత్రి గారు ఈ రాజ్యములో ఈ గురుకుల స్థాపనకు ఆ ఆలోచనకు పర్ణి దంపతులే కారణము విద్య, కొందరి కొరకే కాదు అని చాలా విశాల దృక్పథముతో అందరికి విద్య అవసరమని అది ఒకరి సొత్తు కాదని అది అందరికి



అందేలా చూడడమే వారి ప్రాథమిక ఉద్దేశ్యము. దానిని మహారాణి వారు ప్రణాళిక బద్దము చేసినారు. మేమందరము ఈ ఆలోచనకు కొంత రూపకల్పన చేసిన వారము. ముఖ్యముగా వీరి తపనే కార్యరూపము దాల్చుటకు కారణమైనది. గురుకులములో అన్ని విభాగముల లోను, కలిపి మొత్తము ఒక వంద మంది విద్యార్థులకు అవకాశము కల్గించడానికి ప్రణాళిక సిద్దముగా, ఉన్నది. విద్యార్థులందరికి ఉచిత విద్యా, వైద్య, వసతి, ఆహార సదుపాయాలు ఇవ్వబడతాయి. వారి నుండి ఏ విధమైన శుల్కము సేకరించబడదు. ఈ విషయము మన రాజ్యములోను ఇతర రాజ్యాలలోను ప్రచారము చేయడము జరిగినది. మీరు ప్రవేశ విధానాలను స్థిరపరచిన ఒక సమావేశములో వాటిని గూర్చి చర్చించి తుది నిర్ణయము తీసుకొనడము జరుగుతుంది.

అనుకున్న ప్రణాళిక ప్రకారము గురుకులము ప్రారంభించబడినది. ప్రవేశాలు కూడ జరిగినవి. విద్యార్థులకు విద్యాబోధన మొదలు అయినది. ఉన్నత, ప్రమాణములతో, ఉన్నత విద్యావిధానాలతో గురుకులము అంత పర్ణి సోదరులు ప్రతిపాదించిన విధముగా సవ్యముగా జరుగుతున్నది. పర్ణిసోదరులు ప్రతినిత్యము ప్రతి విషయములో శ్రద్ధ తీసుకొని సమయాను కూలముగా నిర్ణయాలు తీసుకొని విధివిధానాలను తదనుగుణంగా రూపొందించి గరుకులాన్ని నడిపించసాగినారు. అలా సంవత్సరాలు గడిచినవి గురుకులము ఎన్నో విధాలుగా ఎంతో అభివృద్ధిని చెంది దేశానికి మంచి పౌరులను అందించే విధముగా పని చేయుచున్నది. అన్నిరంగాలలో విషయాలలో నిష్ణాతులైన అధ్యాపకులు, ఆచార్యులు, విద్యార్థులకు మంచి విద్యను అందించసాగినారు. మహారాజుగారు రాజ్యప్రజల గురుకుల వ్యవస్థకు ఎంతో సంతృప్తి చెందుతున్నారు. తమ సంతోషాన్ని వ్యక్త పరుస్తున్నారు. ఇలా కొంత కాలము గడిచిన తరువాత పర్ణిసోదరులు తమ బాధ్యతలను మెల్లిమెల్లిగా క్రింది ఆచార్యులకు అధికారులకు అప్పగించి కొంత బాధ్యతల నుండి తీరిక పొందసాగినారు. గురుకుల

బాధ్యతలు కొంత తగ్గిన తరువాత వారు తరచుగా ఏకాగ్రత మరియు ధ్యానములో గడపసాగినారు. ధ్యానము ద్వారా శ్రీ మహావిష్ణువు కృపను పొందినను ఇంకా శ్రీ మహావిష్ణువు ధ్యానమును చేసి వారి కృపకు ఇంకా కొంత ప్రాప్తి పొందాలని ఇంకా కొంత ఎక్కువ ధ్యానమును తపస్సు లా గా చేయసాగినారు.

**శ్రీవత్స పక్ష సహస్రానామాలంకృత**
**దేవ దేవ శ్రీదేవి, భూదేవి వల్లభా**
**సధా పద్మధర మా ఏకాగ్రతకు మూలమా**
**మా జీవిత సాక్షాత్కారమా**

ఇలా రోజు రోజుకు ఎక్కువ కఠినముగా శ్రీ మహావిష్ణువు ధ్యానములో నిమగ్నమవ్వ సాగినారు. నిన్ను వర్ణింప ఎవరితరము. నీ శక్తి అమోఘము నీ సామర్ధ్యము అనంతరము అంతులేనిది. ఇలా రోజుకోరకముగా శ్రీ మహావిష్ణువును ప్రార్ధించి ధ్యానములో నిమగ్నమవ్వ సాగినారు. ఉపవాసాల మీద ఇద్దరికిని నమ్మకము లేదు. కృషి భూత శరీరము, కృషి భూత ఆలోచనవలనే ఉత్పాదించును అని కొంత అల్పాహారమును ఒక్కొక్కసారి పానీయములను ద్రవపదార్ధములను సేవిస్తు ధ్యానము చేయసాగినారు. మన శరీరములోనే నరాలు, మనస్సు, శక్తులు అన్నిటిని భృకుటి మధ్యలో ఆజ్ఞాచక్రములో ఉంచి శ్రీ మహావిష్ణువు దివ్య మంగళ విగ్రహముపై కేంద్రీకరించి ఏకాగ్రతతో ధ్యానము చేయసాగినారు. వారి ధ్యానానికి భంగము వాటిల్లకుండ వారి భార్యలు కలువకుంతల, సంపంగి హాసిని అన్ని సౌకర్యాలను సమకూర్చసాగినారు.

**శ్రీధర, శ్రీ నిలయా, శ్రీనివాస, శ్రీ ప్రియ, శ్రీ వల్లభ,**
**శ్రీపతి, శ్రీరంగనివాసా, శ్రీ బదరీనాథ నివాసా,**
**శ్రీ నిధి, శ్రీ స్వయంభూ, శ్రీ కాంత,**



ఇలా పరిపరి విధముల శ్రీ మహావిష్ణువు పేర్లను ధ్యానించసాగినారు. ధ్యానము ఏకాగ్రత తీవ్రతరము చేసినను తమ భార్యల పట్ల పిల్లల పట్ల, ప్రజల పట్ల, నిర్లిప్తతత గాని నిర్లక్ష్యముగాని లేకుండ సామాన్య సహవాస జీవనము కూడా సాగించసాగినారు. ఇది వరకు నుండే రోజు వారిగా ధర్మశాలలో ప్రజల కష్టాలను వారి సమస్యలను విని వాటిని తీర్చుడము సలహాలు ఇవ్వడము మాత్రము మానలేదు. వారి అభిప్రాయము ఏమిటనగా వారు సమాజములో ఉన్న వ్యక్తులు, సమాజ శ్రేయస్సును గూర్చి కోరి ఇదివరకు పాటు పడేవారు అంతేగాని సర్వసంగ పరిత్యాగులు సన్యాసులు కారు. తమకు ముందు సాంసారిక సమాజిక బాధ్యతలు నిర్వహించిన తరువాతనే తమ స్వయంకృషికి ప్రాధాన్యత ఇవ్వాలని వారి నిర్ణయము. వారి నిర్ణయాలను కాని నడవడికను గాని ఎవరు తప్పుపట్టడానికి వీలులేదు. ఇలా ప్రతి పనిలోనూ ప్రతి వ్యక్తిలోను, ప్రతి కార్యములోను, ప్రతి అవకాశములోను, ప్రతి అణువులోను, ప్రతి వస్తువులోను శ్రీ మహావిష్ణువును దర్శింప సాగినారు. ఇతరత్రా పనులు కూడ సహజసిద్దముగా నిర్వర్తించి ధ్యానములో మాత్రము ప్రతి శ్వాసలోను శ్రీ మహావిష్ణువును దర్శించసాగినారు. ప్రతి ఊపిరిలోను స్వామిని చూడసాగినారు.

ఒకరోజు పర్ణి సోదరులు తమ భార్యలతో ఇలా అన్నారు. రెండు రోజుల తరువాత కార్తీక పౌర్ణమి వస్తున్నది. మేము కొంత సమయము ఏకాగ్రతతో ధ్యానము చేయదలచినాము. గురుకుల అధికారులు కాని ఎవరు కూడ మమ్మల్ని ఆరోజు మా ఏకాగ్రతకు ధ్యానమునకు ఏకాంతతకు భంగము వాటిల్లకుండ ఉండాలని అందరికి తెలపండి. మీరు కూడ మమ్మల్ని కలవడానికి గాని, మాట్లాడడానికి కాని ప్రయత్నించకండి ఇది మా కోరిక, ఇలా పర్ణిసోదరులు కార్తీక పౌర్ణమి రోజు తమ కాలకృత్యాలు ముగించుకొని త్రివేణి సంగమములో స్నానమాచరించి మాత గుడిలో

మామూలుగా కూర్చునే మండపములో కూర్చుని ధ్యానములో నిమగ్నమైనారు. ఏకాగ్రతతో తమ దృష్టి అంత శ్రీ మహావిష్ణువుపై కేంద్రీకరించి బృకుటి మధ్యములో చూస్తు ఏ విధమైన ఇతరత్రా ఆలోచనలు లేకుండ ధ్యానమును కొనసాగించినారు. శ్రీ మహావిష్ణువు వారిపట్ల దయాభావము కలిగివారితో ఇలా అన్నారు. పర్ణి సోదరులారా! నేను మీ తపస్సుకు ధ్యానానికి సంతృప్తుడనైనాను. మీరు ఏ కోరికతో నన్ను ధ్యానము చేస్తున్నారు. మీ కోరిక ఏమిటని ఇద్దరికి వినిపించింది. ఇద్దరు కూడా ప్రభు! శ్రీ మహావిష్ణువు మీకు ఇదే మా వందనములు మేము మిమ్ములను స్వయముగా దర్శించాలని ఇక జన్మలు లేకుండ మాకు వరముకావాలని మీ పట్ల మాకోరిక అనగా శ్రీ మహావిష్ణువు వారితో నా దర్శనము ఇప్పుడు మీకు నా వాక్కు ద్వారా దొరికినది కదా! ఇక సాయుజ్యము నన్ను చేరే సమయము ఇంకను ఆసన్నము కాలేదు. భూమిపై మీరు తీసుకున్న ఈ గురుకుల బాధ్యతను ఇంకను పూర్తిగా నిర్వహించవలసి ఉంటుంది. కాలక్రమేణ మీ బాధ్యతలను సక్రమముగా నిర్వహించిన సమయము వచ్చినప్పుడు సహజ మరణము మీకు ప్రాప్తిస్తుంది. ఇక నన్ను చేరడానికి మీ కర్మ పూర్తిగా పరిపక్వము అయినప్పుడు మాత్రమే అది సాధ్యము అవుతుంది. ఇది మీకు బ్రహ్మ వ్రాసిన వ్రాత మీరు నోచుకొన్న ఫలము. కనుక ఈ విషయమును మీ మనస్సులోనే ఉంచుకొని మీరు మామూలు జీవితమును గడపండి. కాలక్రమేణ కర్మఫలపక్వము అయినప్పుడు మీరు ధ్యానించు చున్నట్లుగా నా అవతార దర్శనము కల్గుతుంది. అప్పుడే మీకు సాయజ్యము కడా లభిస్తుంది. ఇదే నేను మీకిచ్చు వరము ఏ విధమైన కోరికలు ఆశలు ఇష్టాలు లేకుండా నిర్విరామంగా జీవితమును గడపండి. సమయము వచ్చినప్పుడే మీరు కోరకుండానే మీకు అన్నియును లభ్యము అవుతాయి. ఇది నా ఆజ్ఞగా భావించండి ప్రజలకు ఇతోధిక సేవ చేయండి. మానవ జన్మ ఎత్తినందుకు గాని బాధ్యతలను కర్తవ్యాలను సక్రమముగా



నిర్వహించండి. ఇకపై నన్ను చూడాలని గాని కలవాలని గాని నా వాక్కులను వినాలని కాని ఏ ప్రయత్నము చేయకండి. మీకు నా ఆశీస్సులు ఎప్పుడును ఉంటాయి. మీకు సర్వత్ర విజయములు లభిస్తాయి. ఇక మామూలు జీవితములోకి వెళ్ళండి. అది శ్రీ మహావిష్ణువు చెప్పగా అన్నదమ్ములిద్దరు ఇది భగవంతుని ఆజ్ఞగా భావించి ధ్యానము ముగించుకొని మాతా దర్శనము చేసుకొని తమ నివాసానికి వెళ్ళినారు. నివాసములో వారి భార్యలు కలువ కుంతల, సంపంగి హాసిని వారి కొరకు ఎంతో ఆతురతతో ఎదురు చూస్తూ కనిపించారు. తమరాకతో వారిని సంతృప్తి పరిచి వారితో మాత తమను నిత్య జీవితము మామూలుగా సాగించండని ఆజ్ఞ అయినదని అన్నారు. తమ భర్తలలో ఏదో మార్పు సంభవించినట్లు రాచకన్యలు గమనించినారు. భావించినారు అది తమ భాగ్యముగా అనుకున్నారు.

పర్ణిసోదరులు శ్రీ మహావిష్ణువు చెప్పినది ఆజ్ఞగా భావించిన తరువాతి రోజులు సామాన్య జీవితము గడుపుతు గురుకుల వ్యాపకాలను పర్యవేక్షిస్తూ ప్రజలకు ఉపయోగమైన కార్యక్రమాలను నిర్వహించసాగినారు. వారి భార్యలు కూడ యధావిధిగా వారికి కావల్సిన సౌకర్యాలకు రోజువారిగా వారి అవసరాలను సమకూర్చసాగినారు. ఒక రోజు కాశీరాజ్యము నుండి ఒక పండితుడు వచ్చి తనకు గురుకుల వ్యవహారములను అధ్యయనము చేయాలనే ఆసక్తి ఉన్నదని తనకు అనుతిని ప్రదానము చేయమని పర్ణిసోదరులను అర్థించినాడు. పర్ణి సోదరులు అలాగేనని వారికి తగిన సౌకర్యాలను సమకూర్చే విధముగా అధికారులను ఆదేవించినారు. ఆ పండితుడు మూడు నెలల పాటు గురుకుల వ్యవహారాలను కట్టుబాట్లను, బోధన పద్ధతులను, అధికార యంత్రాంగాన్ని వారు పాటిస్తున్న పద్దతులను సావకాశముగా అధ్యయనము చేసి ఒక నివేదికను తయారు చేసినాడు. తరువాత ఆ పండితుడు పర్ణి సోదరులను కలిసి తన నివేదికను

సమర్పించగా పర్ణి సోదరులను పండితునితో మీరు చాలా కష్టపడి మా గురుకుల వ్యవహారాలను అధ్యయనము చేసి నివేదికను తయారు చేసినారు. మీరు ముఖ్యముగా చెప్పవలసిన విషయము విశేషము ఏదైన ఉన్నదా? అనగా ఆ పండితుడు గురుకుల వ్యవహారాలను వాటిని నడిపే విధానములో ఏ విధమైన లోటు పాట్లు కాని వ్యవహారాలలో తప్పులు కాని లేవు. కాని ఒకటి నేను గమనించినది ఏమంటే గురుకులములో విద్యార్థుల మధ్య అధ్యాపకుల మధ్య కొంత వ్యత్యాసము కనపడున్నది. వారి మధ్య ఒకరకమైన భావములు అనగా విద్యార్థులు గురువుల పట్ట గౌరవ భాములు మా అధ్యాపకులకు విద్యార్థుల పట్ల దండన భావము కలిగి ఉన్నారు. వారి మధ్యన స్నేహము ప్రేమ, అభిమనాలు లేవు. విద్యార్తులలో భయము మాత్రమే మిగిలినది. గురువులు తాము గట్టిగా తీవ్రతరముగా ఉండకపోతే విద్యార్థులు సరిగా విద్యాభ్యాసము చేయరని అధ్యాపకులలో ఒక భావము ఉన్నది. వారిద్దరి మధ్య దూరము ఉన్నది వారు తమ పిల్లలు అనే భావన అధ్యాపకులకు లేదు. విద్యార్థులు కూడ అధ్యాపకులను గూర్చి భయము భక్తిగానే ఉన్నారు. వారిలో ప్రేమ కలుగలేదు. దీనివలన విద్యార్థులు కొంత మానసిక ఒత్తిడికి మరియు గురువులు కూడను మరోరకమైన ఒత్తిడికి ఇలా ఇరువర్గాల వారు ఒత్తిడికి గురి అవుతున్నారు. అధ్యాపకులు కూడ పిల్లలను దండించిన తరువాత మానసిక ఒత్తిడికి గురి అయినది వారి కుటుంబ వ్యవహారాలలోను ప్రకటింప చేయబడుతుంది. అది ఎలా పోగొట్టాలో వారి మధ్యప్రేమ, ఆప్యాయత, స్నేహభావము బంధుత్వభావమును కలిగే విధముగా చర్యలు తీసుకొనవలసిన అవసరము ఎంతైనా ఉన్నది. ఇప్పుడు మీరు అనుసరిస్తున్నది పూర్వ పద్ధతి పనులను రెండు రకాలుగా చేయించుకొనవచ్చును. ఎదుటివారిని భయపెట్టి ఒత్తిడి తెచ్చి చేయించుకొనడము, రెండవ విధానము ప్రేమతోను వ్యక్తికి మనపట్ల



స్నేహము. దగ్గరితనము ఉంటే పనులు ఇంకా త్వరితముగాను తప్పులు లేకుండాను చేసే అవకాశము ఉంటుంది. వ్యక్తి యొక్క వ్యక్తిత్వము రెండవ పద్ధతి వలన మెరుగుపడే అవకాశము ఎక్కువగా ఉంటుంది. భయభక్తులతో పనులు చేయించుకున్నప్పుడు అది తరతరాలుగా అదే పద్ధతి కొనసాగే అవకాశము ఉంది. దానివలన కొందరైన ఉగ్రవాదులుగాను, మానసిక సంతూలనము సరిగ్గా లేకుండ పెరిగే అవకాశము ఎక్కువగా ఉంటుంది. దండించి చెప్పడము మన మంచికే అనే భావన వారిలో వృద్ధి చెందిన కోపతాపములు పెరిగి పెరిగి పరాకాష్ఠకు చేరుకొనే అవకాశము లేక పోలేదు. కనుక మీరు మీ విద్యాబోదన విధానములోను ప్రాథమికమైన మార్పులు తీసుకొని వచ్చి ముఖ్యముగా అధ్యాపకులకు నేను చెప్పిన విధముగా శిక్షణ కార్యక్రమము సిద్ధము చేసి వారికి అర్థమయ్యే విధముగా ఆచరణ యోగ్యమయ్యే విధముగా ప్రేమను, మాతృత్వ భావమును విద్యార్తుల పట్ల ఎలా వ్యవహరించాలో తెలియచేస్తే బాగుంటుంది. దాని వలన మనము ఒకే మూసలో పెరిగే మనస్సును వివిధ రకాలుగా ఆలోచించే అవకాశాన్ని కలిగించే వారమౌతాము. మనిషి సంతోషముగా ఉన్నప్పుడు సంతృప్తిగా ఉన్నప్పుడు సరైన ఆలోచనలు చేయగలడు. పలు కోణాలలో తనదృష్టిని సాగించగలడు. కనుక మీరు మీ అధికార యంత్రాంగము, అధ్యాపకులు, ఆచార్యులు, విద్యావిధనాము, బోధన విధానములో మార్పులను మౌళికముగా తీసుకొని వచ్చిన విద్యార్థులు మంచి భావిపౌరులుగా కావడానికి అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. ఇది స్థూలముగా నా అవగాహన. పూర్తి వివరాలు నా నివేదికలో పొందుపరచబడినది. ఈ విషయములో అందరు కొంత ప్రత్యేక శ్రద్ధ చూపినూతన విద్యాబోధన విధానములను తయారు చేసి అమలు పరచగలరని ఇది నా నివేదన, విన్నపము.

అంత పర్ణిసోదరులు ముఖ్య సభ్యులను అధ్యాపకులులను మేము కాని ఈ కోణములో ఇంతవరకు ఆలోచించలేదు. మీరు ఇచ్చిన నివేదికను అధ్యయనానికి ఇచ్చి తరువాత వారి వారి అభిప్రాయాలను, సలహాలను, సూచనలను, సేకరించి గురుకుల సర్వసభ్య సమావేవములో తగిన నిర్ణయమును తీసుకొని ఆమోదము పొందినట్టైన నూతన విద్యావిధానానికి తగిన ఏర్పాట్లు అమలు పరచడానికి తగిన అవకాశాలు, అవరోధాలు, ఏమైన అడ్డంకులు ఉంటే తొలగించి నూతన విద్యావిధానమును మీరు ఇఛ్చన నివేదిక ప్రకారము అమలు చేయడానికి ప్రయత్నిస్తాము. ప్రధానముగా మీరు చెప్పిన కొన్ని విషయాలలోను ఆలోచించే అవకాశాలు చాలా ఉన్నవని సర్వసభ్య సమావేశమలో ఆమోదము పొందినచో మహారాజా వారికి కూడ నివేదించి వారి అనుమతి కూడ పొంది వచ్చే నూతన విద్యాసంవత్సరము నుండి నూతన ప్రణాళికను ప్రవేశ పెట్టడము జరుగుతుంది. మహారాజావారి అనుమతితో ఈ విధానం ఒక ఉత్సవము లాంటిది. ఏర్పాటు చేసి మహారాజావారి చేతుల మీదుగా ఈ విధముగా ప్రారంభించడం జరుగుతుంది. తమరికి కూడా ఆహ్వానము అందుతుంది. కనుక మీరు కూడా ఈ ఉత్సవములో పాల్గొనమని మా విన్నపము అంత పండితులు ఓంకారేశ్వరులు గారు కాశి రాజ్యానికి వెళ్ళిపోయినారు.

నూతన విద్యా విధానము గూర్చి అధ్యాపకులతోను, ఆచార్యులతోను, అధికారులతోను రాజ్యమంత్రులతోను, చాలా విస్తృతముగా చర్చలు జరిగినాయి. ఒక సమయములో విద్యార్థులు తల్లిదండ్రులతోను కూడ చర్చలు జరిగినాయి. అందరును ఈ నూతన బోధన విధానము పట్ల ఆసక్తిని ఉత్సవాన్ని కనపరచడము జరిగినది. అన్ని వర్గాల వారితోను చర్చలు జరిగిన తరువాత మరొక అంతరంగీక సమావేశము జరిగి అందులో ప్రధానమంత్రి మరి రాజ్యమంత్రి వర్గ సహచరులు, ముఖ్య సహచరులు, మహారాజావారు, రాచకుటుంబము ఇలా అందరు



సమావేశము అయిన తరువాత పర్ణిసోదరులు గురుకులము ఏర్పాటు అయిన తరువాత ప్రణాళికలలోను విద్యావిషయములోను మార్పు లేదు కాని ముఖ్యముగా బోధన విషయముతోనే మార్పును ఓంకారేశ్వర పండితులు సూచించిన మేరకు బోధన విషయములోనే ప్రధానమార్పును చేయదలచినట్లు అందుకుగాను, ఇంతవరకు శిక్ష భయము బోధన పద్ధతిని తరతరాలుగా ఉన్నదానినే కొనసాగిస్తున్నాము. అలా కాకుండా శిక్షణ అనేది బోధన అనేది రెండవ ఆవరణగా ప్రేమ ఆప్యాయతలతో మొదలు పెట్టి దానినే ప్రధానపద్ధతిగా పాఠ్యాలను బోధించడము వలన విద్యార్థులలో ఏ విషయములోనైన ఇదివరకు ఉన్న అవగాహనలో మార్పు జరిగి వారిని చదువువైపు ఎక్కువగా ప్రోత్సహించినట్లు అవుతుంది. మీకందరకు తెలిసినట్లుగానే ఏ విషయమైన రెండు రకాలుగా సాధించవచ్చును ఒకటి భయము భక్తితోను అభిమానము, ఆప్యాయత తోను జరుగవచ్చును. అని పండిత ఓంకారేశ్వరులు సూచించినారు. మేము గురుకుల విషయములలో ప్రాధాన్యత వహిస్తున్న అన్ని వర్గాలతోను పిల్లల తల్లి దండ్రులతోను సంప్రదించగా వారు అందరు పండిత ఓంకారేశ్వరులవారు సూచించిన పద్ధతి బాగుంటుందని ఏకాభిప్రాయమును వ్యక్తము చేసినారు. కుటుంబములో తల్లిదండ్రులు చిన్నప్పటి నుండి ఎన్నో నేర్పుతారు. వారు వారి ప్రేమను ఆప్యాయతను జోడించి పిల్లలకు నేర్పుతారు. అత్యవసర పరిస్థితులలోనే దండను ప్రాధాన్యత ఇస్తారు. కాని రోజువారిగా వారు నేర్పే విషయాలను ప్రేమకే ప్రాధాన్యత ఉంటుంది. విద్యాలయాలు కూడా ఒకరకముగా కుటుంబ పరిసరాల వంటివే అందువలన ముఖ్యముగా శిక్షకాకుండ ప్రేమాభిమానాలతో చదువు నేర్పిన విద్యార్థుల ఆలోచనలో దృక్పథములో మార్పును విషయాలు త్వరగా నేర్చుకొనే నేర్పును ఎక్కువగా మనము సాధించవచ్చును. ముందు ముందు వారి జీవితాలలో ప్రతి విషయములోను సకారాత్మకముగా ఆలోచించే భావన ఎక్కువగా

కలుగవచ్చును. నకారాత్మకముగా ఆలోచిస్తే అభివృద్ధి చెందే అవకాశము కుంటుపడుతుంది. ఇది మా భి(ప్రాయము కూడాను ఈ నివేదికను ఇక్కడ సమావేశమైన సభ్యులందరకు ఇవ్వడము జరిగినది. మీరు కొంత సమయము తీసుకొని నివేదికను చదివి నిపుణుల అభి(ప్రాయాలను కూడ చదివి ఏవన్న మార్పులు చేర్పులు అవసరమైతే సూచించిన ఎడల మరల రెండు రోజుల తరువాత మనమందరము సమావేశమై క్రొత్త నూతన బోధనా విధానము అమలుకు తుది నిర్ణయము తీసుకున్నట్లయితే అది వచ్చే నూతన విద్యాసంవత్సరము నుండి అమలుచేయవచ్చును మార్పులు చేర్పులు సభ్యుల ఆమోదము తరువాతే నూతన విద్యాబోధన విధానము అమలులోనికి వస్తుంది. నూతన విద్యాబోధన విధానములో అధ్యాపకులకు ఆచార్యులకు ముఖ్యముగా శిక్షణ ఇవ్వవలసి ఉంటుంది. అలాగే విద్యాబోధనే తన సిబ్బందికి కూడ వేరుగ శిక్షణ ఇచ్చే విధానమును రూపొందించబడవలసి ఉన్నది. నివేదికను సభ్యులందరు మొదటి నుండి చివరి వరకు చదివి వారి వారి అభి(ప్రాయాలను తెలుపవలసినదిగా మనవి. ఈ నూతన విద్యావిధానము అమలుకు నిర్ణయము తీసుకున్నట్లైతే మహారాజవారి అనుమతి కూడ అవసరము అవుతుంది. ఇంతటితో సభను ముగించి రెండు రోజుల తరువాత ఇదే సమయానికి సమావేశమై తుదినిర్ణయము తీసుకుందాము అంతవరకు సెలవు.

రెండు రోజుల అనంతరము సమావేశమైనప్పుడు అందరును ఈ నివేదికలో సూచించిన పద్ధతి బాగున్నది. ఇది విద్యార్థులు భావిరాజ్యపౌరులుగా సకారాత్మక శక్తిని వృద్ధి చేస్తుంది. ఇందుకు సందేహము లేదు అన్నారు. అప్పుడు ఒక మం(త్రి వర్యులు నాకు ఒక చిన్న సూచన చేయవలసిన అవసరము కనిపిస్తున్నది. ఈ నూతన విధానములో నేర్పే పద్ధతి చాలా బాగా ఉన్నది ఆచార్యులు, అధ్యాపకులు, విద్యార్థులందరికి బోధన ఒకే విధముగా చేస్తారు అందుకు సందేహము



లేదు, కాని విద్యార్థులు తమ తమ పెరుగుదల పరిసరాలు ఇలా ఎన్నో విషయాలలో వారి మధ్య భేదములు ఉంటాయి. వారు అర్థము చేసుకొనే శక్తి స్థాయి పద్ధతి పేరు వేరుగా ఉండవచ్చును. ఒక విషయాన్ని మనము, మీరు ఆలోచించిన విధానాల ద్వారా కలిగే ఫలితాలను (వ్రాయండి అంటే అలా (ప్రతి విద్యార్థి (వ్రాస్తున్న పద్ధతి ఒకరికొకరికి భిన్నముగా ఉంటుంది. విషయము ఒకటే అయిన వారు వారు వ్యక్తపరిచే విధానములో చిన్న-చిన్న మార్పులు ఉంటాయి. కనుక పిల్లల్లో కొంత ఆంతరంగీక శక్తులు వాటి అవగహనము తెలిసికొని దానిని అభివృద్ధి చేయడానికి ఏ విధమైన సూచనలు కాని అనుసరించవలసిన పద్ధతులు కాని ఇందు పొందుపరచబడలేదు. ఈ విషయము కూడా చర్చించి అందుకు తగిన విధానములను అధ్యాపకులు, ఆచార్యులు తయారు చేయునదిగా కోరిన ఈ విధానము వలన వారికి తగిన శిక్షణ ఇచ్చినట్లయి ఇంకా మంచి విధానాన్ని రూపొందించినవారము అవుతాము. ఉదాహరణకు యుద్ధవిద్యలలో క(రసాము, కత్తి (తిప్పడము, గదా ఉపయోగించడము ఇలా రకరకాల విన్యాసాలు ఉన్నాయి. ఏళ్ళ తరబడి తరతరాలుగా అదే విధానములో విద్యను నేర్పబడుతున్నది. అన్ని వర్గాల వారితో చర్చించిన తరువాత ఈ విధానములో విషయము అదే అయినను బోధన పద్ధతిలో సరాసరి మార్పు రావడం వలన సర్వ(త ఎంతో ఆదరాభిమానములను పొందినది. ముందనుకున్నట్లుగా మహారాజవారి చేతుల మీదుగా ఉత్సవము జరిపి విధానమును వచ్చే నూతన విద్యాసంవత్సరము నుండి అమలు పరిచే విధముగా చర్యలు తీసుకొనబడినవి. సర్వ(త ఈ మార్పు రావడం వలన ఎంతో ఆదరాభిమానములను పొందినది. దేశ విదేశాలలోను ఈ విధానము పట్ల ఆకర్షణ పెరిగినది ఈ విధానమును అధ్యయనము చేయడానికి చాలా దేశాలనుండి (ప్రతినిధులు రావడము వలన ఎంతో (ప్రఖ్యాతి చెందినదిగాను పేరు పొందినది. పర్ణిసోదరులను

అందరు ఎంతో పొగడసాగినారు. వారికి ఎంతో పేరును ఈ విధానము తెచ్చి పెట్టినది. మెల్లి మెల్లిగా ఈ విద్యావిధానము వలన అధ్యాపకులకు ఆచార్యులకు, తల్లిదండ్రులకు ఎంతో ఆదరణ పెరిగినది.

పర్ణిసోదరులు మెల్లి మెల్లిగా ఈ విధానములోను, ఏవైన క్రొత్త పద్ధతులను నిరంతరము ప్రవేశపెడుతూ తమ వంతు భాధ్యతలను పూర్తిగా నిర్వర్తించ సాగినారు. కాలము గడిచన కొలది బాధ్యతలను క్రింద అధికారులకు, ఆచార్యులకు, అధ్యాపకులకు అప్ప జెప్పి ఎక్కువ కాలము శ్రీ మహావిష్ణువు ధ్యానములో గడపసాగినారు. కాలక్రమేణ మెల్లిమెల్లిగా అన్ని రకాల కోరికలకు అనుభవములకు దూరము అవుతూ అన్ని వ్యవహారాలు, ఒకే దృష్టితోను చూస్తూ ఏ విధమైన సంఘటనలను కూడ స్పదించ కుండా అన్నియును ఒకే దృష్టితో చూడడము అలవాటు చేసుకొని అనుభవించసాగినారు. నిర్వికారముగా గడుపుతు ఏ విధమైన వికారాలకు లోను కాకుండా ఎల్లవేళల శ్రీ మహావిష్ణువుతో గడుపుతు ఏది జరిగిన అది శ్రీ మహావిష్ణువు ఇచ్ఛగా భావించసాగినారు. ఇలా కాలం గుడపుతు వయస్సు పైబడడం వలన ఉత్తరాయణ పుణ్యకాలములో తనువును చాలించి సమాధిని పుచ్చుకున్నారు.

అతి త్వరలో జయవిజయుల రెండవ జన్మ వృత్తాంతము పాఠకుల కందచేయబడును.





## ఈ కథలోని పాత్రలు :

| | | | |
|---|---|---|---|
| 1. | ఏకపర్ణి | – | కథానాయకుల తండ్రి |
| 2. | సౌధామిని | – | కథానాయకుల తల్లి |
| 3. | సుఖపర్ణి | – | కథానాయకులు |
| 4. | ముఖపర్ణి | – | కథానాయకులు |
| 5. | రాజు | – | మరుత్తు మహారాజు ప్రయగదేశరపురాజు |
| 6. | రాణి | – | కళాప్రపూర్ణవతి ప్రయగదేశరపు రాణి |
| 7. | పెద్ద కూతురు | – | కలువకుంతల – సుఖపర్ణి భార్య |
| 8. | చిన్న కూతురు | – | సంపంగి హాసిని – ముఖపర్ణి భార్య |
| 9. | రాజకుమారుడు | – | పూర్ణప్రతాపుడు |
| 10. | రాజు తమ్ముడు | – | ప్రచండుడు – సేనాధ్యక్షుడు |
| 11. | కవులు | – | శాండిల్యుడు, పిప్పిలాదుడు, పదార్థుడు |
| 12. | దక్షిణ దేఫపు పండితుడు | – | గిరివరదుడు |
| 13. | కాశిరాజ్య పండితుడు | – | ఓంకారేశ్వరుడు |